# నన్నయ
# భారతములో ఉపమ

డాక్టర్ బి. రుక్మిణి

హైదరాబాదు
1984

# నన్నయ భారతములో ఉపమ

డాక్టర్ బి. రుక్మిణి

హైదరాబాదు 1984

This book is published with the financial assistance of Tirumala Tirupati Devasthanams under their scheme Aid to publish Religious books.

ప్రథమ ముద్రణ 1000 ప్రతులు

C

వెల : రూ. 15-00

పుస్తకములకు :

డాక్టరు బి. రుక్మిణి

1. తెలుగు శాఖ, కాకతీయ విశ్వవిద్యాలయము
విద్యారణ్యపురి, వరంగల్-506 001.

2. 1-8-117/2 చీకటిపల్లి
హైదరాబాదు-500 020

ముద్రణ :

బృందావన్ ప్రెస్
దోమలగూడ, హైదరాబాదు-29.

# తొలిపలుకు

1974 సంవత్సరమున తెలుగు సాహిత్యములో Ph D. పట్టమునకై పరిశోధన మొనర్చవలెనని కాంక్ష కలిగినది. అట్టి కాంక్షను ఆధునిక మహాకవులు ఆచార్య శ్రీ సి. నారాయణరెడ్డిగారికి నివేదించితిని. నీకు ప్రాచీన సాహిత్యమా? ఆధునిక సాహిత్యమా? ఏది ఇష్టమని వారడిగిరి. రెండును ఇష్టమే ఐనను ప్రాచీన సాహిత్యము వైపు మొగ్గున్నట్లు సూచించితిని. ఐనచో ప్రాచీనమహాకవులలో నీ కెవరిష్టులని మరియొక ప్రశ్న వేసిరి. తెలుగు సాహిత్యమునకు రూపురేఖలు తీర్చిదిద్దుటేకాక నిత్యసత్యవచనుడగుటచేత అవిరళజపహోమతత్పరుడగుటచేత తెలుగు కవితాప్రపంచమునకు ఆర్షమగు సంప్రదాయమును ప్రసాదించిన నన్నయభట్టారకుడే ఇష్టుడంటిని. ఒక చిరునవ్వు నవ్వి "ఉపమైకా శైలూషీ" అని ఆలంకారికమతము కనుక నన్నయ భారతమందలి ఉపమాలంకారవైశిష్ట్యమును గూర్చి పరిశోధన సాగించుమని ఆచార్య శ్రీ సి. నారాయణరెడ్డిగా రాదేశించిరి.

భారతమును గూర్చి ఎందరో ఎన్నియో విధములుగా పరిశీలించి అందలి నూతనాంశములను వివరించియున్నారు కవిత్వమును గూర్చియే కాక పాత్రచిత్రణమును భారతీయసంస్కృతికి నిలయమైన మహాభారతప్రశస్తిని గూర్చియు పలువురు విద్వాంసులు అనేక గ్రంథములు వెలయించి యున్నారు ఐనను అలంకారములకు బీజభూతమైన ఉపమా శైలూషిని నన్నయ తీర్చిన విధమెట్టిదో వివరింపవలెనని నాకు కోరిక కలిగినది. లభించిన తెలుగు సారస్వతమునకు ఆదికవి నన్నయ. అలంకారములలో మొదటిది ఉపమ. నన్నయకును ఉపమాశైలూషికిని గల స్థాన మత్యున్నతమైనది. ఉత్తమస్థానమందున్న చర్చనీయాంశములను గూర్చి పరిశోధించిన నూతనాంశములు స్ఫురింపకపోవు. సారమతియైన నన్నయ హృదయమందలి భావములను సహృదయులకు ఉపమ ద్వారా వివరింపదలచితిని.

నాటినుండి ఆచార్య శ్రీ సి. నారాయణరెడ్డిగారి పర్యవేక్షణలో సాగిన నా పరిశోధనాకృషిఫలితమే ఈ సిద్ధాంతవ్యాసము. నా పరిశోధనావ్యాసంగమునకు పర్యవేక్షకులై ఈ నా సిద్ధాంతవ్యాసమును, ప్రత్యక్షరము చూచిన ఆచార్య శ్రీ సి. నారాయణ రెడ్డిగారికి కృతజ్ఞతలు. సంస్కృత సాహిత్యాలంకార శాస్త్రగ్రంథములు సంస్కృత

మహాభారతము చదువుకొన్నప్పుడు అటనట నాకు కలిగిన సందేహములు తీర్చిన డాక్టర్ రవ్వా శ్రీహరిగారికి, డాక్టర్ కొరిడె రాజన్న శాస్త్రిగారికి, డాక్టర్ మాదిరాజు రంగారావుగారికిని కృతజ్ఞతలు. నాకీ పరిశోధనావకాశము కల్పించిన ఉస్మానియా విశ్వవిద్యాలయ అధికారులకు, ఆంధ్ర శాఖాధ్యక్షులైన ఆచార్య శ్రీ బి. రామరాజు గారికి కృతజ్ఞతలు. నాకు Ph.D. ఉపాధి 1978 సంవత్సరముననే లభించినను ఈసిద్ధాంత గ్రంథమట్లే పడియుండినది 1983 సంవత్సరమును 'నన్నయ సంవత్సరము గా పాటించినప్పుడు తిరుమల తిరుపతి దేవస్థానమువారు నన్నయ సాహిత్యమును ముద్రించువారికి సహాయ మొనర్చిరి. ఆ యవకాశమును నేను వినియోగించుకొంటిని

ఈ సిద్ధాంత వ్యాసము ముద్రించుటకు ఆర్థికసహాయ మొనర్చినందుకు తిరుమల తిరుపతి దేవస్థానముల వారికి కృతజ్ఞతలు. ఈ పుస్తకము నింత అందముగా ముద్రించిన శ్రీ బృందావన్ ప్రెస్ వారికి కృతజ్ఞతలు.

24-10-1984,

బి. రుక్మిణి

శా. శ ౧౯౦౬ రక్తాక్షి ఆశ్వయుజ అమావాస్య
దీపావళి.

# ప్రవేశిక

తెలుగు భారతము సంస్కృతభారతమున కాంద్రీకరణమైనప్పటికి స్వతంత్ర మైన ముద్ర కలది వ్యాసకృతమైన సంస్కృతభారతమునకు నన్నయ తెలుగు భారతమునకు కాలమునందెంతయో అంతరము కలదు. ఈమధ్యకాలమున సంస్కృతము నందు కావ్యములు, నాటకములు, అలంకారశాస్త్రము బహుధా వృద్ధిపొందినవి. ఇన్ని వందల ఏండ్ల తరువాత దేశభాషాకవిపై ఆకావ్యనాటకశాస్త్రముల ప్రగాఢమైన ప్రభావము ప్రసరించుటలో ఆశ్చర్యమేమియు లేదు. సోదరభాషలైన తమిళ, కన్నడ భాషల సాహిత్యములతో పరిచయము కూడ కొంతవరకు నన్నయపై పనిచేయుట సహజము. ఈ విధముగా పరంపరాగతమైన సంప్రదాయసంస్కారముల ప్రభావము తత్కాలీనదేశభాషల వాతావరణము, నవనవోన్మేషశాలినియైన స్వీయప్రతిభ ఇవి యన్నియు కలిసి నన్నయ అపూర్వవ్యక్తిత్వనిర్మాణమునకు కారణములై తెలుగులో కావ్యత్వమును సంతరించుకొన్న స్వతంత్రరచనయా ? అన్నంత ఉత్కృష్టముగా భారతము ఆవిష్కృతమైనది.

తెలుగు భాషాస్వత్వము, తెలుగుజాతి ఆలోచనారూపము, సంస్కృతసాహిత్య ప్రభావము, తత్కాలీన పరిస్థితులు (1) సాంఘికములు (2) భాషాగతములు అన్నియు కలిసి కవి మనోదర్పణముపై ప్రతిబింబించునపుడు ప్రభూతమగు సృష్టి సంస్కృత భారతమునకు యథాతథముగా నుండుటకు వీలులేదు. అందువలన ఈ సహజమైన, వాస్తవమైన పరిణామదృష్టితో తెలుగు భారతమును చూడవలెను.

నన్నయభారతమునందలి ఉపమాలంకారములను యథామూలముగా నున్నవి, కొలదిగా ఉన్నవానిని పెంచి వ్రాసినవి, స్వతంత్రములు అని వింగడించి పరిశీలించుట ప్రధానోద్దేశము. చివరిరెండు అంశములందు కవి ఇట్లు చేయుటలోని ఆంతర్యమేమి ?

అన్న ప్రశ్న ఉదయించును. దీనికి సమాధాన మచ్చట నెలకొనియున్న కథాంశమునో సన్నివేశమునో, పాత్రనో, భావమునో ప్రకాశమానము చేయుటకే అని చెప్పవలసి యుండును.

నన్నయ వ్యాసభారతమును దర్శించిన తీరును ఇది స్పష్టము చేయుచున్నది. కవి మనస్తత్వ వివేచనము, కల్పనామతిత్వము దర్శనశక్తి వీనివలన స్వతంత్రమైన ప్రవృత్తిచేత మహాభారతకథావస్తువు కొన్నిమార్పులతో విశిష్టరూపమును సంతరించుకొన్నది. శిల్పమనగా నిపుణమైన కర్మ. ఇది ప్రతిభవలన, నిరంతరాభ్యాసమువలన కళారూపము పొందును. ప్రధానముగా కవి ప్రతిభోన్మీలనమునందే వ్యక్తిత్వము స్ఫుటమగును.మహాకవుల రచనలందు ఈవ్యక్తిత్వము శిల్పకళారూపమున దృష్టమగును. ప్రకృతము ఉపమాలంకారశిల్పము నన్నయభారతమునందు ప్రతిభాస్పర్శచేత నవనవబంధురముగా శిల్పత్వమును పొందినతీరు పరామృష్టమగును.

భారతమునందు ఆదిపర్వము మొదలుకొని స్వర్గారోహణము వరకు రెండువేలకు పైగా ఉపమాలంకారము లున్నవి. నేనెన్నుకొన్న పరిధిలో అత్యంతమూ ప్రధానమైనవి మాత్రము స్వీకరించుట జరిగినది. ఈ సందర్భమున నన్నయ ఉపమాప్రయోగశిల్ప మెట్లు నెరపునో అన్న అంశమును వివరించుట జరిగినది. సంబోధనలందు, సంభాషణ లందు, యథాలాపముగా ప్రయుక్తమైనవన్నియు విడువనైనవి.

నన్నయ తన భారతమున "ప్రసన్నకథాకలితార్థయుక్తి, అక్షరరమ్యత, నానా రుచిరార్థసూక్తి" అన్న కవితాగుణము లున్నట్లు చెప్పినాడు.

> "సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తిలో
> నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప నా
> నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
> భారతసంహితారచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగాన్"

(1—1—26)

వీనిలో నానారుచిరార్థసూక్తి యనగా రుచిరమైన అర్థమును బహువిధములుగా భాసింప జేయుట, విశిష్టమైన మాటలలో నీతిని ప్రబోధించుట యనవచ్చును. ఇది అలంకార సహితముగా ప్రదర్శితమగుటయు చూడవచ్చును. కథను ప్రసన్నమొనర్చుటకై వస్తూన్మీలనము, తత్త్వప్రబోధము, నీతిప్రకాశనము, ప్రకృతివర్ణనము, జీవిత చిత్రణము మున్నగువానియందు నన్నయ ఉపమాలంకారమును భాసింపజేసిన తీరులో ఆతని సునిశితప్రతిభ వ్యక్తమగుచున్నది.

ప్రధానకథకు, ఉపకథలకు సంబంధించినంతవరకు ఆయాచోట్ల ఉపమాలంకార మెట్లు ప్రదర్శితమైనదో ఈపరిశోధనా వ్యాసమున పరిశీలితమగును. కవివృషభులు మహాకావ్యమనియు, లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమనియు స్తుతించు తొలితెలుగు మహాకావ్యమునందలి ఉపమాలంకారమును ఈదృష్టితో పరిశీలించుటయే ప్రకృతోద్దేశము.

వ్యాసుడు మహర్షి, ద్రష్ట, తపస్సిద్ధి పొందినవాడు. కవిత్రయమువారు ప్రతిభామూర్తులు, తత్త్వచింతనగలవారు. మన దృష్టితో సంస్కృత భారతమునకు తెలుగు భారతమునకును నిర్వహణమునం దెంతయో భేదము కలదు. కావున వ్యాస హృదయమును వీరెట్లు అవగతము చేసికొని వ్యాఖ్యానించిరన్న అంశమే ప్రధానమైనది. ఈ దృష్టితో ఉపమాలంకార పరిశీలన సందర్భమున మూలముతో పోల్చిచూచుట జరుగునని మనవి.

ఆంధ్ర మహాభారతమునందలి ఉపమాలంకార వివేచనయందు (1) అమూలకములు (2) భావానుసరణములు (సంస్కృతమున కొద్దిగానున్న అలంకారమును పెంచి వ్రాసినవి) (3) యథామూలకములు (సంస్కృతమున తెలుగున సమానముగా నున్నవి) అని విభాగించుట కవకాశము కలదు. కాని, వ్రాయుటకుపక్రమించుటతోనే ఒకచిక్కు ఏర్పడినది. ఉదాహరణకు - శకుంతలోపాఖ్యానమునందు పుత్రసహితయై శకుంతల దుష్యంతుని కడకు వచ్చినప్పుడు పుత్రుని గురించి మూడు పద్యములు చెప్పబడినవి. అందు రెండు యథామూలకముల క్రిందికి వచ్చును. ఒకటి భావానుసరణము క్రిందికి వచ్చును. వీనిని విడదీసి వేరువేరు చోట్ల అధ్యాయములలో విమర్శించి చూచునపుడు వీని మధ్యనున్న అనుబంధము, సమస్థితి దెబ్బతినుచున్నది.

సన్నివేశము, విషయము, పాత్రలు భావస్థానము ఒకటే. మూడు పద్యముల అవయవస్వరూప మొక్కటే. ఇటువంటి సందర్భమునందు స్వతంత్రములును కలిసి యుండవచ్చును. అందుకై మధ్యేమార్గమవలంబించి నన్నయ (1) స్వతంత్ర వ్యక్తిత్వమును నిరూపించు లక్షణము గలవి స్వతంత్రములని, (2) వ్యాఖ్యానము వివరణము మున్నగు అంశములతో కూడినవి అనుసరణములని రెండు భాగములుగా విభజించి పరిశీలించుట జరిగినది. ఇందులో అవసరమైన చోట్ల ఎక్కడ మూలమునకు సమానముగా నున్నది, లేనిది ఎత్తిచూపుట యైనది. దీనివలన- (1) సాధ్యమైనంత వరకు నిర్మాణరూపమునకు వ్యాఘాతము కలుగదు. (2) నిర్మాణరూపమును ముక్కలు ముక్కలుగా అక్కడ కొంత ఇక్కడ కొంత వేరు చేయుటవలన పాఠకులకు అడుగడుగున అంతరాయము కలుగును. (3) వీనిని వివరించుటలో రెండుచోట్ల సందర్భ

పరిశీలనాంశముల పునరావృత్తి నివారితమగును (4) ఎక్కడికక్కడ ఏదో విభజన దృష్టితోగాక, విషయప్రాధాన్యముతో రచనకు సంపూర్ణత సిద్ధించును.

కావున స్థూలముగా నన్నయ వ్యక్తిత్వమును స్ఫుటీకరించుటకు స్వతంత్రములని, వ్యాసహృదయము అవగతము చేసుకొన్న తీరును వివరించుటకు అనుసరణములని ఇందు, మూలమునకు ఇంచుమించు సరిగానున్నవి యథార్థములని, తద్భిన్నమైనవి తగ్గించి పెంచి వ్రాసినవి అనుసరణములనియు ఆయా సందర్భములందు చర్చితమగును. ఇందు ప్రధానకథ, ఉపకథలు అని కథావస్తువు దృష్ట్యా విభాగించి నన్నయ ఉపమాలంకారశిల్పము ఆవిష్కృతమైనది.

స్థూలముగా ఈసిద్ధాంతవ్యాసమును మూడు భాగములుగా వింగడింపవచ్చును. మొదటిది- అలంకారముల చరిత్ర, ఉపమా ప్రాధాన్యమును గూర్చి తెలుపునది. ఇందు అలంకారశాస్త్రమునకు సాహిత్యవిద్య, సాహిత్యశాస్త్రము పర్యాయపదములుగా భాసించిన విధము, భరతుడు మొదలుగాగల ఆలంకారికుల అభిప్రాయముల వివరణము, ఆనంద వర్ధనుని ధ్వని అలంకారమున కుపయుక్తమయిన తీరు, అలంకార ప్రయోగమునందలి విధినిషేధములు వివరింపబడినవి. ఇంకను ఉపమాప్రాధాన్యము, అందలి విభాగములు, ప్రసిద్ధాలంకారికుల నిర్వచనములు, వివరింపబడినవి రెండవభాగము అవతారిక ప్రధానకథ, ఉపకథలందలి ఉపమాలంకారశిల్పవిధమును వివరించునది. నన్నయ భారత భాగములో 785 ఉపమాలంకారము లున్నవి. వానిలో అవతారికనుండి రెండు, ప్రధానకథనుండి 47 ఉపమలు, ఉపకథలనుండి 29 ఉపమలు స్థాలీపులాక న్యాయముగా ఇందు వివరింపబడినవి.

అవతారిక స్వతంత్రరచన కనుక అందలి ఉపమాలంకారప్రయోగమునందుగల రామణీయకము, ప్రధానకథ, ఉపకథలయందు ఉపమ ఆవిష్కృతమైన తీరు వివరింపబడినది. వీని సమాహారభూతమైన ఉపసంహారమున ఇంతవరకు చర్చింపబడిన ఉపమల విధములు, నన్నయ ఆర్షదృష్టితో వానిని భారతమున ఉపయోగించిన తీరు ఉల్లేఖింపబడినది. మూడవ భాగమునందు ఉపయుక్త గ్రంథసూచికతోపాటు నన్నయ భారతమునందు ప్రయోగించిన మొత్తము ఉపమలు అనుబంధముగా వర్ణక్రమమున తెలుపబడినవి.

ఈ నా అధ్యయనమునకు ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు ప్రకటించిన ఆంధ్రమహాభారతము సంశోధితప్రతిని, సంస్కృతమహాభారతము విద్యావాచస్పతి **P. P. S.** శాస్త్రిగారు పరిష్కరించిన దాక్షిణాత్యప్రతిని (1931) ఆధారముగా గ్రహించితిని.

# అలంకార ప్రకాశనము

సంస్కృతభాషయందు కావ్యమును గురించి జరిగిన ఆలోచనావ్యవస్థకు అలంకార శాస్త్రమని పేరు. ఇది బహుప్రాచీనకాలమునుండియే వాడుకలో నున్నది. మొట్ట మొదట కావ్యమును గురించి వివేచన చేసిన [1]భామహాదులు తమ గ్రంథములందు అలంకారమున కొసగిన ప్రాధాన్యమునుబట్టి దీనికి పేరు సార్థకమైనది. కాలక్రమమున అలంకారమునకు ప్రాధాన్యము తగ్గి చివరకు ఆనందవర్ధనుని ధ్వని సిద్ధాంతమునకు అంగభూతముగా నిలిచినను దీనికీ పేరు వ్యవహారమునుండి చెరగిపోలేదు. దీనికే [2]సాహిత్యవిద్య లేదా [3]సాహిత్యశాస్త్రమనియు ప్రచారము కలిగినవి. ఈ సాహిత్య మన్నమాట తరువాత వచ్చినది. ఆపైన సంగీత సాహిత్యములని కలిపి చెప్పుట జరిగినది. అలంకారపదమునకు ప్రాచుర్యము తగ్గకపోయినను సాహిత్యమన్న మాటకు ప్రశస్తి హెచ్చినది తెలుగునాట సాహిత్యవిద్య సాహిత్య శాస్త్రమను మాటలకన్న అలంకారశాస్త్రమన్న మాటకే అధికప్రచారము కలదు. అలంకారశాస్త్రము, సాహిత్య విద్య, సాహిత్యశాస్త్రము, కావ్యశాస్త్రము అనునవి పర్యాయపదములుగా ప్రవర్తిల్లినవి.

---

1. భామహుడు — క్రీ.శ. 600-750 - భామహాలంకారము/కావ్యాలంకారము
   ఉద్భటుడు — క్రీ.శ 750-850 - కావ్యాలంకార సంగ్రహము
   వామనుడు — క్రీ.శ. 779-813 - కావ్యాలంకార సూత్ర(వృత్తి)ము
   రుద్రటుడు — క్రీ.శ. 825-875 - కావ్యాలంకారము
2. రుయ్యకుని అలంకార సర్వస్వము; విశ్వనాథుని సాహిత్యదర్పణము
3. పంచమీ సాహిత్యవిద్యా-శబ్దార్థయోర్యథావత్సహభావేన సాహిత్యవిద్యా. కావ్య మీమాంస - రాజశేఖరుడు.

సాహిత్యవిద్య లేదా శాస్త్రము గుణాలంకారసహితమగు శబ్దార్థస్వరూపమైన కావ్యమును గురించి హేతుబద్ధముగా చర్చించునది కావున, ఆలోచనా విధానమంతయు కావ్యమునకు సంబంధించినంతవరకు వ్యవస్థిత మగును కనుక కావ్యశాస్త్ర మనియు పేరు వచ్చినది. ఈ సందర్భమున— "వీనినిగురించి లెస్సగా విచారించి చూచినచో సాహిత్యశాస్త్రమన్న పేరే తగినది" [1]అని సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి గారి అభిప్రాయము.

కవిత్వము కేవలము ప్రతిపాద్యవస్తువుచేతనే కాక వస్తువిన్యాసమందలి నేర్పు, నేర్పువలన కలిగిన అందము, అందమునుబట్టి ఏర్పడిన ఆనందము వీనిచేతను అనుభూతిప్రదమై యుండును. ఈ అందము యొక్క మొదటి లక్షణము ఆకర్షణ. ఇది శబ్దముల పోహళింపు మొదలుకొని రసనిర్వహణము వరకు ఎన్నియో విధములుగా పర్యాప్తమై ఉండును. ఇవి అన్నియు కావ్యమునందు ప్రతీయమానార్థమైన ధ్వనికి అంగభూతములు. వీనిలో అలంకారప్రయోగమొకటి అలంకారవైభవమును గుర్తించిన పలువురు ఆలంకారికులు వారి వారి అభిలాష, ప్రీతినిబట్టి సూక్ష్మసూక్ష్మముగా విలోకించి విశ్లేషించి నిర్వచించిరి.

"All poetic expression involves some kind of expressional deviation of beauty, some out-of-the-way-ness This expressional deviation, this striking disposition of words and ideas, is Alamkara, this constitutes the beautiful poetic form."[2]

ఒక కవి రచనలోనే భావాభివ్యక్తిలో వైవిధ్యముండును. అదే భావమును అతడే మరొకమారు చెప్పవలసివచ్చినచో మరొకవిధముగా ఆవిష్కరించును. ఇక పలువురు కవుల అభివ్యక్తి విధానమును గురించి వేరుగా చెప్పనక్కరలేదు. వీనిని విశ్లేషించిన ఆలంకారికులు సూక్ష్మసూక్ష్మతరమైన వైశిష్ట్యమునుబట్టి అలంకారములను పెంచుచు బోయిరి.

"A figure of speech is a deviation from the plain and ordinary mode of speaking for the sake of greater effect. It is an unusual form of speech."[3]

1. కావ్యాలంకార సంగ్రహము. 1 ఆ-పుట 30 — వివరణకర్త-సూర్యనారాయణ శాస్త్రి - సన్నిధానం-(ని. రా. ఆం. సా. పరిషత్ప్రచురణము-1945)
2. Use and abuse of alamkara-P. 94 - Raghavan V. AN INTRODUCTION TO INDIAN POETICS (Macmillan and Company Limited - 1970)
3. Rhetoric and Composition - I - Bain

అలంకారము సులభమైన సాధారణమైన సంభాషణ పద్ధతికన్న భిన్నమైనది. దీనిని ఒక విలక్షణమైన ఆకర్షణీయమైన వాగ్విధారూపముగా పేర్కొనవచ్చును. దీని ప్రయోజనము అధికమైన ప్రభావసంపత్తిని మనస్సుపై ప్రసరింపచేయుటయే.

"అలంక్రియతే అనేన ఇత్యలంకారః"[1] అని అలంకారశబ్దవ్యుత్పత్తి. అలంశబ్దము[2] భూషణము, పూర్ణము, సామర్థ్యము, చాలు అను అర్థములందు ప్రయుక్తము. ఇక్కడ అలంకారమనగా శోభను కలుగజేయునది, పూర్ణత నాపాదించునది, నైపుణీప్రకారమైనది, కావ్యమునందు సౌందర్యము పెంపొందించునది యని అర్థము. దీని ప్రయోజనము సౌందర్యాపాదనము. అనుభూతి గాఢత్వముతో ఆనందమును కలిగించుటయే దాని పని. భాష ఉద్భవించినపుడే అలంకారమును ఉద్భవించినదని చెప్పవచ్చును. మనఃస్థితిని వ్యక్తమొనర్చువేళ గాఢత్వము తీవ్రత్వము, సౌకుమార్యము, ఆర్ద్రత మొదలైన మనోభావములను బట్టి సహజముగా అలంకారసహితమై భాష వెలువడును. పామరజన వ్యవహారమునందు సైతము అలంకారప్రయోగము చూడవచ్చును. దీనికి పెక్కు ఉదాహరణములు పేర్కొనవచ్చును. లోకవ్యవహారమునందు ఈనాటికి, సాహిత్యప్రభావము లేని పల్లెలలోను— "ఆయన ధర్మరాజండీ", "వాడు పిల్లిలా వస్తున్నాడు", "వాడా! పులిపిల్ల", "వీడు పిడుగులా ఉన్నాడే" మొదలైనవి సంభాషణలో నిత్యము వినబడు అలంకారము లెన్నో కలవు. ఈమనోలక్షణము కవిత్వమునందు వివిధరూపములలో రీతులలో ఆవిష్కరణము పొందినపుడు తద్వివేచన జరిగి శాస్త్రబద్ధమై లాక్షణికత్వమును పొందినది. సూత్రబద్ధము కాకమునుపు వ్యాకరణమెట్లు భాషయందు అంతర్గతమై ఉన్నదో అలంకారములును శాస్త్రత్వమును పొందకమునుపు సంభాషణలోను, కావ్యములోను కలవు.

ఋగ్వేదమునందు - అరఙ్కృతి[3] (అలంకృతి) అని కలదు. "అలంకరిష్ణు" శబ్దము (అలం + కృ + ఇష్ణుచ్) అలంకరించు శీలము గలవాడను అర్థములలో మాత్రము కన్పించును. యాస్కుని వేదాంగమగు నిరుక్తము నందు వైదిక ఉపమాద్యోతకములైన 12 నిపాతములు సంకేతింపబడినవి.[4] ఇతడు స్వయముగా ఈ

---

1. గురు బాలప్రబోధిక - పుట 413, వావిళ్ళ ప్రచురణము - 1953
2. అలం భూషణ పర్యాప్తి శక్తి వారణ వాచకమ్-గురుబాలప్రబోధిక-పుట 860
3. కాతే అస్త్యరఙ్కృతిః సూక్తైః కదా
   నూనంతే మఘవన్ దాశేమ - ఋగ్వేదము (ii -29-3)
4. ఇవి ఉపమాలంకారమును గురించి వ్రాయునపుడు వివరింపబడును.

సందర్భమున ప్రాచీనాచార్యులైన గార్గ్యుని పేర్కొని అతని మతమును వివరించెను. దీనిని బట్టి యాస్కునికి పూర్వమే ఉపమాలంకారము చర్చితమైనట్లు ఊహింపవచ్చును.

పాణిని[1] కాలమున ఉపమాలంకారము శాస్త్రత్వమునందు రూఢదశనుపొందినది. పాణిని అష్టాధ్యాయి యందు ప్రయుక్తమైన ఉపమాన, ఉపమిత, సామాన్య, ఉపమా, శబ్దములకే గాక ఔపమ్య, సాదృశ్య శబ్దములకును పతంజలి వ్యాఖ్యానము చేసెను. ఇచ్చటను అలంకారస్ఫూర్తి గుర్తింపవచ్చును.

పాణిని సూత్రములు ఆధారముగా ఉద్భటుని ఉపమాభేదకల్పనము చూడ వచ్చును. బాదరాయణుని వేదాంతసూత్రములందు ఉపమారూపకములు పారిభాషికార్థములందు ప్రయుక్తమైనవి. న్యాయసూత్ర భాష్యకారుడు వాత్స్యాయనుడు ఉపమాన విషయములో 'పతంజలితో ఏకీభవించుచున్నట్లు' కన్పించును[2]. ఈసందర్భమున జరిగిన చర్చ కొంత ఉపమాలంకారవిషయమున ఆసక్తి కలిగించునదిగా ఉన్నది. ఇది తరువాత చర్చింపబడును. రుద్రదాముని శాసనమునందు[3] గద్య పద్యములు అలంకృతము కావలసిన అవసరము ప్రసక్తమైనది.

ప్రాచ్య లాక్షణికులలో ఆద్యుడు భరతుడు[4]. అతడు తన నాట్యశాస్త్రగ్రంథమునందు అలంకారములను గురించి స్పష్టముగా వివేచించెను. భరతుడు నాటకముయొక్క వాచికాభినయమునకు పనికివచ్చు కావ్యము (Text) ను గురించి[5] చెప్పునప్పుడు 36 లక్షణము లుండవలెనని పేర్కొనెను. ఈ లక్షణములతో కూడిన కావ్యపద్ధతులు చేయదగినవి కలవని ఇతని తాత్పర్యము[6]. ఆపైన లక్షణములు నిర్వచించి ప్రతిదాని

---

1. All are agreed that he cannot be later than about 500 B. C - Survey of Sanskrit Literature-p. 246 by - Kunhan Raja C. (Bharatiya Vidya Bhavan-Bombay-First Edition 1962)
2. సామీప్యమానం ఉపమానం - న్యాయసూత్రములు 2-2-3
3. క్రీ.శ. 2వ శతాబ్ది. "విపులకీర్తినా......స్ఫుట మధుర చిత్రకాంత సమయోదారాలంకృత గద్య పద్య......మధిగత మహాక్షత్రనామ్నా."- Indian Inscriptions - By - Bulher - 1913
4. క్రీ.పూ 200-క్రీ శ. 300 వరకు-నాట్యశాస్త్రము- Dr. అప్పారావు P. S. R.
5. The Kavya which is the text of the Drama - Some Concepts of the Alamkarasastra. P. 1. By - Raghavan. V The Adyar Library, 1942
6. కావ్యబంధాస్తు కర్తవ్యాః షట్త్రింశత్ లక్షణాన్వితాః - నాట్యశాస్త్రము - XVII - 169

చివర "కావ్యభూషణ" అని పేర్కొనెను. కావ్యమును విశేషముగా భూషించునది కావ్యభూషణము. ఇక్కడ విశేషమున్న పదము ముఖ్యమైనది. చిత్రార్థ స్ఫూర్తిని కలిగించు ఆభరణములవంటి వివిధ అలంకారములచేతను గుణములచేతను సమలంకృత మైనదని నుడివెను[1]. భూషణప్రబంధమునకు మేఘసందేశము[2] నుదాహరించుట జరిగినది. కారణము ఇందు ప్రతి శ్లోకము అలంకారసహితమై వస్తువుకన్న వర్ణనమునకు ప్రాధాన్యము కలిగి యుండుటయే అని తలచవచ్చును. లక్షణము అలంకారము కన్న భిన్నమైనది. నాటకములో ఇతివృత్తము; సంధ్యంగములు లక్షణము క్రిందికి వచ్చును.

ఇతివృత్తము (Plot) ను వృద్ధిపరచునవి సంధ్యంగములు. రసమును నిర్వహించునవి వృత్త్యంగములు. దీనిని బట్టి లక్షణము అలంకారముకన్న భిన్నమైనదిగా గోచరించును. ఇది అలంకారముచేత భూషితము కావచ్చును. సాముద్రిక లక్షణము మన్నగు వానివలె ఇదియు నాటకలక్షణములను తెలుపు విస్తృతార్థమునందు ప్రయుక్తమైనదిగా భావింపవచ్చును.

లక్షణములు ఒకవిధముగా వృత్తనిర్మాణమునందు సౌందర్యయోజనాత్మకములైనవి. భరతుడు వీనిని స్పష్టీకరించలేదు అలంకారములకన్న భిన్నత్వమును స్థాపించుటకు ప్రయత్నించలేదు. నాట్యశాస్త్రమునందు చెప్పబడిన 36 లక్షణములలో కాలక్రమమున కొన్ని అంతరించి కొన్ని మాత్రమే నిలిచినవి. వీని అర్థము కూడ మారినది. ఉదాహరణమునకు లక్షణ. భావికము అనువాని అర్థములు కాలక్రమమున మారినవని యం. హిరియణ్ణ అభిప్రాయము.[3] ఇది సహజము కూడ ఇక్కడ

---

1. అలంకారైర్గుణైశ్చైవ బహుభిః సమలంకృతమ్
   భూషణైరివ చిత్రార్థై (విన్యస్తై) స్తద్భూషణ మితిస్మృతమ్ -
   నాట్యశాస్త్రము- XVI - 5 (Gaekwad Oriental Series, Baroda1934)
2. "Bhushana prabandha, is Meghaduta" - Some Concepts of the Alamkara saastra P. 9 - Raghavan. V
3. "Some of these concepts, Like Lakshana and bhaavika, are less familiar now than others; but all of them are more or less vague. Hence the need for explaining them. Their antiquity is part-cause of their Vagueness, and the fact that they have frequently shifted their meaning in the course of history has contributed not a little to it"— Art Experience - P - 75 - by Prof. Hiriyanna, M. Kavyalaya Publishers - Mysore - 1954.

గమనించవగిన అంశమేమన దండ్యాదులచేత కొన్ని లక్షణములు హేతు, లేశాద్యలంకారములుగా స్వీకృతములైనవి.

మొదటి లక్షణ నిర్వచనమందు భూషణమన్న పేరు కన్పించును. దీనియందు అలంకారములు, గుణములు రెండును అంతర్భూతములై యుండుట కొంత చర్చకు తావైనది. తరువాత అలంకారముగా భావించుట జరిగినది. నాట్యశాస్త్రమునందు ఉపమా దీపక రూపక యమకములన్న నాలుగలంకారములు నాటకమునకు సంబంధించినవిగా పేర్కొనబడినవి[1]. భరతుడు 5 ఉపమాభేదములను చెప్పెను. ఇంతకు పూర్వము చెప్పినట్లు వైదిక సాహిత్యమునందు ప్రసక్తమైన దానినిబట్టి, వ్యాకరణ, న్యాయశాస్త్రములలో లభించిన ఆధారములనుబట్టి, అలంకారమునకు శాస్త్రత్వమును సిద్ధింపజేసిన భరతుని నాట్యశాస్త్రమునుబట్టి చూచినచో ఉపమాలంకారము చాల ప్రాచీనమైనదని, దీనికి పూర్వము విశిష్టమైన స్థానము కలదని విదితమగుచున్నది. భరతుడు నాలుగలంకారములను, పది గుణములను, పది దోషములను పేర్కొనెను. ఇతడు స్పష్టముగా వ్యక్తము చేయకపోయినను అలంకారము గుణమునకు మధ్య భేదమును గుర్తించినాడని కాణే[2] అభిప్రాయము.

భరతుని తరువాత అలంకారచర్చయందు ప్రముఖముగా పేర్కొనదగిన ఆలంకారికులు భామహ, దండి, ఉద్భటులు. వీరి అభిప్రాయములను క్రమముగా ప్రకాశితమొనర్చినవారు ప్రతీహారేందురాజు[3], రుద్రట[4] జయదేవులు[5].

అలంకారములు కావ్యమునకు ముఖ్యమైనవిగా పరిగణించుటలో భామహ, దండి, ఉద్భట, రుద్రటులు రసమును సహితము అలంకారమునకు అంగభూతముగా నొనర్చి

---

1. "ఉపమా దీపకంచైవ రూపకం యమకం తథా, కావ్యస్యైతే హ్యలంకారాః" - నాట్యశాస్త్రము - XVI - 40
2. Hence he must have made a distinction between them, although he does not express it - History of Sanskrit Poetics - P. 376 - By, Kane, P.V. Motilal Banarsidas. Delhi-6, Third Revised Edition-1961
3. ఉద్భటుని "అలంకారసారసంగ్రహమ్"-లఘువృత్తి-925-950 A.D.
4. శృంగార తిలకమ్ - 950 - 111
5. చంద్రాలోకః - 1200 - 1250

రసవదలంకారముగా పరిగణించిరి. భరతుడు నాట్యశాస్త్రమునందు దృశ్యకావ్యమునకు రసము ముఖ్యమనెను. భామహుడు శ్రవ్యకావ్యమునకు అలంకారము ప్రధాన మనెను. ఇతని గ్రంథము పేరు కావ్యాలంకారము దీనికే భామహాలంకారమనియు నామాంతరము. భామహుడు మాధుర్యము, ప్రసాదము, ఓజస్సు అను మూడు గుణములను పేర్కొనెను. ఇతడు అలంకారములను శబ్దాలంకారములు, అర్థాలంకారములని విభజించెను. భామహుడు చేసిన మరొక ప్రయత్నము కావ్యమునకు అకావ్యమునకు సాలంకారమునకు నిరలంకారమునకు గల భేదమును గుర్తించుట.

"గతో స్తమర్కో భాతీం దుర్యాంతి వాసాయ పక్షిణః
ఇత్యేవమాది కిం సాధ్యం (కావ్యం) వార్తామేనాం ప్రచక్షతే".[1]

సూర్యుడస్తమించెను. చంద్రుడు ప్రకాశించుచున్నాడు. పక్షులు వాసమునకు వెళ్ళుచున్నవి, ఇటువంటి మాటలు కావ్యమా అని ప్రశ్నించి ఇవి యన్నియు "వార్త" క్రిందికి వచ్చునని స్పష్టముగా సమాధానమొసగెను. ఇందులో చారుత్వమేమియు లేదని ఇతని నిశ్చయము. దీనినిబట్టి భామహుని దృష్టి సాధారణస్థితి నతిక్రమించిన అలంకార చారుత్వముపై ఉన్నట్లు సులభముగా గుర్తింపవచ్చును వక్రోక్తి కావ్యమునకు అత్యంతావశ్యకమైనదని ఇదియే సర్వాలంకారములకు బీజభూతమని ఇతని సిద్ధాంతము.

"సైషా సర్వైవ వక్రోక్తిరనయార్థో విభావ్యతే
యత్నోఽస్యాం కవినా కార్యః కోఽలంకారో ఽనయా వినా[2]"

అన్నిటికి వక్రోక్తియే మూలము. దీనిచేతనే అర్థము విభావ్యమాన మగుచున్నది. దీని కొరకు కవి ప్రయత్నించవలెను. ఇది ఇతని విధి. ఇది లేక యేఅలంకారమునకు అస్తిత్వము లేదని ఇతని అభిప్రాయము. ఉన్నది యున్నట్లుగా చెప్పుటకన్న భిన్నముగా చెప్పుటలోనే అందము కలదు. స్వభావోక్తికి భిన్నమైనది వికటోక్తి లేదా వక్రోక్తి. ఇదియే ముఖ్యమైనది. సర్వాలంకారములు దీనియందే అంతర్భవించునని ఇతని విశ్వాసము. అలంకారమునకు సంబంధించిన సంప్రదాయ నిర్మాణమునకు తోడ్పడినవారు భామహునికి పూర్వము కొందరు ఆలంకారికు లున్నట్లు వారి అభిప్రాయముల నితడు మనసునందిడుకొని సిద్ధాంతమున కుపక్రమించినట్లు, ఇతడు ఆయా

1. భామహాలంకారము - II - 87
2. భామహాలంకారము - II - 85

సందర్భములలో ప్రయోగించిన "అన్యే", "కేచిత్", "పరే" అను శబ్దములనుబట్టి భావించుట కవకాశము కలుగుచున్నది.

ఇతని తరువాత పేర్కొనదగినవాడు దండి. ఇతడు భామహునివలెనే శబ్దాలంకారములని అర్థాలంకారములని రెండు విధములుగా విభజించి అర్థాలంకారములను గురించి కొంచెమెక్కువగా రెండవ పరిచ్ఛేదమునందు శబ్దాలంకారములైన యమకాదుల గురించి మూడవ పరిచ్ఛేదమునందు వివరించెను. ఇతడు శ్లేష, ప్రసాదము, సమత, మాధుర్యము, సుకుమారత, అర్థవ్యక్తి, ఉదారత, కాంతి, ఓజస్సు, సమాధి అను పది గుణములను పేర్కొని మొదటిసారి స్పష్టముగా వివరించెను. భామహుడు, దండి ఇరువురు అలంకారములకు గుణములకు భేదము సరిగా గుర్తించలేదన్న విమర్శ కలదు.[1] ఈ సందర్భమున భామహుడు,దండి ఇరువురు భావికమును[2] గుణముగా పేర్కొనుటను ఉట్టంకించుట జరిగినది. దండి పదిగుణములను అలంకారములుగానే విస్తృతార్థమునందు పరిగణించినట్లు ఈ క్రింది శ్లోకమునుబట్టి కొందరు భావించుట జరిగినది.

"కావ్య శోభాకరాన్ ధర్మాన్ అలంకారాన్ ప్రచక్షతే
కశ్చిన్మార్గ విభాగార్థముక్తాః ప్రాగప్యలంక్రియాః"[3]

కావ్యశోభాకరములైన ధర్మములు అలంకారములని చెప్పుదురనుటలో అలంకారమునకు శోభాకరమైన ధర్మము-విస్తృతమైన పరిధిలోనిదే. ఇతని దృష్టిలోని అగ్రామ్యత్వము[4] అలంకారసహితత్వము అలంకార మతమునకు సమీపవర్తిగా చేయుచున్నది కావున అలంకారములను గుణములుగనే భావించినట్లు తలచవచ్చును. ఇతడు

---

1. Bhamaha and Dandi hardly made any distinction between Alamkara and gunas-History of Sanskrit Poetics p. 374-Kane P. V.

2. భావికంతమితి ప్రాహుః ప్రబంధవిషయం గుణమ్. II - 363-5 కావ్యాదర్శము-దండి.

3. కావ్యాదర్శమ్-II-1, 3(Vidyabhavan Samskrita Granthamala,1958)

4. అగ్రామ్యశబ్ద మర్థంచ సాలంకారం సదాశ్రయం
అలంకారపదగ్రామ్యం, అర్థం న్యాయ్య మనాకులమ్-I-19,35-కావ్యాదర్శము.

భామహునికన్న ఎక్కువగా అలంకారసంప్రదాయమునకు చెందినవాడుగా ఆచార్య రాఘవన్ అభిప్రాయము.[1]

దండి రీతిసంప్రదాయమునకు చెందినవాడని పేర్కొనుచు రీతిప్రవర్తకుడైన వామనునికి పూర్వవర్తిగా సుశీల్‌కుమార్‌డే స్వీకరించెను. దీనికి ఉపపోషకముగా ఆచార్య కాణే అభిప్రాయము గమనించదగినది.[2] ఈ సందర్భమున సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు కావ్యాలంకార సంగ్రహమునకు వ్రాసిన వ్యాఖ్యానమందు ఇతని సిద్ధాంతము కొంత అలంకారమునకు మరికొంత గుణమునకు చెందినదని కొందరి అభిప్రాయమనియు కాని గుణస్థాపకుడనుటయే యుక్తి సహజముగానున్నదనియు అభిప్రాయపడిరి.[3]

ఈ దృష్టితో అలంకారములు బాహ్యసౌందర్య పోషకములు; గుణములు అంతస్సౌందర్యపోషకములు. గుణముల తరువాతనే అలంకారములు. రమణీయార్థము చేత విభూషితమైన పదసమూహము కావ్యశరీరమన్న[4] ఇతని మాటలు పై యర్థమునకు చాల బలము నిచ్చునవిగా నున్నట్లు విజ్ఞుల ఊహ.

భామహుడు, దండి ధ్వని లేదా గుణీభూతమన్న మాటలు ఉపయోగించలేదు. కాని ప్రతీయమానార్థమును స్ఫురింపజేయు అప్రస్తుత ప్రశంస, సమాసోక్తి[5] ఆక్షేపాలంకారములు పేర్కొనిరి. ఏ ఉక్తియందు సమాన విశేషణముల వలన అన్యార్థము తెలిసికొనబడునో అది సమాసోక్తియని కలదు. ఇదే విధముగా పర్యాయోక్తియందర్థాంతరము అంతర్భూతమై యున్నది. దీనిని బట్టి వీరి ఊహలో స్పర్శమాత్రముగా

---

1. Really Dandin belongs to the Alamkara School, much more than Bhamaha-Some Concepts of the Alamkara Sastra p. 139-Raghavan V.

2. Dandin's kavyadarsa is to some extention exponent of the Riti school of poetics and partly of the Alamkara School-History of Sanskrit Poetics p. 89-kane P.V.

3. కావ్యాలంకార సంగ్రహము. 2. ఆ. పుట. 95. వివరణకర్త-సూ.నా.శా

4. శరీరం తావదిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ-1-10 కావ్యాదర్శము.

5. యత్రోక్తే గమ్యతేఽన్యోఽర్థ స్తత్సమాన విశేషణః సా సమాసోక్తిః-II-79 భామహాలంకారము.

ధ్వని సిద్ధాంతమున్నట్లు భావించుట జరిగినది. ఆనందవర్ధనుడే ఈగ్రంథిని భేదించెను[1].

కావ్యతత్త్వము భామహునికి సంపూర్ణముగా తెలియదనికాదు. అది దండి వామనాదులకు అస్ఫుటముగా స్ఫురించినది. లేదా స్ఫురించినను ప్రసుప్తమైన స్థితిలో ఉన్నది. ఈ కారణమువలన దీనిని సరిగా వివేచించి స్పష్టముగా నిర్వచించలేకపోయి రన్న భావము చాలా సమంజసమైనదిగా తోచును. ఇది వారిపట్ల గౌరవమునేకాక ఈ సిద్ధాంత పరిణామ స్వరూప రహస్యమును మన్నించుచున్న ఆనందవర్ధనుని పరమోదాత్తమైన వ్యక్తిత్వమును ఆవిష్కరింపజేయుచున్నది. రసమును గురించియు వీరికి తెలియదనికాదు. దండి రసవత్, ఊర్జస్వి నిర్వచనములందు రసస్థితిని నిర్వచించెను[2]. ఆతడు ఎనిమిది రసములు వాని స్థాయి భావములు బాగుగా ఎరిగినట్లు కన్పించును.[3]

ఉద్భటుడు మొదట శబ్దాలంకారములు, అర్థాలంకారములు నాల్గింటిని చెప్పెను. ఉద్భటుడు భామహాలంకారముపై వివరణ వ్రాయుచు "రసవత్" అను మాటను నిర్వచించుచు స్థాయిభావ, విభావ, సంచారి (వ్యభిచారి) భావములను పేర్కొనెను.[4] ఈ సందర్భములో P. V. కాణే మాటలు పరిశీలనార్హములు. వీరికి రసవిషయమై స్ఫూర్తి కలదు కాని దీనిని కావ్యమున కన్వయించు పద్ధతి నన్వేషించలేదు[5] ఈ మాటలలో

---

1. అస్ఫుట స్ఫురితం కావ్యతత్త్వ మేతద్యథోదితం
అశక్నువద్భిర్వ్యాకర్తుం రీతయ స్సంప్రవర్తితాః - III - 46 ధ్వన్యాలోకము
**(Kashi Sanskrit Series 1940).**

2. మధురం రసవద్వాచి వస్తున్యపి రసస్థితిః-I-51-కావ్యాదర్శము.

3. ఇహ త్వష్ట రసాయత్తా రసవత్తా స్మృతా గిరాం,
ప్రాక్ప్రీతిర్దర్శితా సేయం రతిః శృంగారతాం గతా-II- 292, 281-కావ్యాదర్శమ్ దండి.

4. రసవద్దర్శిత స్పష్ట శృంగారాది రసోదయం
స్వశబ్దస్థాయి సంచారి విభావాది నయాస్పదం — కావ్యాలంకార సార సంగ్రహమ్ - IV.

5. **These writers were well aware of the existence of rasa, but they had not found out how to apply the theory to Kavya in general-Hist. of Sanskrit Poetics p. 374**

యాథార్థ్యము లేక పోలేదు. వామనుని మతమున "సౌందర్యమలంకారః[1]" అలంకార మనగా కావ్యసౌందర్య రూపమే. ఇక్కడ సౌందర్య రూపమును విస్తృతార్థమునందు స్వీకరించుటే ఉచితము. సౌందర్య మలంకారః, కావ్యం గ్రాహ్యం అలంకారాత్ అని వామనుడు. మొదటిదానిలో అలంకారమనగా సౌందర్య రూపము. ఇది కావ్యమునకు శోభాకరమైనదిగా భావించెను. ఇచట సౌందర్య తత్త్వముపై ఇతని దృష్టి ప్రసరించుట ప్రత్యేకముగా గుర్తించదగినది. రెండవదానిలో అలంకారమువలన కావ్యత్వసిద్ధి చెప్పబడినది. కావ్యశోభను కలిగించు ధర్మములే గుణములు. దీని అతిశయమునకు హేతువులు అలంకారములనుటలో[2] అలంకారముల కితడొసగిన ప్రాధాన్యము సువిదిత మగుచున్నది. ఇతడును రసమును రసవదలంకారముగనే పరిగణించెను. ఈతడు భామహ, దండి సిద్ధాంతములను రీతితో సమన్వయించి రీతి సిద్ధాంత స్థాపకుడుగా విశిష్టత నొందెను.[3]

తరువాత పేర్కొనదగిన ఆలంకారికుడు ఉద్భటుడు. ఇతడు భరతుని నాట్య శాస్త్రమునకు వ్యాఖ్యానము, భామహుని కావ్యాలంకారమునకు వివృతి, కావ్యాలంకార సంగ్రహము వ్రాసెను. మొదటిది దొరకలేదు. దొరికిన గ్రంథములనుబట్టి ఇతడు భామహుని అలంకారసంప్రదాయముపై ప్రత్యయము కలవాడుగా కన్పించును. ఆనందవర్ధనుడు అభినవగుప్తుడు ఇతనిని పేర్కొనుట చేత ఇతని అభిప్రాయములపట్ల వారికిగల గౌరవము స్పష్టముగా తెలియుచున్నది. రసవదాద అలంకార విషయములో ఇతడు భామహుని అనుసరించెను. ఇతడు 41 అలంకారములు పేర్కొనెను.

రస సిద్ధాంతముచేత ప్రభావితుడైనప్పటికి రుద్రటుడు (క్రీ.శ. 825-875) అలంకార సంప్రదాయమునకే చెందినవాడుగా కన్పించును. ఇతడు కావ్యాలంకారము గ్రంథమందు 16 పరిచ్ఛేదములలో 10 పరిచ్ఛేదములు అలంకారములకే వినియో

---

1. కావ్యాలంకార సూత్రవృత్తి-I - 1, 2.

2. కావ్యశోభాయాః కర్తారో ధర్మా గుణాః
తదతిశయ హేతవస్త్వలంకారాః-III - 1, 2-కావ్యాలంకార సూత్రములు.

3. Although, like Bhamaha and Dandin, Vamana acknowledges the omnipresence and utility of Alamkara as a means of poetic expression, he yet elaborates, after Dandin a theory of Riti-Guna to explain the Visesa of sabdaartha - sahitya - Some problems of Sanskrit Poetics p 11, De, S.K. (Firma K L. Mukhopadhyay, Publishers-I Edition 1959)

గించెను. తక్కిన రెండు పరిచ్ఛేదములలో రసమును గురించి వ్రాసెను. అలంకారములను శబ్దాలంకారములు, అర్థాలంకారములని విస్పష్టముగా విభజించెను. ఇతడు రసముపై తక్కువ చూపు కలవాడు కాదు. కాని అలంకారములకు ప్రాధాన్య మొసగెను.

కుంతకుడు వక్రోక్తియందు అలంకారములన్నియు అంతర్భవింపజేసి వక్రోక్తి వలననే వైచిత్ర్యము సిద్ధించునని అభిప్రాయపడెను. "వైదగ్ధ్య భంగీ భణితి" అన్న మాటలలో అభివ్యక్తి విధానమందు 'భంగీ' అనగా ప్రత్యేకమైన రీతి, విచ్ఛిత్తి అనియు వైదగ్ధ్యమనగా కవి నైపుణ్యమనియు గ్రహింపవచ్చును. కవివ్యాపారవక్రత ఇతని దృష్టిలో కవిత్వమునకు మూలభూతమైన ఆశ్రయ స్థానము. ఇతని భణితీ ప్రకారమైన వైచిత్రి (వక్రోక్తి) రుయ్యకుని ఉక్తి వైచిత్రి ఐనది. ఇది కవి ప్రతిభాధీనమైనది.

మమ్మటుని (క్రీ.శ. 1050-1101) గుణములు మూడు. ఇవి శౌర్యాదులవలెనే కావ్యాత్మ యొక్క గుణములు. ఇవి రసముతో సదా కూడియుండుననియు శరీర భూషణాదులవలెనే అలంకారము లుండుననియు[1] ఇతని అభిప్రాయము.

భోజుడు అలంకారమునకు గొప్ప ప్రశస్తిని కలిగించినవాడు. గుణములు కావ్యశోభాకరము లగుటకు కారణము అలంకారములని భావించెను[2] ప్రబంధాలంకారమును కూడ కనిపెట్టెను. భోజుడు శబ్దార్థాలంకారములు ఒక్కొక్కటి 24 చొప్పున మొత్తము 48 విపులీకరించెను. భోజుడు సరస్వతీ కంఠాభరణమునందు[3] వాఙ్మయమును వక్రోక్తి, రసోక్తి, స్వభావోక్తి అని విభజించి శృంగార ప్రకాశమునందు వీనిని వివరించెను. శబ్దాలంకారములు బాహ్యములని, అర్థాలంకారములు ఆభ్యంతరములని ఇతని అభిప్రాయము. శరీరమున కత్యంతసన్నిహితములైన అలంకార విశేషములతో వీనిని పోల్చెను.

రుయ్యకుడు (క్రీ.శ. 1135-1150) అలంకారసర్వస్వమునందు అర్థాలంకారములను సహేతుకముగా విభజించెను. ఇతడు జయదేవునకు కొంచెము పూర్వుడు.

1. హారాదివ దలంకారా స్తేఽనుప్రాసోపమాదయః - VIII - 2-కావ్యప్రకాశము
2. సరస్వతీకంఠాభరణము-V-8
3. "తత్ర అలంకార సంసృష్టేః ఇత్యేవ వక్తవ్యే నానాలంకార గ్రహణం గుణరసానా ముపసంగ్రహార్థం తేషామపి కావ్యశోభాకరత్వేనాలంకారత్వాత్"

అర్థాలంకారములను ఏడు విధములుగా పేర్కొనెను. అవి 1) సాదృశ్య (ఉపమా, రూపక) 2) విరోధ (విరోధ, విభావనా, విశేషోక్తి) 3) శృంఖలాబంధ (కారణమాలా ఏకావళీ) 4) తర్కన్యాయ (కావ్యలింగ, అనుమాన) 5) కావ్యన్యాయ (యథాసంఖ్య పర్యాయ, పరివృత్తి) 6) లోకన్యాయ (ప్రత్యనీక, ప్రతీప, మీలన) 7) గూఢార్థ ప్రతీతి (సూక్ష్మ, వ్యాజోక్తి) మూలకములు.

అలంకారములు జయదేవుని (క్రీ. శ. 1200-1250) చంద్రాలోకమునందు సులభమైన పద్ధతిలో నిర్వచనోదాహరణములతో వివరింపబడినవి. చంద్రాలోకము పది మయూఖములుగా విభక్తమైనది. ఇది అనుష్టుప్ ఛందస్సులో అత్యంత సులభ సుందరమైన శైలిలో స్వీయోదాహరణములతో ఉల్లేఖింపబడినది.

ప్రతాపరుద్రయశోభూషణ కర్త విద్యానాథుడు (క్రీ. శ. 14 శతాబ్ది ప్రథమ భాగము) తన గ్రంథమును కారిక, వృత్తి, ఉదాహరణమని మూడు దశలుగా విభజించెను. ఇతడు శబ్దాలంకారములు, అర్థాలంకారములు, మిశ్రాలంకారములని మూడు విధములుగా విభజించి 7,8,9 ప్రకరణములందు అర్థాలంకారములను వింగడించి గుణములతో భేదమును పేర్కొనెను. దీనికి మల్లినాథుని కొడుకు కుమారస్వామి 'రత్నాపణ'మను ఉత్తమవ్యాఖ్యానము వ్రాసెను. విద్యానాథుడు గుణములు సంఘటనాశ్రయములని అలంకారములు శబ్దార్థాశ్రయములని చక్కగా వివరించెను.[1]

కువలయానందకర్త అప్పయ్యదీక్షితులు (క్రీ శ. 1554-1626) పెక్కు నిర్వచనములు ఉదాహరణములు స్వీకరించి[2] వలసినచోట వివరించి క్రొత్త అలంకారములను వివరించెను. ఇతనిదే మరొక గ్రంథము చిత్రమీమాంస. ఇందు మొదట కారికలతో లక్షణము నిర్వచించి తరువాత వచనమునందు ఇతరుల అభిప్రాయములు చర్చించి ఒక పరిష్కారమునకు వచ్చుట కన్పించును. శబ్దచిత్రములని, అర్థచిత్రములని రెండు భాగములుగా విభజించి శబ్దచిత్రములు శోభారహితములని అర్థచిత్రములు శోభాసహితములని పేర్కొనెను. వివిధ కాలములలో భారతీయ సాహిత్యశాస్త్ర మీమాంసకులు చెప్పిన అలంకారముల వివరణమీ క్రింది పట్టికలో కాననగును.

---

1. సంఘటనాశ్రయా గుణాః శబ్దార్థాశ్రయాస్త్వలంకారాః.
2. "యేషాం చంద్రాలోకే దృశ్యంతే లక్ష్యలక్షణశ్లోకాః, ప్రాయస్త ఏవ తేషామితరేషాం త్వభినవా విరచ్యంతే."-1-5

| కర్త | కాలము | గ్రంథము | శబ్ద | అర్థ | మిశ్ర | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| భరతుడు | క్రీ.పూ.200-క్రీ.శ.300 | నాట్యశాస్త్రము | 1 | 3 | — | 4 |
| భామహుడు | క్రీ.శ 600 — 750 | కావ్యాలంకారము | 2 | 36 | — | 38 |
| దండి | క్రీ.శ.600 — 750 | కావ్యాదర్శము | 2 | 35 | — | 37 |
| ఉద్భటుడు | క్రీ.శ.750 — 850 | కావ్యాలంకార సార సంగ్రహము | 4 | 37 | — | 41 |
| వామనుడు | క్రీ.శ 779 — 813 | కావ్యాలంకార సూత్రము | 2 | 31 | — | 33 |
| రుద్రటుడు | క్రీ.శ.825 — 875 | కావ్యాలంకారము | 5 | 68 | — | 73 |
| భోజుడు | క్రీ.శ.1005–1054 | సరస్వతీ కంఠాభరణము | 24 | 24 | 24 | 72 |
| మమ్మటుడు | క్రీ.శ.1050–1101 | కావ్యప్రకాశము | 6 | 59 | 2 | 67 |
| రుయ్యకుడు | క్రీ.శ.1135–1150 | అలంకార సర్వస్వము | 9 | 73 | 2 | 84 |
| జయదేవుడు | క్రీ.శ 1200–1250 | చంద్రాలోకము | 6 | 100 | — | 106 |
| విశ్వనాథుడు | క్రీ.శ.1300–1380 | సాహిత్య దర్పణము | 11 | 75 | 2 | 88 |
| విద్యానాథుడు | 14 శ. ప్రథమభాగము | ప్రతాపరుద్ర యశోభూషణము | 5 | 66 | 2 | 73 |
| వారణాసి ధర్మసూరి | 1400–1425 | సాహిత్య రత్నాకరము | 5 | 68 | — | 73 |
| అప్పయ్య దీక్షితులు | 1554–1626 | కువలయానందము | — | 124 | — | 124 |
| జగన్నాథ పండితరాయలు | 17వ శతాబ్దము | రసగంగాధరము | — | — | — | 69 |

అలంకారముల సంఖ్యను గురించి P.V. కాణే "The number of Alankaras separately named by various writers excees two hundred" అని పేర్కొనెను.[1]

1. History of Sanskirt Poetics - P. 375

"సహస్రశోऽపి మహాత్మభిరన్యైః అలంకారప్రకారాః ప్రకాశితాః ప్రకాశ్యంతే చ"[1]

అలంకారమతము అత్యంత ప్రాచీనకాలమునుండి వచ్చునదియే. అది భామహ, ఉద్భట, దండి, వామన, రుద్రటాదులతో ప్రశస్తికెక్కినది. అలంకారవాదులచే వివేచితమై కావ్యమున రసము సైతము ఒక దశలో అంగభూతముగా పరిగణితమైనది. ఒకవిధముగా రుద్రటునితో అలంకారయుగ పరిసమాప్తిరేఖ కన్పించినను తరువాత వచ్చిన భోజుడు శృంగారప్రకాశమునందు అలంకారమునకు ఒసగిన ప్రాధాన్యము ప్రముఖమైనది[2] సౌందర్య మలంకారమన్న మాటను[3] కేవలము కటకకేయూరాదులకు మాత్రమే పరిమితముచేయక విస్తృతమైన పరిధిలో ఆలోచింపవలసి యున్నది. ఈ సందర్భమున పూర్వము పేర్కొన్న "కావ్య శోభాకరాన్ ధర్మాన్ అలంకారాన్ ప్రచక్షతే" అన్నమాటను కూడ పరిశీలించవలసియుండును.

కావ్యమునకు శోభాకరములైన ధర్మములు అలంకారములుగా భావితమగుటలో ఈ శోభ కావ్యమునందు పర్యాప్తమై విశిష్టలక్షణముగా వ్యక్తమగుచున్నది. హృద్యత దేని లక్షణము. దీని పరిధిలోనికి రాని అంశము కావ్యమునందుండుటకు వీలులేదన్న అభిప్రాయమునకాస్కారము కలుగుచున్నది. "సర్వోపిహ్యలంకారః కవిసమయ ప్రసిద్ధ్యనురోధేన హృద్యతయా కావ్యశోభాకర ఏవ అలంకారతాం భజతే"[4]. సర్వము అలంకారమే. కవిసమయ ప్రసిద్ధ్యనురోధముచేత హృద్యతచేత కావ్యమునకు శోభ కలిగించునదే అలంకారతను భజించునని పైన చెప్పినదానినిబట్టి అలంకారమునకిత డొసగిన ప్రాధాన్యము ఊహింపవచ్చును.

ఆనందవర్ధనుని రాకతో అలంకారము కావ్యాత్మ కంగభూతముగా స్థాపిత మైనప్పటికి అలంకారధ్వనిగా గుర్తింపబడుటలో దీని ప్రాధాన్యము శిఖరస్థాన

---

1. ధ్వన్యాలోకము I - P. 4
2. Gunas, Alankaras, Ritis, Vrttis, Sandhis, Lakshanas, Rasas, Language, metre, form of composition, namely, epic, drama, etc., - why everything is Alankara to Bhoja - Some concepts of the Alankara sastra. P. 260 - Raghavan V.
3. కావ్యాలంకార సూత్రము - I - 2
4. చిత్రమీమాంస. పుట 6. అప్పయ్య దీక్షితులు

మందుకొన్నది. "వస్తుతో ధ్వన్యాత్మైవాలంకార్యః"-1 వస్తుతః ధ్వన్యాత్మయే అలంకరింపదగినది అన్న అభినవగుప్తుని సమాలోచనములో కొంత విచారణీయాంశము కలదు. కేవలము ధ్వనిశాస్త్రమర్యాద ననుసరించినంత మాత్రమున ప్రయోజనము లేదు. అతి సుందరముగా హృద్యముగా నుండవలెను అప్పుడే అనంతపర్యవసాయి యగును.[2] ఈమాటలు బహుజాగరూకతతో మననము చేయవలసినవిగా కన్పించును. కావ్యమునకు ఆత్మయైన ధ్వని శాస్త్రత్వము కలిగియున్నంత మాత్రమున సరిపోదు.[3] ఆత్మయొక్క వ్యక్తరూపము రమణీయముగా నున్నప్పుడే హృదయావర్జకమగును. శబ్దము, భావము ఆవిష్కారమన్న త్రివశత్వముతో ప్రతీయమానార్థమువరకు ఇవి ప్రసరించియుండును.

"శబ్దార్థయోః చారుత్వం స ధ్వనిః."[4] శబ్దార్థముల చారుత్వము ధ్వని అని అభినవగుప్తుని అభిప్రాయము. ఇక్కడ ఒక సూక్ష్మమైన అంశము కలదు. శబ్దార్థములకు ప్రాధాన్యము కలుగుటచేత ధ్వనిసిద్ధాంతమునకు వ్యాఘాతము కలుగ వచ్చునని ఊహించి బాలప్రియా వ్యాఖ్యానకారుడు "యతశ్చారుత్వమ్ అర్థాత్ యశ్చారుత్వహేతుః సధ్వనిః" అని చారుత్వహేతువును పేర్కొనుటచేత సమస్య పరిష్కృతమైనది. చారుత్వము స్వరూపనిష్ఠము, సంఘటనాశ్రితము అని రెండు విధములు. ఇవి




1. ధ్వన్యాలోకము—లోచనము- II -109 (Chowkhamba 1965)
2. ఈమాటలు పైన చెప్పబడిన "అలంకార్యః" అనుదానికి వ్యాఖ్యానరూపములుగా భావింపవచ్చును.

The same condition of necessity of beauty applies to Dhvani also. It is not enough if one tries to point out in a case the existence of some technical Dhavani. Even Dhvani has to be beautiful-Someconcepts of the Alankara sastra-P.262. Raghavan-V.

3. కావ్యస్యాత్మా ధ్వనిః-ధ్వన్యాలోకము.I-1
4. ధ్వన్యాలోకము - లోచనము - పుట 18

రెండును ఒక్కొక్కటి శబ్దచారుత్వ, అర్థచారుత్వ, భేదములచే మరల రెండు విధములు. దీనినిబట్టి విస్తృతార్థమునందు అలంకారము చారుత్వాతిశయముచేత చిత్ర చిత్రముగా వ్యాపారితమగును. ఈ విధముగా అలంకారము కావ్యమున కంగ భూతముగా పర్యవసితమైనప్పటికి అలంకారధ్వనిగా లక్షితమై సాహిత్యశాస్త్రమునందు అర్హమైన స్థానమును పొందినది.

ఆనందవర్ధనుడలంకారధ్వనిని గుర్తించుటతో అలంకారము ఆభరణప్రాయమైన దశను దాటినదని చెప్పవచ్చును అలంకారము ప్రతీయమానస్థితిలో అతిలోకత్వమును పొంది కావ్యాత్మయగునని ఇతని అభిప్రాయము. కొందరిచే కేవలము శరీరన్యస్తము లైన ఆభరణప్రాయముగా మరికొందరిచే చారుత్వాతిశయ సంపన్నముగా భావితమైనది. ఆత్మరక్షణదశకు అధిరోహించు శక్తి కేవలము కవి ప్రతిభవల్లనే సాధ్యము. అలంకార, గుణ, రీతి వాదములకు మధ్య సుసంబంధము స్థాపించి ఇవి ధ్వనికెట్లు సముపస్కృతములో యుక్తియుక్తముగా అన్వయించుటలో ఆనందవర్ధనుని అసాధారణ మైన ప్రజ్ఞ పరిస్ఫుటమగుచున్నది. ఇంకను భరతుని రససిద్ధాంతమును వివేచించి పరిహరింపక వస్తు, అలంకారములతోపాటు రసమునుకూడ ధ్వనిగా అంగీకరించుటలో ఇతని సమన్వయశీలము ఉదాత్తలక్షణము వ్యక్తమగుచున్నది. అలంకారము శరీరము నకు సంబంధించినదైనప్పటికి ధ్వన్యంగత్వమును పొంది కావ్యశోభాకరమగుట వాచ్యముగా కాక వ్యంజితమైనపుడే సుసాధము.[1] ఇక్కడ అభినవగుప్తుడు గొప్ప వ్యాఖ్యానము చేసెను. బాహ్యాలంకారములైనప్పటికి "రసాక్షిప్తత", "అపృథగ్యత్న నిర్వర్త్యత" "సంశ్లిష్టత" వీనివల్ల ఇది నిర్మాణమునందు ఏకరూపతను భజించునని వివరించెను.[2] ఇది అలంకార సంప్రదాయమునకు శిఖరభూతమైన స్థితిని కలిగించునది. ఇంకను కేవలము అలంకారమునే కావ్యాత్మగా స్వీకరించుట ఎటుల సాధ్యమన్న ప్రశ్నకు—"పిల్లలు ఆటలో రామపాత్ర నిర్వహించుచు తాత్కాలికమైన మహనీయా

---

1. శరీరీకరణం యేషాం వాచ్యత్వేన వ్యవస్థితం
తేఽలంకారాః పరాం ఛాయాం యాంతి ధ్వన్యంగతాం గతాః-
II - 28 - ధ్వన్యాలోకము

2. రసాక్షిప్తతయా యస్యబంధః శక్యక్రియో భవేత్
అపృథగ్యత్న నిర్వర్త్యః సోఽలంకారో ధ్వనౌ మతః - II - 16 -
ధ్వన్యాలోకము

వస్తువు, తాదాత్మ్యమును మానసికముగా పొందునట్లు అలంకారము వ్యంజితమైనపుడు ఉత్కర్షను పొంది కావ్యాత్మలక్షణము పొందునని అభినవగుప్తుని సమాధానము.[1] ఇక్కడ సాధారణమైన కటక, కేయూరాదుల రూపము నతిక్రమించి, వ్యంగ్యరూపము ధరించి అలంకారము ఉదాత్తతను భజించి ఔచితీవిలసితమై కావ్యశోభావహమగుచున్నది. రససమాహితచేతస్కుడైన కవిప్రతిభచేత[2] ఔచితీపూర్ణస్థితిని పొందుటవలన అలంకారము రసభావపరముగా సహజముగా ప్రవర్తిల్లును. ఈ స్థితి ఏదో ఒక కారణముచేత విశ్లథమైనపుడు వర్ణనాచాపల్యముచేత అలంకారనిర్వహణమునందు క్షతి కలుగును.

ఆనందవర్ధనుడు వచ్చునాటికి సంస్కృత సాహిత్యమునందు కృత్రిమ వాతావరణము నెలకొని యుండుటవలన అలంకారబాహుళ్యము, క్లిష్టమైన దురవగాహమైన గ్రథనప్రకారము పరిపాటి ఐనది. ఇతడు అట్టి పరిస్థితులలో అలంకారముల స్థానము ఎత్తిచూపించవలసివచ్చినదేమో అనిపించును.

అలంకారమును ఔచితీపూర్వముగా నిర్వహించుట గొప్పకళయే. ఆత్మ - దేశకాలాధీనమై గుణసహితమైన వ్యక్తరూపమును పొందినప్పటి స్థితియే కావ్యజీవితము సందును చూడవచ్చును. శరీరి కనుముక్కుతీరు, ముఖము, అవయవనిర్మాణము, పలుకు, ఊహ, ప్రవర్తన - ఒకటేమిటి ప్రతి స్పందనలో అలంకారము కలదు. ఆత్మ, చైతన్యకేంద్రము. రసవస్తుధ్వనులతోపాటు అలంకారమును గుర్తించుటలో ఆనందవర్ధనుని ఆంతర్యస్వరూపమిది. అలంకారము వ్యర్థము కాదు భారావహము కాదు ప్రతిభాహీనులు వర్ణనాచాపల్యముతో అవకాశము దొరికినదే తడవుగా లేదా కల్పించుకొనియో అదేపనిగా వ్యాపకశీలురగుటవలన కొంత అపప్రథ వచ్చినది. నిజమునకు వస్తూన్మీలనము, పాత్రచిత్రణము మనస్తత్వ ప్రకాశనము అనువానికన్న వర్ణనయే సులభమైనది.

---

1. ఆత్మతాయాస్తు కా సంభావనా! ఏవం భూతా చేయం వ్యంగ్యతా యదప్రధానభూతాపి వాచ్యమాత్రాలంకారేభ్యః ఉత్కర్ష మలంకారాణాం వితరతి బాలక్రీడాయామపి రాజత్వ మివేత్యముమర్థం మనసి కృత్వాహ - తత్రేతి-లోచనము - పుట 117

2. అలంకారాంతరాణి హి నిరూప్యమాణ దుర్ఘటాన్యపి రససమాహిత చేతసః ప్రతిభానవతః కవేః అహం పూర్వికయా పరాపతన్తి - II-15, 16-ధ్వన్యాలోకము (Karnataka University - Dharvar-1974)

అలంకారప్రకాశనము వాల్మీకి, కాళిదాసు, నన్నయ, తిక్కన మొదలగు మహనీయుల రచనలలో సహజమై సుందరమై భాసించుచు కన్పించును. అలంకారము రసోపస్కారకమై[1] రసానుభూతికి దోహదకారి ఐనంతవరకు ప్రవాహమున తరంగ రూపమే. రసము ఆస్వాదనైకప్రాణితము లేదా చర్వణైక ప్రాణితము. అలంకారము యొక్క ధర్మము ప్రభావశక్తిని పెంపొందించి కవి చెప్పదలచుకొన్న దానిని సూటిగా సుందరముగా వ్యక్తము చేయుటకు ఉపకరించుటే కాని సంక్లిష్ట వాతావరణమును కల్పించుటకు కాదు.[2]

సుప్రసిద్ధాలంకారికుల అభిప్రాయములను పరిశీలించినచో తేలిన అంశము లేమనగా అలంకారము వస్తూన్మీలనమునకు అవసరమైనచోట రామణీయకమునకు భంగము కాకుండ ప్రయోగింపవలెను. వస్తువును గ్రసించు చాపల్యము పనికిరాదు అలంకారమెపుడును విస్తృతమై దురవగాహమైన సంకీర్ణతను భజించరాదు. అలంకారము అలంకారముకొరకు కాక కావ్యవ్యవస్థలో సుసంయోజితము కావలెను. అప్పుడే సౌందర్యవిలసితమగును. జీవితమునందు ఒక వస్తువు మరొక వస్తువుపై, ఒకమాట మరొకమాటపై, ఒక ప్రవర్తన మరొకప్రవర్తనముపై, ఒక వర్ణము మరొకవర్ణముపై, ఒక భావము మరొకభావముపై, ఒక సంఘటన మరొకసంఘటనపై ఈ విధముగా అనంతముగా ఒకదానిపై ఒకటి ప్రభావము నెరపినట్లుగా కావ్యనిర్మాణమునందు భిన్నాంశముల తీర్పు ఉండును. కవికి దీనిని తీర్చుటలో అలంకారదృష్టి ఉండవలెను. ఇవి అన్నియు పరస్పరము దోహదకారులై సంపూర్ణమైన అనుభవమునందు పర్యవసింపజేయుననుటలో విప్రతిపత్తి లేదు. నేర్పుతో కూడిన అందమైన రూపమే శిల్పము. ఇది అలంకారగతమై అలంకారశిల్పమగును. అలంకారము వస్తూన్మీలనముతోపాటు రసనిర్వహణమునందును ఎంతయో సహాయకారి అనుటలో అనేకమైన ఉదాహరణము లొసగవచ్చును. వాల్మీకి రామాయణమునందు భరతుడు అయోధ్యకు వచ్చునపుడు కరుణరసోపేతమైన అయోధ్యావర్ణనము చూడవచ్చును. వాల్మీకి సుందరకాండలో ఆరంభమందు హనుమంతుని ఉత్ప్లవనవేళ దీర్ఘమైన అలంకారవిన్యాసము కలదు. ఇది

---

1. Rasa is an emotion excited by artistic circumstances or situations. - The theory of Rasa - P. 37 - Dasgupta S. N. (An Introduction to Indian Poetics)

2. The function of Alamkara is to heighten the effect; It is to aid the poet to say something more pointedly— Use and abuse of Alamkara - P. 101 - Raghavan V.

పాఠకునకేమాత్రము విసుగు కలుగనీయదు. ఇంతకుముందు చెప్పినట్లు ఆనందవర్ధనుడు పేర్కొన్న "ఉత్కర్షను" కలిగించుచు హనుమంతుని విక్రమగతమైన వీరాద్భుత రసదీప్తికి దోహదము కలిగించుచున్నది. అలంకారము రసాభిముఖముగా నిర్వహింపబడినపుడు కావ్యమునకు చెప్పరాని శోభ చేకూరును. ఒక్కొక్కప్పుడు సుదీర్ఘమైనను ఇంతకుముందు పేర్కొన్న రీతిని రసాక్షిప్తముగను, అపృథగ్యత్న నిర్వర్త్యముగను నిబద్ధమైనచో శోభావహమగును. ఇది కవి ప్రతిభాధీనమైనది. ఒక్కొక్కప్పుడు కొన్ని రసములను నిర్వహించుటయందు కొన్ని అలంకారములను నిషేధించుట జరిగినది. ఉదాహరణకు – శృంగారము ప్రధానరసముగా నిర్వహింపబడునపుడు అనుప్రాసాలంకారము రసపరిణామమునకు ఉపయుక్తము కాదని, ఈ సందర్భములో యమకమునుపయోగించుట మహాదోషమని ముఖ్యముగా విప్రలంభమందు ప్రవేశపెట్టనేకూడదని కరుణము అధికసుకుమారము కావున యమకానుప్రాసాదులయుక్తములని, విప్రలంభమత్యంతసుకుమారము కావున ప్రతిబంధకములగు యమకాదులు అంగముగానైనను చేర్చదగదని [1] ఆలంకారికుల నిష్కర్ష. హృదయమునకు ఆకర్షణీయమైన భావాకృతియే అలంకారము. అలంకారముయొక్క ప్రయోజనము భావమును విశిష్టముగా సుందరముగా చెప్పుటయే దీనిని దురుపయోగమొనర్చుటవలన కావ్యానందమునకు భంగము కలుగును. అలంకారములు రసాభివ్యక్తికి ఉపయుక్తమైనంతవరకు బహిరంగములు కావు; ప్రతీయమానార్థ ప్రకాశనమునకు కావలసిన నిర్మాణములోని భాగములే[2]. శబ్దగతమైన దీని ప్రయోజనము కావ్యానుభూతికి గాఢత్వము వైశిష్ట్యము కలిగించుటే. శబ్దగతమైన సౌందర్యము మొదలుకొని ధ్వని విశేషమువరకు అంతయు వివిధ అంగముల సమ్మేళనతో కూడిన నిర్మాణరూపము. ఇందులో అలంకారములు వివిధదశలలో అనుభూతిప్రదములై ధ్వన్యర్థ ప్రకాశనమునకు ఉపస్కారకములై యుండవలెననుటలో ఎవరికిని విప్రతిపత్తి లేదు.

శబ్దార్థాలంకారము లేవియు వ్యర్థములు కావు. భావమును శక్తిమంతముగా సౌందర్యమయముగా నుంచుటకు కవి ప్రయత్నించును. ఈ ప్రయత్నము యొక్క

---

1. ఆంధ్రధ్వన్యాలోకము - II - పుట 213. తిరువేంగళాచార్యులు, వేదాల.
**First Edition - 1968**

2. యుక్తం చైతత్ యతో..... తస్మాన్న తేషాంబహిరంగత్వం రసాభివ్యక్తౌ - II - 15, 16 - ధ్వన్యాలోకము
**(Karnataka University - Dharwar - 1974)**

విశిష్టరూపమే అలంకారము. భగవల్లీలావ్యాపారము సృష్టి; కవి లీలావ్యాపారము కవిత్వము. Nature is the creation of God's Lila, Poetry, of the poet's Lila.[1]

1. Studies on some concepts of the Alamkara Sastra P. 91. Raghavan V. (Revised Edition - 1977)

# ఉపమా వివేచనము

ఉపమాలంకార మత్యంత ప్రాచీనమైనది. సంస్కృత వాఙ్మయమునందు దీని ప్రసక్తి పుష్కలముగా కన్పించును. వేదములలో అత్యంత ప్రాచీనమైన ఋగ్వేదము నందు ఋక్కులలో జాతి, స్వభావోక్తి అధికముగా కన్పించినను ఉపమాలంకారము కూడ కలదు. దీనితోపాటు రూపకము, ఉత్ప్రేక్ష అతిశయోక్తులకును స్థానము కలదు. ఉపనిషత్తులలో[1] ఉపమాలంకార ప్రయోగము చూడవచ్చును. ఇక రామాయణ[2] మహాభారతములలో ఇది విస్తృతిని సంతరించుకొన్నదని వేరుగా చెప్పనవసరములేదు.

నిరుక్తరచనాకాలమువరకు ఉపమానామ ప్రసక్తి పారిభాషికార్థమునందు కన్పించదు. యాస్కుని నిరుక్తమునందు "ఉపమార్థే నిపాతః" అని ఇవ, యథా, న, చిత్, ను, ఆ యను ఆరు ఉపమానిపాతములు, కర్మోపమ, భూతోపమ, రూపోపమ సిద్ధోపమ, అర్థోపమ యను నైదు ఉపమా ప్రకారముల లుప్తోపమయు ఉల్లేఖింపబడినవి. నిరుక్తమునందు ప్రాచీనాచార్యుడైన గార్గ్యుని పేర్కొని అతని అభిప్రాయము నుల్లేఖించుట చేత యాస్కునికి పూర్వము దీని ప్రశస్తిని ఊహింపవచ్చును. ఉపమా "యత్ అతత్ తత్సదృశ" మితి గార్గ్యః.[3] ఒక వస్తువు రెండవ వస్తువుతో భిన్నమైయుండి తత్ సాదృశ్యము కలిగియున్నచో ఉపమాలంకారమగునని ఇతని అభిప్రాయము. పాణిని కాలమున ఉపమ శాస్త్రములో ప్రముఖస్థానము నందినది. ఇతడు అష్టాధ్యాయి యందు ఉపమాన, ఉపమిత, సామాన్య, ఉపమాశబ్దములనేకాక ఔపమ్య, ఉపమార్థే మరియు

1. "సస్యమివ మర్త్యః పచ్యతే సస్యమివ జాయతే పునః" I. 1, 6 - కఠోపనిషత్తు.
2. అహమౌపయికీ భార్యా తస్యైవ వసుధాపతేః, వ్రతస్నాతస్య ధీరస్య విద్యేవ విదితాత్మనః" - రామాయణము - సుందరకాండ - 5-21-17 – వాల్మీకి.
3. నిరుక్తము - III - 13

సాదృశ్యమను శబ్దములు ప్రయోగించెను. ఉపమానాని సామాన్యవచనైః[1], ఉపమితం వ్యాఘ్రాదిభిః సామాన్యాప్రయోగే,[2] తుల్యార్థైరతులోపమాభ్యాం తృతీయాన్యతరస్యాం.[3]

కాత్యాయనుడు వార్తికములందు; పతంజలి మహాభాష్యమునందు పాణినిచే ప్రయుక్తములైన శబ్దములకు వ్యాఖ్యానము గావించు సందర్భమున ఉపమ చర్చిత మైనది పతంజలి ఉపమకు "గౌరివ గవయః"అని ఉదాహరణమొసగెను. అలంకార శాస్త్రమునందిది ఉదాహరణము కాదు. అప్పయ్యదీక్షితులు "గోసదృశో గవయ ఇతి నోపమా"[4] యని దీనిని నిరాకరించెను. ఇది వ్యాకరణశాస్త్రసమ్మతమైనను అలంకార శాస్త్ర సమ్మతముగాదు. కారణము దీనిలో "చమత్కారము" లేదా చారుత్వము లేదని భోలా శంకర్ వ్యాస్ అభిప్రాయము.[5] పాణిని 'వత్' ప్రయోగము ఇవార్థమందు గావించెను.[6] తరువాత బాదరాయణుడు వేదాంతసూత్రములందు ఉపమారూపకములు పారిభాషికార్థమందు పేర్కొనెను. వాత్స్యాయనుడు న్యాయసూత్ర భాష్యమునందు "సామీప్యమానం ఉపమానమ్"అని ఉపమా విషయమునందు పతంజలి అభిప్రాయముతో ఏకీభవించెను.[7] శబరస్వామి మీమాంసాసూత్రభాష్యమునందు ఉపమవలన "అసన్నికృష్టార్థ" ప్రతీతి కలుగునని ఈసందర్భమున తనకు ప్రాచీనుడైన ఉపవర్షుని మతము నుల్లేఖించెను.[8]

భరతుని నాట్యశాస్త్రమునందు ఉపమాలంకారము నిర్వచనసహితముగా "కావ్య" సమ్మతముగా వివేచితమైనది. ఇతడు పేర్కొన్న నాలుగలంకారములలో "ఉపమ" మొదటిది.

---

1. అష్టాధ్యాయి - 2-1-56
2. అష్టాధ్యాయి - 2-1-56
3. అష్టాధ్యాయి - 2-3-72
4. చిత్రమీమాంస - పుట - 6
5. భారతీయ సాహిత్యశాస్త్ర - పుట 16 - ( I Edition - 1965)
6. వత్ప్రయోగము ఇవార్థమందు; మధురావత్ - మధురాయామ్ ఇవ బ్రాహ్మణవత్ - బ్రాహ్మణేన తుల్యమ్
7. న్యాయసూత్రము - II - 2 - 3
8. ఉపమానమపి సాదృశ్యం అసన్నికృష్టేఽర్థే బుద్ధిముత్పాదయతి యథా గవయ దర్శనం గోస్మరణం - మీమాంసా సూత్రము 1-1-15

"ఉపమా దీపకం చైవ రూపకం యమకం తథా
కావ్యస్యైతే హ్యలంకారాశ్చత్వారః పరికీర్తితాః"1

ఉపమావిలోకనమునందు ప్రముఖముగా పేర్కొనదగిన ఆలంకారికులు భరతుడు, భామహుడు, రుద్రటుడు.

భరతుడు :-

"యత్కించిత్కావ్యబన్ధేషు సాదృశ్యేనోపమీయతే
ఉపమా నామ సా జ్ఞేయా వర్ణాకృతిగుణాశ్రయా."2

కావ్యబన్ధమునందు ఏదేని (వస్తు) సాదృశ్యముతో ఉపమితమగునపుడు ఉపమ యగును. ఇది వర్ణాకృతి గుణముల నాశ్రయించి యుండును. ఇచ్చట "సాదృశ్యేన"– సమాన ధర్మముచేత అను అర్థము గమనింపదగినది.

భామహుడు :-

"విరుద్ధేనోపమానేన దేశకాలక్రియాదిభిః
ఉపమేయస్య యత్సామ్యం గుణలేశేన సోపమా."3

దేశకాలాదిక్రియలచేత విరుద్ధముగా (భిన్నముగా)నున్న ఉపమానముతో గుణలేశముచేత ఉపమేయమునకు సామ్యము చెప్పుట ఉపమయగును. ఇచ్చట సామ్యమన్న పద ప్రయోగము పరిశీలింపదగినది.

ఉద్భటుడు :-

"యచ్చేతోహారి సాధర్మ్యముపమానోపమేయయోః
మిథో విభిన్నకాలాదిశబ్దయోరుపమా తు తత్."4

అన్యోన్యమైన, విభిన్నమైన కాలాదిశబ్దములయొక్క ఉపమానోపమేయముల "చేతోహారిత్వ" సాధర్మ్యము ఉపమయగును. ఇచ్చట సాధర్మ్యమన్న పదప్రయోగము వివేచింపదగినది. సాదృశ్యస్వరూపము ఉపమాప్రధానలక్షణము. సాదృశ్యజ్ఞానము

---

1. నాట్యశాస్త్రము – XVI - 40
2. నాట్యశాస్త్రము - XVI - 41
3. భామహాలంకారము - II - 30
4. అలంకారసారసంగ్రహము

భిన్నరూపములలో నుండును. ఇది ఒక్కొక్కప్పుడు అనుభవరూపముగా ఒక్కొక్కప్పుడు స్మృతిప్రకారముగా నుండును. అనుభవరూపములోనున్నది ఉపమాలంకారము. స్మృతిప్రకారములో స్మరణాలంకారమగును.

సాదృశ్యాశ్రయము[1]

భేదాభేదతుల్యా




అప్పయ్యదీక్షితుల చేతిలో ఉపమాలంకారమునకు పట్టాభిషేకమైనది.

ఉపమైకా శైలూషీ సంప్రాప్తా చిత్రభూమికాభేదాన్
రంజయతి కావ్యరంగే నృత్యంతీ తద్విదాం చేతః[2]

ఉపమ ఒక నర్తకి. చిత్రమైన భూమికాభేదములను పొంది కావ్యరంగమున నృత్యము చేయుచు కావ్యవిదులచేతమును రంజింపజేయుచున్నది. ముఖము పద్మమువలె నున్నది యన్న సాదృశ్య వర్ణనయే వాగ్వైచిత్రీవిశేషముచేత అనేకాలంకారము లగుచున్నదని ఈతని అభిప్రాయము.

1. ముఖము ముఖమువలె నున్నది - అనన్వయము
2. పద్మము ముఖమువలె నున్నది - ప్రతీపము
3. పద్మమును చూచి ప్రియాముఖమును స్మరించెదను - స్మరణము
4. ముఖమే పద్మము - రూపకము
5. ఇది ముఖమా ? పద్మమా ? - సందేహము
6. ముఖపద్మముచేత ఉల్లాసము కలుగుచున్నది - పరిణామము
7. పద్మమని భృంగము; చంద్రుడని చకోరములు నీ ముఖమును చూచి ఆనందించుచున్నవి - ఉల్లేఖము.
8. పద్మమని భృంగము నీ ముఖము చూచి భ్రమించుచున్నది-భ్రాంతి

---

1. అథ సాదృశ్యవిచ్ఛిత్తౌ భేదాభేదతుల్యతాయాముపమా - రుయ్యకుని అలంకార సర్వస్వము - విద్యాచక్రవర్తి [1291 - 1342]
సంజీవనీ వ్యాఖ్యానము - పుట. 224.
2. చిత్రమీమాంస. పుట-6

9. ఇది ముఖము కాదు పద్మము-అపహ్నవము
10. ఇది పద్మము కాబోలు-ఉత్ప్రేక్ష
11. ముఖమును చూచి దానిని "ఈ పద్మము" అని పద్మముగా నిర్దేశించుట - అతిశయోక్తి
12. ముఖము పద్మమును చంద్రుని జయించినది-తుల్యయోగిత
13. సరస్సునందు పద్మము; గృహమునందు నీ ముఖము-దృష్టాంతము
14. ముఖము పద్మశోభను వహించుచున్నది-నిదర్శన
15. నీ ముఖముతో కూడ పద్మము పగలు శోభించుచున్నది-సహోక్తి
16. ముఖము స్మితకాంతితో, తిలకభృంగముతో శోభిల్లుచున్నది — సమాసోక్తి.
17. ముఖము ముందు పద్మము శోభాహీనము - అప్రస్తుతప్రశంస

ఈ విధముగా ఇంకను అలంకారము లెన్నిటినో ఉపమయందు అంతర్భవింప జేయవచ్చునన్న సిద్ధాంతమిది.

ఉపమ సర్వాలంకారములకు బీజభూతమని పెక్కు ఆలంకారికుల అభిప్రాయము.

వామనుడు — ప్రతివస్తు ప్రభృతి రుపమాప్రపంచః[1]

ప్రతివస్త్వలంకారము మొదలైన అలంకారములు ఉపమాగర్భము లగుటచే (ఉపమతో సంబంధించియుండుటచే) ఆ అలంకారములన్నింటికిని ఉపమాప్రపంచమని పేరు.

దండి — ఉపమాప్రపఞ్చశ్చ సర్వోలంకార ఇతి విద్వద్భిః ప్రతిపన్న మేవ[2]

ఉపమాప్రపంచము సర్వాలంకారములని విద్వాంసులచేత స్వీకృతమైనది.

మహిమభట్టు — సర్వాలంకారేషూపమా జీవితాయతే.

సర్వాలంకారములందు ఉపమ జీవితమైయున్నది.

రుయ్యకుడు — ఉపమైవానేకాలంకార బీజభూతా

ఉపమ అనేకాలంకారములకు బీజభూతమైనది.

రాజశేఖరుడు — అలంకారశిరోరత్నం సర్వస్వం కావ్యసంపదామ్
ఉపమా కవి వంశస్య మాతైవేతి మతిర్మమ.[3]

ఉపమ అలంకార శిరోరత్నము, కావ్యసంపదకు సర్వస్వము. కవి వంశమునకు మాతృమూర్తి.

---

1. కావ్యాలంకార సూత్రవృత్తి - IV-III-i
2. నాట్యశాస్త్రవ్యాఖ్యానము - అభినవభారతి - XVI-41
3. అలంకారశేఖరము - పుట. 32.

"ఉపమానోపమేయత్వయోగ్యయోరర్థయోర్ద్వయోః
హృద్యం సాధర్మ్యముపమేత్యుచ్యతే కావ్యవేదిభిః"[1]

ఉపమానోపమేయత్వమునకు యోగ్యమైన అర్థద్వయమునందు హృద్యమైన సాధర్మ్యమును కావ్యవిదులు ఉపమ యందురని అప్పయ్యదీక్షితులు. అలంకారము నందెవరైతే హృద్యత సాధించలేరో వారు విద్వాంసులు మాత్రమే. కవులుకారు[2] వీరికి అలంకారముయొక్క ప్రధానమైన ఆంతర్యము తెలియదు. శాస్త్రమర్యాదపైనే అధికముగా దృష్టియుంచెదరు. అలంకారము మొదట సౌందర్యాత్మక లక్షణముగా భావితమై ఆపైన రానురాను కేవలము అలంకారముగా మిగిలినది. కావున అలంకార పరిధి సంకుచితమైపోయినది.[3]ఇది కవిప్రతిభచేతనే విస్తృతమగు ననుటలో సందేహము లేదు.

"స్వతస్సిద్ధేన భిన్నేన సమ్మతేన చ ధర్మతః
సామ్యమన్యేన వర్ణ్యస్య వాచ్యం చేదేకదోపమా"[4]

వర్ణ్యము, ప్రకృతము, విషయము, ఉపమేయమనునవి పర్యాయపదములు. అవర్ణ్యము, అప్రకృతము, విషయి ఉపమానమనునవి పర్యాయపదములు.

వర్ణ్యమనగా వర్ణింపదగినది, ఉపమేయము. ఇదియే ప్రకృతము ప్రకృతమైన ఉపమేయమునకు స్వతస్సిద్ధమైనట్టిదియు భిన్నమైనట్టిదియు (ఉపమేయముకన్న) సమ్మతమైనట్టిదియునైన అప్రకృతము (ఉపమానము) తో ధర్మము ననుసరించి సాదృశ్యమును వాచ్యముగా చెప్పినచో ఉపమాలంకారము. ఇక్కడ 'వాచ్య' మనగా

---

1. కావ్యానుశాసనము - 6 - 1
2. "విద్వాంస ఏవ తే న కవయః"
   రామచంద్ర - నల విలాసనాటకము - అఙ్కము - VI - 77
3. **It is true that the Alamkara school employs the term Alamkara to connote the fundamental characteristic or principle of the beauty of poetic expression, but in actual theory and practice it is applied to the objective beauty of poetic form realised by certain decorative devices, known as poetic figures- Some problems of Sanskrit Poetics-P. 12-By-De; S.K.(1959)**
4. ప్రతాపరుద్రయశోభూషణము - పుట. 254

"స్పష్టము"[1] గానని అర్థము. లేనిచో సహృదయ హృదయాహ్లాదకత్వమునకు భంగము కలుగును. ఇది ప్రతీయమాన విశిష్టతనుబట్టి "ఉపమాధ్వని" యగును.[2]

1. ఉపమేయముకన్న ఉపమానము ఉత్తమముగానున్నపుడే అందము వచ్చును.

2. ఇందలి సాదృశ్యము అర్థగతమైయుండవలెను. శబ్దగతమైనచో శ్లేష క్రిందికిపచ్చు అవకాశమున్నది. మమ్మటుని అభిప్రాయము ననుసరించి శబ్దసాదృశ్య మున్నను ఉపమయే

"ఉపమా యత్ర సాదృశ్యలక్ష్మీరుల్లసతి ద్వయోః
హంసీవ కృష్ణ! తే కీర్తిః స్వర్గఙ్గామవగాహతే"[3]

ఇది పూర్ణోపమకుదాహరణముగా నొసగబడినది.

"యత్ర ద్వయోః" సాదృశ్యలక్ష్మీః ఉల్లసతి "(తత్ర) ఉపమాలంకారః" రెండు సాదృశ్య వస్తువుల పోలిక ఉపమయైనచో ఒకవస్తువును దానితోనే పోల్చినపుడు అనన్వయమగును". "ఇన్దుః ఇన్దురివ శ్రీమాన్"[4]

ఇచట ఉపమానోపమేయలక్షణములొకే వస్తువునందు కలవు.

1. ఉపమాలంకారమునందు రెండు వస్తువులుండును.
2. ఒకదానితో మరొకటి పోల్చబడును.
3. సాదృశ్యము శోభావహముగా నుండవలయును. ఇది "యత్ర లక్ష్మీరుల్లసతి" యనుటచేత వ్యక్తము. ఈయాకర్షణ సహృదయహృదయావర్జకమైనది.
4. సాదృశ్యము స్పష్టముగా నుండవలయును.
5. ఉపమేయము, ఉపమానము, వీనిమధ్య సాధారణధర్మము, ఉపమావాచకమను నాలుగంశములున్నచో అది పూర్ణోపమ. వీనిలో ఏవేని (ఒకటి, రెండు లేదా

---

1. యత్రోపమానోపమేయయోః సహృదయ హృదయాహ్లాదకత్వేన చారు సాదృశ్యముద్భూతతయా ఉల్లసతి... ..స్పష్టం ప్రకాశతే తత్రోపమాలంకారః- కువలయానందము - వివరణము.
2. **Further the Similarity must be clearly expressed; otherwise it will fall within the province of Upamadhvani.**
చంద్రాలోకము - వ్యాఖ్యానము - పుట - 16 — శంకరరామశాస్త్రి
3. కువలయానందము — 6
4. చన్ద్రాలోకము - V - 12

మూడు అంశములు) లోపించియున్నయెడల లుప్తోపమ యగును. భరతుడు సాదృశ్యమని, భామహుడు సామ్యమని, ఉద్భటుడు సాధర్మ్యమని నుడివిన దానినే తరువాతవచ్చిన ఆలంకారికులందరు అనుసరించిరి. వీనిలో ఏదో ఒకటి ఉపయోగించిరి.

భిన్నాలంకారికులు ఉపమాలంకారమును ఇట్లు నిర్వచించిరి.

దండి — "యథాకథంచిత్సాదృశ్యం యత్రోద్భూతం ప్రతీయతే ఉపమానామ సా"
(కావ్యాదర్శము II - 14)

ఎచట గుణక్రియాదుల ద్వారా ఏదోవిధముగ రెండువస్తువుల సామ్యము తెలుపబడునో అది ఉపమాలంకారము.

భామహుడు — "విరుద్ధేనోపమానేన దేశకాలక్రియాదిభిః
ఉపమేయస్య యత్సామ్యం గుణలేశేన సోపమా"
(కావ్యాలంకారము II - 30)

దేశము, కాలము, క్రియ మొదలగువానినిబట్టి భిన్నమగు ఉపమానముతో ఉపమేయమునకు ఒక చిన్నగుణమునుబట్టి ఏర్పడిన సామ్యము ఉపమాలంకారము.

వామనుడు — "ఉపమానోపమేయస్య గుణలేశతః సామ్యముపమా"
(కావ్యాలంకారసూత్రవృత్తి - IV - III - I)

గుణలేశమునుబట్టి ఉపమేయమునకు ఉపమానముతో సామ్యము చెప్పుట ఉపమాలంకారము.

మమ్మటుడు — "సాధర్మ్యముపమాభేదే" (కావ్యప్రకాశము (X - I)

భిన్నములగు ఉపమానోపమేయములకు సాధర్మ్యమును చెప్పినచో ఉపమాలంకారము.

విద్యానాథుడు — "స్వతస్సిద్ధేన భిన్నేన సమ్మతేన చ ధర్మతః
సామ్యమన్యేన వర్ణ్యస్య వాచ్యం చేదేకదోపమా"
(ప్రతాపరుద్రీయము - అర్థాలంకారప్రకరణము - శ్లో. - I)

వర్ణింపదలచిన పదార్థమునకు స్వభావసిద్ధమైనది, భిన్నమైనది, సహృదయ సమ్మతమైనది ఐనటువంటి వేరొక పదార్థముతో ధర్మసంబంధమైన సామ్యము చెప్పుట ఉపమ.

విశ్వనాథుడు — "సామ్యం వాచ్యమవైధర్మ్యం వాక్యైక్య ఉపమాద్వయోః''
(సాహిత్యదర్పణము - X - 14)

ఏకవాక్యమున, ఉపమానోపమేయములకు వైధర్మ్యములేని సామ్యము అభిధా రూపమున వాచ్యముగ చెప్పబడినచో నది ఉపమాలంకారము.

అప్పయ్యదీక్షితులు — "వ్యాపార ఉపమానాఖ్యో భవేద్యది వివక్షితః
ఉపమానిష్పత్తి పర్యంత ముపమాలంకృతిస్తు సః
(చిత్రమీమాంస - )

ఉపమాన వ్యాపారము - అనగా సాదృశ్యవర్ణనము ఉపమితి క్రియానిష్పత్తి పర్యంతము - అనగా ఉపమానము సిద్ధించువరకు వివక్షింపబడుచో నది ఉపమా లంకారము.

జగన్నాథుడు — "సాదృశ్యం సుందరం వాక్యార్థోపస్కార ముపమాలంకృతిః''
(రసగంగాధరము - 2 ఆననము)

వాక్యార్థమును అలంకరింపజేయు సాదృశ్యము ఉపమాలంకారము.

విద్యాధరుడు — "విలసతి సతి సాధర్మ్యే స్యాదుపమానోపమేయయోరుపమా''
(ఏకావళి -VIII - 2)

ఉపమానోపమేయములకు సాధర్మ్యము విలసించునదిగా నుండునేని ఉపమాలం కారమగును.

ధర్మసూరి — "సాధర్మ్యం లోకసిద్ధేన భిన్నేన కవిసమ్మతమ్
యదైకవాక్యవాచ్యం స్యాత్ ప్రకృతస్య తదోపమా"
(సాహిత్యరత్నాకరము -VII - 1)

ప్రకృతవస్తువునకు లోకప్రసిద్ధమగు తద్భిన్నవస్తువుతో ఏకవాక్య ప్రతిపాద్య మును, కవిసమయసమ్మతమును అగు సాధర్మ్యమును చెప్పినచో నది ఉపమాలం కారము.

చిన్నకోట పెద్దన - గుణధర్మకర్మములచేత స్పష్టమైన వస్తువునకు తుల్యముగా దేనిని గణుతించిన అది ఉపమ.

భట్టుమూర్తి — ప్రకృతమైన ఉపమేయమునకు ప్రసిద్ధమైనదియు, ఉపమేయ భిన్నమును, హృద్యమైనదియు ఐన అప్రకృతముతో ధర్మమును బట్టి సాదృశ్యము వాచ్యముగా చెప్పిన ఉపమాలంకారము.

ఈవిధముగా ఉపమాలంకారమును పలువురు ఆలంకారికులు నిర్వచించిరి. వామనుడు కావ్యాలంకారసూత్రమున "ఉపమాప్రపంచాధికార" విభాగమున 28ఉపమా భేదములను వివరించెను. దండి ఉపమను 32 విభాగములుగ చేసి సోదాహరణముగ వివరించెను. దండిమతము ననుసరించి-ధర్మోపమ, వస్తూపమ, విపర్యాసోపమ, అన్యోన్యోపమ, నియమోపమ, అనియమోపమ, సముచ్చయోపమ, అతిశయోపమ, ఉత్ప్రేక్షితోపమ, అద్భుతోపమ, మోహోపమ, సంశయోపమ, నిర్ణయోపమ, శ్లేషోపమ, సమానోపమ, నిందోపమ, ప్రశంసోపమ, ఆచిఖ్యాసోపమ, విరోధోపమ, ప్రతిషేధోపమ, చటూపమ, తత్త్వాఖ్యానోపమ, అసాధారణోపమ, అభూతోపమ, అసంభావితోపమ, బహూపమ, విక్రియోపమ, మాలోపమ, వాక్యార్థోపమ, ప్రతివస్తూపమ, తుల్యయోగోపమ, హేతూపమ. ఈభేదములలో కొన్నింటిని తరువాతి లాక్షణికులు ఉపమాభేదములుగ కాక ప్రత్యేకాలంకారములుగా పేర్కొనిరి.

ఉపమ పూర్ణ, లుప్త అని మొదట రెండు విధములు:

"ఉపమానమునకు ఉపమేయమునకు-ఈరెండింటికి సామ్యము సుందరముగా అనగా సహృదయరంజకముగా నెచ్చటనుండునో అచ్చటనది ఉపమాలంకారమగునని లక్షణము."[1]

ఉపమేయము, ఉపమానము, సమానధర్మము, ఉపమావాచకము అను నీ నాలుగంశములు కలిగియున్నచో నది పూర్ణోపమ.

"హంసీవ కృష్ణ! తే కీర్తిః స్వర్గంగామవగాహతే"[2]

ఓ కృష్ణా! హంసవలె నీ కీర్తి స్వర్గంగయం దవగాహనము చేయుచున్నది. ఈ ఉదాహరణమును పరిశీలించినచో ఇందు పై నాలుగంశములు కన్పించును.

---

1 చంద్రాలోకసమున్మేషము-పుట 17-సూర్యశ్రీ (I Edition - 1973)

2 కువలయానందము—6

1. హంసి-ఉపమానము, 2. కీర్తి-ఉపమేయము, 3. హంసి మరియు కీర్తి రెండును స్వర్గంగయందు మునుగుట రెండింటియందలి సమానధర్మము. 4. ఇవ (వలె)అనునది ఉపమావాచకము. ఈనాలుగులక్షణము లొకచోటనుండుటచేత పూర్ణోపమ యగుచున్నది.

లుప్తోపమ

"వర్ణ్యోపమానధర్మాణాముపమావాచకస్య చ
ఏకద్విత్ర్యనుపాదానాద్భిన్నా లుప్తోపమాష్టధా"[1]

ఉపమేయము, ఉపమానము, సమానధర్మము, ఉపమావాచకమను నాలుగంశములలో ఒకటి రెండు లేదా మూడంశములు లోపించినపుడు 'లుప్తోపమ' యగును. ఇది ఎనిమిది విధములు. ఈ లుప్తమైన అంశములను పురస్కరించుకొని, క్రమపద్ధతిలో ఈ విభజన జరిగినది.

I ఒక అంశము లోపించినపుడు ఏర్పడు లుప్తోపమ మూడు విధములు.
1) వాచక లుప్త 2) ధర్మ లుప్త 3) ఉపమాన లుప్త

II రెండు అంశములు లోపించినపుడు ఏర్పడు లుప్తోపమ నాలుగు విధములు.
1) ధర్మవాచకలుప్త 2) వాచకోపమేయలుప్త 3) వాచకోపమానలుప్త
4) ధర్మోపమానలుప్త

III మూడు అంశములు లోపించినపుడు ఏర్పడు లుప్తోపమవిధ మొక్కటే.
(1) ధర్మోపమానవాచకలుప్త.

ఉదాహరణములు :

1. తటిద్గౌరీన్దు తుల్యాస్యా కర్పూరన్తీ దృశోర్మమ
కాన్త్యా స్మరవధూయన్తీ దృష్టా తన్వీ రహో మయా.
2. యత్తయా మేళనం తత్ర లాభో మే యచ్చ తద్రతేః
తదేతత్కాకతాళీయమవితర్కితసమ్భవమ్[2].

I ఒక అంశము లోపించిన లుప్తోపమ -

---

1. కువలయానందము-7
2. కువలయానందము - 8, 9

(a) వాచకలుప్త : దీనికి లక్ష్యము తటద్గౌరీ - అనునది. తటదివగౌరీ-తటిత్తు (మెరపు) వలె గౌరవర్ణము కలది. దీనియందు ఉపమావాచకమైన 'ఇవ' లోపించుట చేత దీనిని వాచకలుప్త యనుట జరిగినది. ఇందలి ఉపమాసామగ్రిలోని మూడంశము లివి. ఉపమేయము తన్వి; ఉపమానము తటిత్తు, సాధారణధర్మము గౌరత్వము. ఇక మిగిలినది ఒక్క ఉపమావాచకమే లోపించినది. కావున వాచకలుప్త.

b) ధర్మలుప్త : దీనికి లక్ష్యము "ఇన్దుతుల్యాస్యా" అనునది. ఇన్దునా తుల్య మాస్యం యస్యాః సా. చంద్రునితో సదృశమైన ఆస్యము కలది. దీనియందు సాధారణధర్మము లోపించుటచేత 'ధర్మలుప్త' యనుట జరిగినది. ఇందలి ఉపమా సామగ్రిలోని మూడంశములివి. ఉపమేయము ఆస్యము. ఉపమానము ఇన్దుడు-ఉపమా వాచకము తుల్య - యనునవి. ఇక మిగిలినది ఒక్క సాధారణధర్మము లోపించినది. కావున ధర్మలుప్త.

c) ఉపమానలుప్త : దీనికి లక్ష్యము "యత్తయా మేళనం" అను శ్లోకమున చెప్పబడినది. కాకి వచ్చినది. అదే సమయమున తాటిపండు పడినది. దానిని కాకి అనుభవించినది. ఇది అవితర్కితముగా ఉపనతమైనది. అట్లే ఆమెను పొందుటయు సంభవించినది-అని యీ శ్లోకతాత్పర్యము. ఇక్కడ ఆమె పొందు ఉపమేయము. కాకి ఆ తాళఫలమును అనుభవించుట ఉపమానమగుచున్నది. కాని ఈ అంశము కాకతాళ అను పదముచే వాచ్యముగా కాక లక్షణచే గ్రహింపబడిన అర్థము కావున ఇచ్చట ఉపమానము లోపించినదనియే చెప్పవచ్చును. ఇచ్చట కాకతాళమివ కాకతాళీయమ్ అను సమాసమునందు ఇవార్థమున విహితమగు 'ఛ' ప్రత్యయముచే ఉపమా వాచకము చెప్పబడినది కావున వాచకము ఉండనే యున్నది. అవితర్కిత సంభవ మనునది సాధారణధర్మము కావున ఇది ఉపమానలుప్త యగుచున్నది.

II (a) ధర్మవాచకలుప్త - దీనికి లక్ష్యము "మమ దృశోః కర్పూరస్తి" యొసగబడినది. "కర్పూరమ్ ఇవ ఆచరస్తి" యని అర్థము. కర్పూరము నేత్రములకు చల్లదనము (అహ్లాదము) కూర్చునట్లు ఆ'తన్వి' కలదు.

ఇందలి ఉపమాసామగ్రిలోని రెండంశములివి. ఉపమేయము తన్వి, ఉపమానము కర్పూరము. ఇక మిగిలినవి రెండు, సాధారణ ధర్మము, ఉపమావాచకమను నవి లోపించినవి. కావున ధర్మవాచకలుప్త. ఇది సాధారణధర్మములోని ధర్మశబ్దము; ఉపమావాచకములోని వాచకశబ్దము గ్రహించి రెంటిని జోడించి ఏర్పరచినట్టిది.

(b) వాచకోపమేయలుప్త-దీనికి లక్ష్యము "కాన్త్యా స్మరవధూయన్తీ" యొసగ బడినది. స్మరవధూమ్ ఇవ (ఆత్మానమ్) ఆచరన్తి - స్మరుని వధువు రతీదేవి) వలె తాను ఆచరించుకొనునది అనగా అలంకరించుకొనునది, ప్రవర్తించునది యని అర్థము. ఇచ్చట ఆత్మానమ్ అనునది స్పష్టముగా పేర్కొనబడలేదు. కావున ఉపమేయము లోపించినది. అటులనే ఉపమావాచకము కూడ ప్రసక్తము కాలేదు. కావున ఉపమేయము, ఉపమావాచకము రెండును లోపించినవి. ఇచ్చట నున్నవి కాంతి - స్మరవధూ అన్న శబ్దములు. కావున ఇది వాచకోపమేయలుప్త.

(c) వాచకోపమానలుప్త — దీనికిని పూర్వమొసగిన "యత్తయా మేళనం" అను శ్లోకార్థమే లక్ష్యమగుచున్నది. ఎట్లన తానచ్చటికి వెళ్ళుటయు అప్పుడే ఆమె అచ్చటికి వచ్చుటయు కాకతాళీయముగా జరిగినది. అనగా కాకి వచ్చుటయు, అదే సమయమున తాటిపండు పడుటయు ఎట్లు అవితర్కితోపనతమో అట్లు జరిగినది. ఇచ్చట తానచ్చోట ఆమెతో కలియుట (తయా మేళనమ్) ఉపమేయము. కాకాగమన తాళఫల పతనములు ఉపమానము. కాని ఈ ఉపమానార్థము కాకతాళ శబ్దమునకు లక్షణచే వచ్చిన యర్థమగుటచే ఈయది లోపించినదనియే చెప్పవచ్చును. ఇక వాచకము కాకాగమనమివ, తాళఫల పతనమివ అను విధముగా సమాసార్థోపమయందు లోపించినది. కావున సాధారణధర్మము మాత్రము అవితర్కితసంభవ మనునది ఉండనే ఉన్నది. కావున ఇచ్చోట ఉపమానము మరియు వాచకము ఈ రెండును మాత్రము లోపించుటచే ఇది వాచకోపమానలుప్త.

(d) ధర్మోపమానలుప్త — దీనికిని "యత్తయా మేళనమ్" అను శ్లోకమే ఉదాహరణ మగుచున్నది. కాని అవితర్కిత సంభవమ్ అను చతుర్థచరణస్థానమున "అభవత్ కిం బ్రవీమి తే" అను పాదము పఠించిన అవితర్కిత సంభవమ్ అను సాధారణ ధర్మము లుప్తమగుట ఏర్పడుచున్నది. దీనిచే పూర్వోదాహృతమగు ఉపమాన లుప్తయే ధర్మోపమానలుప్త యగుచున్నది.

III a) ధర్మోపమానవాచకలుప్త —దీనికి "యత్తయా మేళనమ్" అను శ్లోకమే ఉదాహరణము. ఇచ్చటను అవితర్కితసంభవమ్ అనుటకు బదులు అభవత్ కిం బ్రవీమి తే అనుపాఠమే గ్రహింపబడుచున్నది. ఇప్పుడు ఈస్థలమున పూర్వము ఉదాహరింపబడిన ఉపమానవాచకలుప్తయే ధర్మోపమానవాచకలుప్త యగుచున్నది.

ఈవిధముగా జయదేవుని చంద్రాలోకము ననుసరించి లుప్తోపమ ఎనిమిది విధములు.

ఈభేదములను గమనించినచో ఒక విషయము స్పష్టమగును. అది యేమనగా వీనిలో కొన్ని వ్యాకరణశాస్త్రమునకు సంబంధించిన అంశముల అన్వయమునుబట్టి ఏర్పడుచున్నవి.

తద్ధితార్థమునందు "ఇవ" శబ్దోపాదానము నంగీకరించుటయు, సహార్థమునం దంగీకరించకుండుటయు, శాస్త్రపద్ధతి.[1] ఉపమాలంకారము నందలి లుప్తా భేదములు వ్యాకరణశాస్త్రపాండిత్యముపై ఆధారపడియుండుటను గుర్తించుచు, శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు ఇందు "చారుత్వమేమియు కానరాదని"[2] అభిప్రాయపడిరి.

ఈసందర్భమున "ప్రస్తుతోఽయం పూర్ణా లుప్తా విభాగో.. శబ్దశాస్త్ర వ్యుత్పత్తి కౌశలపరత్వాత్ అతఏ శాస్త్రే న వ్యుత్పాద్యతామర్హతీత్యాహుః'' అను ఉద్యోత కారుని మాటలలో శబ్దశాస్త్రవ్యుత్పత్తి కౌశలపరత్వము అన్వయమునందెట్లు ప్రముఖ స్థానము వహించుచున్నది, పైవివరణమునందు విస్పష్టము. ఏమైనను ఈ విభాగము ఉపమాలంకారము యొక్క ప్రయోగవైవిధ్యమును భిన్నప్రకారములుగా పరిశీలించి విభజించి చూపుచున్నదనుటలో సందేహములేదు.

పూర్ణలుప్త భేదములచే రెండు విధములైన ఉపమాలంకారము శ్రౌతి, ఆర్థి అను భేదములచే మరిరెండువిధము లగుచున్నది

శ్రౌతి – సాదృశ్యవాచకములగు యథా, ఇవ (వలె, మాడ్కి) మున్నగు ఉపమావాచకపదములు కంఠోక్తిగ ప్రయోగింపబడినచో శ్రౌతియగును సాదృశ్య వాచకశబ్దము శ్రుతిమాత్రముననే (విన్నమాత్రముననే) తెలియునది కనుక శ్రౌతి.

ఉదా:– పూర్వోదాహృతమైన "హంసీవ కృష్ణ తే కీర్తిః'' అను పూర్ణోప మాలంకారోదాహరణమున సాదృశ్యవాచకమగు ''ఇవ'' శబ్దము కంఠోక్తిగ చెప్ప బడినది కనుక ఇది శ్రౌతి, పూర్ణోపమాలంకారము.

ఆర్థి – ఉపమేయమునకు విశేషణములగుచు సాదృశ్యమును బోధించు సదృశ, సంకాశ, నీకాశ (వంటి, పోని) మున్నగు శబ్దములు ప్రయోగింపబడినచో ఆర్థి యగును.

---

1. చంద్రాలోక సమున్మేషము - పుట. 23.
2. కావ్యాలంకార సంగ్రహము - వ్యాఖ్యానము - పుట. 580.

అనగా సదృశాది శబ్దములవలన మొదట సాదృశ్యవిశిష్టవ్యక్తి బోధితుడైన పిమ్మట సాదృశ్యము ప్రతీయమాన మగుటచే ఇది ఆర్థి అనగా సాదృశ్యము ఇచట అర్థ సాపేక్ష మగుచున్నది.

ఉదా :- పూర్వోదాహృతమైన ''ఇందుతుల్యాస్యా'' అను ధర్మవాచకలుప్త ఉదాహరణమున, అస్యము ఇందుతుల్యము అని చెప్పబడుచే ఇట సాదృశ్యము తుల్యశబ్దముచే చెప్పబడినది. అనగా ఈ సాదృశ్యము ఇవాది శబ్దములచేతవలె ప్రతి మాత్రి బోధితముకాక, సాదృశ్యవిశిష్టార్థకమగు తుల్యశబ్దముచే అర్థబలమున ప్రతీయ మానమగుటచే ఇది ఆర్థిలుప్తోపమ

శ్రౌతి, ఆర్థి అను భేదములచే రెండు విధములుగా నేర్పడిన ఉపమాలంకారము వాక్యగతము, సమాసగతము, తద్ధితగతము అని మరల మూడువిధము లగుచున్నది.

వాక్యగతము– ఉపమాలంకారము వాక్యరూపమున నున్నచో నది వాక్యగతము.

ఉదా :– "హంసీవ కృష్ణ తే కీర్తిః స్వర్గంగా మవగాహతే" – ఈ శ్లోకమున ఉపమాలంకారము వాక్యరూపమున నుంటుటచే ఇది వాక్యగత మగుచున్నది. ఆర్థి ఉపమ.

సమాసగతము – ఉపమాలంకారము సమాసరూపమున ఉన్నచో అది సమాస గతము.

ఉదా :– తటిద్గౌరీ (మెరపుతీగవలె గౌరవర్ణము గలది) అను ఈ సమాస పదమున ఉపమాలంకారము చెప్పబడుటచే ఇది సమాసగత ఉపమ శ్రౌతి ఉపమ.

తద్ధితగతము —— ఉపమాలంకారము కల్పప్, దేశ్య, దేశీయర్, మున్నగు తద్ధితప్రత్యయములచేత చెప్పిన తద్ధితగత ఉపమ.

ఉదా :– ప్రతాపరుద్ర నృపతేర్జగన్మహిత తేజసః,
కందర్పకల్ప మాకారం పశ్యంత్యంధ్రి పురంధ్రియః. 1

లోకోత్తరమైన తేజస్సుకల ప్రతాపరుద్రుని, మన్మధునితో సమానమగు ఆకారమును, తెలుగు పడుచులు కాంచుచున్నారు. ఇందు ప్రతాపరుద్రుని యాకారము కందర్ప కల్పముగా చెప్పబడుటలోనే ఈఉపమాలంకారమున్నది. కందర్పకల్పము (మన్మధునితో

1. ప్రతాపరుద్రీయము - అర్థాలంకార ప్రకరణము - శ్లో. 22.

ధునితో సాటివచ్చు) అను ఈ శబ్దము కల్పప్[1] అను తద్ధితప్రత్యయము చేర్చుటచే ఏర్పడినది కావున తద్ధితగత ఉపమాలంకారము.

ఉపమాలంకారమున సాధారణధర్మము అనేకవిధములుగా నుండును. వానిలో ముఖ్యముగా మూడు పేర్కొనదగినవి. 1. అనుగామిధర్మము. 2. బింబప్రతిబింబ భావముచే నేర్పడు సాధారణధర్మము. 3. శ్లేషచే నేర్పడు సాధారణధర్మము.

అనుగామిధర్మముచే నేర్పడు ఉపమాలంకారమునకు పూర్వోదాహృతము లన్నియు ఉదాహరణములే.

ఇక బింబప్రతిబింబభావమున నేర్పడు ఉపమాలంకారము ప్రకృతమున ఉదాహరింపబడుచున్నది. బింబప్రతిబింబభావమనగా.

"వస్తుతో భిన్నయోర్ధర్మయోః పరస్పర సాదృశ్యాదభిన్నతయా
ద్యవసితయోర్ద్వి రుపాదానమ్ బింబప్రతిబింబభావః"[2]

అనగా ఉపమాన ఉపమేయ గతములగు ధర్మములు వాస్తవమున భిన్నములే యైనను పరస్పరసాదృశ్యమును పురస్కరించుకొని అభిన్నములుగా అధ్యవసించి వానిని విడివిడిగా పేర్కొనుట.

ఉదా:–స్ఫురచ్ఛ్వేతాతపత్రశ్రీః కాకతీయనరేశ్వరః
హాటకాద్రిరివాభాతి శృంగసంగీందుమండలః.[3]

శ్వేతఛత్రముతో ప్రకాశించుచున్న ప్రతాపరుద్రుడు శిఖరమున చంద్రబింబముతో నొప్పు మేరుపర్వతమువలె ప్రకాశించుచున్నాడు. ఇచ్చట ప్రతాపరుద్రునకు మేరు పర్వతముతో సాదృశ్యము చెప్పబడినది. మేరుపర్వతశిఖరమున చంద్రబింబము ప్రకాశించగా ప్రతాపరుద్రుని శిరముపై శ్వేతఛత్ర మొప్పుచున్నది. ఈ చంద్రబింబ శ్వేతఛత్రములకు పరస్పర సాదృశ్యముండుటచే దానిని బట్టి శ్వేతఛత్ర చంద్రబింబ

---

1. ఈషదసమాప్తౌ కల్పబ్దేశ్యదేశీయరః — అష్టాధ్యాయి - 5-3-67.
2. చిత్రమీమాంస–ఉపమాలంకార ప్రకరణము.
3. ప్రతాపరుద్రీయమ్–అర్థాలంకారప్రకరణము-శ్లో-33

ములకు అభేదాధ్యవసాయము చేయుటవలన నేర్పడిన ఈ సాధారణధర్మమును పురస్కరించుకొని ప్రతాపరుద్ర మేరుపర్వతములకు ఉపమానోపమేయభావము కల్పింపబడుటచే ఈ ఉపమాలంకారము ఏర్పడినది. కావున ఇది బింబప్రతిబింబభావోపమ.

శ్లేష (శబ్దసామ్యము)చే నేర్పడు ఉపమాలంకారము-

"కవిమతిరివ బహులోహా
సుఘటిత చక్రా ప్రభాతవేలేవ
హరమూర్తిరివ హసంతీ
భాతి విధూమానలోపేతా"1

కవి ఈ శ్లోకమున హసంతిని అనగా కుంపటిని వర్ణించుచున్నాడు. అది కవి బుద్ధివలె బహులోహ యట. కవిబుద్ధి బహులములైన ఊహలు కలది కాగా ఈ కుంపటి బహు అనగా గొప్ప లోహము కలది అగుచున్నది కావున కుంపటియు కవి బుద్ధివలె బహు లోహయే యైనది. మరియు అది ప్రభాతవేళవలె సుఘటితచక్ర యట. అనగా కుంపటి యందు చక్రము ఘటింపబడి యుండుటచేతను ప్రాతఃకాలమున చక్రవాక పక్షులు సంఘటితములగుట చేతను ఈ రెండును సుఘటితచక్రలె అగును. అంతేకాక ఇది శివ మూర్తివలె విధూమానలోపేతయునై యున్నదట-ఎట్లు శివుని దేహమున విధు-చంద్రుడు, ఉమ-పార్వతి, అనల-అగ్ని అను మువ్వురు కలిసియున్నారు. హసంతి యందును విధూమ (ధూమరహితమైన) అనలము ఉండనే ఉన్నది ఇట్లు కవి కుంపటిని తన శబ్ద చమత్కృతి బలముచే మూడు వస్తువులతో పోల్చి చెప్పియున్నాడు. వాస్తవమునకు వానితో ఈ కుంపటికి లేశమైనను సాధర్మ్యము లేదు. శ్లేషచే నేర్పడిన శబ్దసామ్యము మాత్రమే యున్నది కావున నిది శ్లేషప్రతిభోత్థాపితమగు ఉపమాలంకారము. ఇది ప్రకృతాప్రకృత ఉభయశ్లేషయేకాని ఉపమాలంకారము కాదని కొందరాలంకారికు లందురు.

మాలోపమ—ఒకే ఉపమేయమునకు సాధర్మ్యభేదమును పురస్కరించుకొని అనేకములగు ఉపమానములు చెప్పబడిన మాలోపమ యగును. పూర్వోదాహృత శ్లోకమునే తీసికొనిన- ఒకే కుంపటిని తీసికొని అనేక ఉపమానములతో పోల్చి చెప్పుట కాననగుటచే దానిని మాలోపమయని కూడ చెప్పవచ్చును.

---

1. చిత్రమీమాంస-పుట-41. నిర్ణయసాగర్ ప్రెస్-1941

ఇట్లు ఉపమాలంకారముగూర్చి సంక్షేపముగా వివరింపబడినది.

ఆలంకారికుల నిర్వచనములన్నియు ఒక ఎత్తు అప్పయ్య దీక్షితుల ఈ క్రింది భావమొక ఎత్తుగా నున్నది.

"తదిదం చిత్రం విశ్వం బ్రహ్మజ్ఞానాది సోపమాజ్ఞానాత్
జ్ఞాతం భవతీత్యాదౌ నిరూప్యతే సఖిలభేదసహితా సా"[1]

బ్రహ్మజ్ఞానము వలన ఈ చిత్రమైన విశ్వము జ్ఞాతమగు విధమున ఉపమాజ్ఞానము వలన సమస్తాలంకారజ్ఞానము కలుగునని, ఉపమాలంకారము యొక్క లోకోత్తర స్వరూపమును దర్శింపజేసెను.

ఇంతగా విస్తృతమై ప్రసిద్ధికెక్కిన[2] ఉపమాలంకారము నన్నయ భారతమునం దెట్లు ప్రతిభావంతముగా ఆవిష్కృతమైనదో వివరించుటయే ప్రధానలక్ష్యము.

1. చిత్రమీమాంస-పుట-6
2. "ఉపమా కాళిదాసస్య"

# అవతారిక

నన్నయ భారతావతారికలోని అలంకారములన్నియు స్వతంత్రములుగా పరిగణింప వచ్చును. నన్నయ ఉపమాలంకార శిల్పమునకీ భాగమును మొట్టమొదలు పరిశీలన మొనర్పవలసివచ్చుటలో విశేషము కలదు. అది అనువాదరూపభాగము కాక స్వతంత్ర రచనాపురస్కృతమగుట వలన, తెలుగు సాహిత్యములోని సువ్యవస్థితమైన మార్గ దర్శకమైన తొలి కవితారూపమును దర్శించినట్లగుచున్నది.

ఇక్కడి ఉపమాలంకారము రాజమహేంద్రపుర వర్ణనమునకు సంబంధించినది. "అఖిలజలధివేలావలయిత వసుమతీవనితావిభూషణంబైన వేంగీదేశంబునకు నాయక రత్నంబునుబోని రాజమహేంద్రపురంబునందు మహేంద్రమహిమతో బరమానం దంబున"...[1]

వేంగీ దేశమునకు నాయకరత్నమును పోలిన రాజమహేంద్రపురము; అందు మహేంద్రమహిమతో; పరమానందమున రాజరాజు కలడు. ఇందలి మూడు అంశ ములు—మహేంద్రపురము, మహేంద్రమహిమ, పరమానందమనునవి ఒకదానికొకటి ఆశ్రయములై సమాహారభూతముగా అలంకారమును ప్రభావిత మొనర్చుచున్నవి. ఈ మూడింటి ప్రభావము పర్యవసించెడి స్థానము రాజరాజు. దీని ఉద్గమన స్థానము రాజ మహేంద్రపురము. దీని పర్యవసానము ఆనందము.

నన్నయ రాజరాజు ప్రోత్సాహముతో ఆంధ్ర మహాభారతరచన కుపక్రమించి నాడు. రాజరాజు నానాగుణరత్నాకరుడు. అన్యరాజ తేజోజయశాలి శౌర్యుడు, దయార్ద్ర బుద్ధి, మొదలుగా విశేషణపరంపర అతని నాశ్రయించి సాగినవి. ఇట్టి నిఖిలగుణ మూర్తి రాజధాని ఎట్లుండును? నాయకరత్నము పోలియుండుట సహజము.

---

1. భారతము - అవతారిక - 8 - నన్నయ

నాయకరత్నమనగా హారమునకు మధ్యగల స్థూలమైన మణి. దీనికిరుప్రక్కల చిన్నవి అనేకములుండును. వేంగీదేశము హారరూపము. దీనికిరుప్రక్కల ఎన్నియో చిన్న చిన్న మణులు గ్రామములు. "నాయకరత్న" మనునది మరియొక అర్థమునకు తావొసగుచున్నది. నాయకః రత్నం ఇవ-అని ఉపమితకర్మధారయముగా గ్రహించినచో రత్నమువంటి నాయక (ప్రధాన) స్థానీయము రాజమహేంద్రపురము. "నయతీతి నాయకః" యనియు రత్నశబ్దము శ్రేష్ఠవాచకముగాను-పరిగణించినచో శ్రేష్ఠమైన రాజనీతియం దితరుల కాదర్శమైన పరిపాలనాస్వరూపమున కాస్థానముగా గుర్తింప వచ్చును. రాజమహేంద్రపుర మన్నపుడు ఇంద్రుని పట్టణమైన అమరావతి స్ఫురణకు వచ్చును పైగా మహేంద్రమహిమ యన్నది దీని కుపపోషకమైనది. రాజరాజు మహా వ్యక్తిత్వమును స్ఫురింపజేయునది.

మహేంద్రుడు దేవతలకధిపతి. అతని గురువు బృహస్పతి ఇక్కడ గురుస్థానీయుడు నన్నయ.[1] మహాభారతరచన కుపక్రమించినాడు. ఇచ్చట ఉపమాలంకారము నందు ఇంద్రగతమైన భోగభాగ్యసాదృశ్యమునందు రామణీయకము కలదు. ఈ పట్టణము సర్వవిద్యాస్థానము. పరిపాలనా కేంద్రము. మహేంద్ర విభవని యము. అన్నిటికన్న తెలుగులో మొట్టమొదట మహాకవిత్వావిర్భూతికి స్థానమైనది. ఈవిధముగా రాజమహేంద్రపురము 'నాయకరత్నము' పోలినదగుచున్నది. రాజరాజు పొందిన యశః స్థిరత్వము చేత, అమరప్రాప్తి అర్థాంతరితమగుచున్నది. ఇది పరిణతమైన నన్నయ అలంకారికరచనకు ప్రథమోదాహరణము. ఈ ఉపమ వస్త్వాశ్రితము.

ఉ. పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణునట్లు వాసిగ ధరామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁడుం దనకిష్టుఁడున్ సహా
ధ్యాయుఁడునైనవాఁ డభిమతస్థితిఁ దోడయి నిర్వహింపఁగాన్.
(ఆదిపర్వము - 1-25)

ఇందు నారాయణభట్టు, నన్నయ్యలకు కృష్ణార్జునుల పోలిక ఆపాదించుటవలన పూర్ణోపమగా గ్రహింపవచ్చును. అర్జునునకు కృష్ణుని సహాయమెంతటిదో, ఎంత అవసరమైనదో; నన్నయకు నారాయణభట్టు తోడ్పడిన విధానమట్టిది. యుద్ధసమయమున తాను నిమిత్తమాత్రముగా సారథ్యము వహించెదనన్నవాడు అర్జునుని యుద్ధవిముఖత్వము

---

1. "నిత్యసత్యవచను మత్యమరాధిపాచార్యు సుజను నన్నపార్యు" ఆదిపర్వము 1-9

నుండి మరలించి ఉత్సాహవంతుని చేసి తానే అన్నిటికి కర్తయని అందరు నిమత్తమాత్రులే యని గీతాప్రబోధము చేసెను.

స్వజన సంహారమునకు శోకించి సమరవిముఖుడైన అర్జునునితో కృష్ణుడు - సమరము రాజులకు ఉత్తమకర్మమని, అంతేగాక ఫలములయెడ బ్రహ్మార్పణ కలన పరుడు కావలెనని, తత్త్వజ్ఞానము తలకొనిన కర్మశమము తానై కలుగునని[1] బోధించి విజయునికి సందేహములు బాపి సమరమునకు ఉద్యమింపజేసెను. అర్జునుని గొప్ప తనము కృష్ణుని వలననే ప్రకాశమానమైనది.

భీష్ముని విజృంభణమునకు పాండవసైన్యమేకాదు, అర్జునుడుసైతము వెనుకంజ వేయవలసివచ్చినది అప్పుడు దారుణరోషాకలితుడైన కృష్ణుడు—"ధరణీచక్రము గ్రక్కునం గదల దిగ్దంతావళశ్రేణి కంధరముల్ మ్రొగ్గంబడన్, దిశావలయ మ్మత్కంపంబుగా"[2]—భీష్మునిపైకి పరుగెత్తినాడు. యుద్ధము చేయనని చెప్పిన వాడు ఆ సందర్భమున తనను తాను నిలువరించుకొనలేకపోయెను. భగవానుని స్వభావమైన భక్తత్రాణపరాయణత్వమిట ఆవిష్కృతమై, నరనారాయణ సంబంధము స్థాపితమగుచున్నది అర్జునుడు సంభ్రమముతో వెనుదగిలి నివారించి—"కయ్యము సేయ నేనని యకల్మషబుద్ధిం బ్రతిజ్ఞసేసి నీ, వియ్యెడం దప్పితేని జగమేమను"[3] అని ప్రార్థించి శాంతింపజేసినాడు. ప్రతిజ్ఞ చేసినపుడున్న అకల్మషబుద్ధియే యుద్ధసమయమునం దుండవలయును. కావుననే ఆ అవకాశము అర్జునునకే వదలినాడు.

కర్ణుడు సర్పముఖశరమును అర్జునుని కంఠమునకు గురిపెట్టి ప్రయోగింపగా "పలుదెస మంటలు ప్రబ్బగ, నలఘుస్ఫురణమున నిగుడు నయ్యస్త్రంబున్ జలజాక్షుండు గని పంచాంగుళ మాత్రము రథము ధరణిం గ్రుంగ నదుముడున్"[4] అట్లు చేయగానే దిక్పతుల చేతనైనను చెడని కిరీటము ఇనుడు పశ్చిమాంబునిధి నితాంతదృశ్యరుచి పొల్పెసగబడు భంగి ఇలాస్థలిపై బడినది. ఇంకను కృష్ణుడు అర్జునునకొనర్చిన ఉపదేశాత్మకమైన ఉపకారసంఘటనలు పెక్కుతావులలో కలవు.

భారతఘోరరణమున అర్జునునికి కృష్ణుడెట్లు తోడ్పడినాడో అటులనే నారాయణ భట్టు నన్నయకు తోడ్పడినాడు నారాయణభట్టును కృష్ణుడుగా తనను అర్జునుడుగా పోలిక చెప్పుటలో నన్నయ సహృదయత, కృతజ్ఞతాభావము వెల్లడి యగుచున్నది.

---

1. భీష్మపర్వము- 1 ఆ-201-202 2 భీష్మ పర్వము—3 ఆ-263
3. భీష్మ పర్వము—3 ఆ-269 4. కర్ణ పర్వము— 3 ఆ-319

భారతరచనాసందర్భములో నారాయణభట్టు నన్నయకు మతిసాచివ్యము చేసియుండును. తనకేదో సహాయము చేసినందుల కేదో మొక్కుబడిగా చెప్పినది కాదు. నారాయణభట్టు సామాన్యుడు కాడు. సంస్కృతాంధ్ర ప్రాకృత పైశాచిక భాషలయందు పాండిత్యము కలవాడు; కవిరాజశేఖరుడు; రాజనీతివేత్త.[1] నందంపూడి శాసనమునందు జగదభినుతగుణశాలి; సరస్వతీకర్ణావతంసము .. అష్టాదశావధారణ చక్రవర్తియని కీర్తితుడు. నన్నయ మాటలలో ఇతడు వాఙ్మయధురంధరుడు; సహాధ్యాయి యిష్టుడుగా చిత్రితుడు. కృష్ణుడాయుధము చేపట్టలేదు కాని విజయునకు సర్వవిధముల తోడై నిలచి విజయము ప్రాప్తింపజేసినట్లు నారాయణభట్టు - భాషా విషయమునందు, సంస్కృత తెలుగు శబ్దముల స్వీకృతియందు, చంపూపద్ధతి నవలంబించుటయందు, క్లిష్టమైన వ్యాసఘట్టములను దాటుటయందు, అనువాదవిధానమునందు, దేశిరీతిలో రచనకు ప్రోత్సహించుటయందు సహాయ మొనర్చియుండును.

చ. పరమవివేక సౌరభవిభాసిత సద్గుణపుంజ వారిజో<br>త్కరరుచిరంబులై సకలగమ్యసుతీర్థములై మహామనో<br>హర సుచరిత్రపావనపయః పరిపూర్ణములైన సత్సభాం<br>తరసరసీవనంబుల ముదంబొనరం గొనియాడి వేడుకన్.(ఆది 1-24)

ఇందు వివేకసౌరభముచేత విభాసితమై, సద్గుణపుంజాలసితమై, సుచరిత్రమయమై, విలసిల్లిన సత్సభలు వర్ణితమైనవి. ఈ సభలలోని విద్వాంసులచేత గుణపరిశీలనము జరిగెడిది. కవిత్వవిషయమున ప్రామాణికమైన స్థితిని స్థాపించుటకు దోహదమొనర్చినవి. ఆ కాలమున ఏ గ్రంథమైనను ఇట్టి విద్వత్సభల ఆమోదముద్ర పొందవలసిన అవసరము కలదు. అతిప్రాచీనకాలమునుండి ఇట్టి సభలు కలవు. పాండ్యరాజుల పోషణమున తమిళదేశమునందు పూర్వము వివిధప్రాంతములందు మూడు సభలు కలవు. సంగమ్ యుగమునందు తమిళవాఙ్మయ మభివృద్ధి గాంచినది. సంగము (సంఘము)లనగా సాహిత్యపరిషత్తులని చెప్పవచ్చును. సత్(విద్వత్) సభలు నన్నయ కాలమునందును ఉత్తమసాహిత్యాభివృద్ధికి తోడ్పడినవనుటలో

---

1. "కొంతకాల మతడు పశ్చిమచాళుక్యరాజైన త్రైలోక్యమల్లదేవరకు మంత్రియై యుండినట్లు శా. శ. 977 లో నాతని కూతురైన కుపమ దాక్షారామమున వేయించిన శిలాశాసనమువలన స్పష్టమగుచున్నది."నన్నయ భారతము పుట 683 డా. అవధాని D.V. తరువాత పశ్చిమ చాళుక్యుల ఆస్థానమునుండి యేకారణము చేతనో రాజమహేంద్రవరము వచ్చినాడు.

సందేహము లేదు. నన్నయ భారతమున పెక్కుచోట్ల వీని ప్రసక్తి కన్పించును. ఉదాహరణమునకు "సకలసూరి సభారమ్యంబగు తృతీయపర్వము" (1-1-39) "సభారంజనమై సర్వమనోజ్ఞము నాల్గవ పర్వము" (1-1-42), మున్నగువానినిబట్టి నన్నయ మహాభారతము పండితసభలలో వినిపించినట్లు భావింపవచ్చును. ఇందలి 'రమ్య' 'రంజన' శబ్దములు వారి యామోద హృదయమునకు దర్పణము పట్టుచున్నవి. దీనికి పోషకముగా "దేవా... విద్వజ్జనంబుల యనుగ్రహంబునంజేసి" (1-1-20) యన్నమాటలు చూడవచ్చును. ఈ సభలలో చదివి విద్వజ్జనుల యనుగ్రహము పొందుట సుకరమైన పనికాదు. పెక్కు సమస్యలుత్పన్నమై యుండును. ఘోరరణ సదృశమైన క్లిష్టపరిస్థితులలో తనకిష్టుడు, సహాధ్యాయుడు, వాఙ్మయధురంధరుడు, నైన నారాయణభట్టు అభిమతముగా తోడయి నిర్వహించియుండుటలో అసహజ మేమియు లేదు.

ఈ ఉపమాలంకారమునందు ఎంతయో అర్థము దీర్ఘ దీర్ఘతరముగా పర్యాప్తమై యున్నది. ఇందు నన్నయ కృతజ్ఞతాపూర్వకమైన ఆర్ద్రభావముతోపాటు నారాయణ భట్టు ప్రజ్ఞారూపమును ప్రకాశితమగుచున్నది. యుద్ధసందర్భమున కృష్ణుని సహాయ మెట్టిదో భారతరచనానిర్వహణమున నారాయణభట్టు తోడయిన విధానమట్టిది. ఇది సహృదయైకవేద్యము. ఈ ఉపమ సంఘటనాశ్రితము.

# ప్రధాన కథ

ఇట్టి మహాభారతంబు ననేకవిధ పదార్థప్రపంచసంచితంబు నుపపర్వమహాపర్వోప శోభితంబు నుపద్వీపమహాద్వీపసంభృతంబయిన భువనం బజుండు నిర్మించినట్లు కృష్ణద్వైపాయనుండు నిఖిలలోకహితార్థంబు దత్తావధానుండై సంవత్సరత్రయంబు నిర్మించి.........కృతత్రేతావసానసమయంబుల దేవాసుర రామరావణ యుద్ధంబులును బోలె ద్వాపరాంతంబున పాండవధార్తరాష్ట్రులకు మహాఘోరయుద్ధంబయ్యెనందు.[1]

ఈవచనము మహాభారతసంహితానిర్మాణప్రశంసారూపము, ప్రధానకథాలక్షణము కలది.

సూతుడు శౌనకాది మహామునులకు భారతకథ వినిపించునపుడు వ్యాసనిర్మితమైన మహాభారతము బ్రహ్మసృష్టి యంతటిదని ఉపమించినాడు. సృష్టియందెన్ని విశేషము లుండునో భారతమందును అన్నికలవు. దీనికి కారణము 'లోకహితార్థమై'న వ్యాసుని 'దత్తావధాన'తయే వ్యాసుడు బ్రహ్మ యంతటివాడు. కావున బ్రహ్మర్షి యనుట సముచితము. అజుడు భువనము నిర్మించినట్లు వ్యాసుడు మహాభారతము నిర్మించెననుటలో సృష్టికార్యమువలె ఈగ్రంథము అనేకవస్తుసంభృతము, బహువిస్తృతము, విచిత్రము, వైవిధ్యోపేతము, పురుషార్థవిలసితము నైనదని అభిప్రాయము.

పాండవులకు కౌరవులకు జరిగిన యుద్ధము దేవాసుర,రామరావణ యుద్ధములతో పోల్చబడినది. యుద్ధముజరుగుటకు గల కారణములు వదలి, కేవలము శ్రవణకుతూహలాత్మకతపై దృష్టి సాగినది. యుగయుగములందు జరుగు అధర్మనాశనము, ధర్మ

1. ఆదిపర్వము 1 ఆ–67

ప్రతిష్ఠాపనము ఇందు ప్రపంచితమైన సారాంశము. భగవంతుడు సదా సత్యము, ధర్మమునే ఆశ్రయించి యుండును. దేవతలు, రాముడు ఒకపక్షమునకు; అసురులు, రావణుడు మరొకపక్షమునకు చెందినవారు. ఒకపక్షమువారి ప్రకృతి మరొకపక్షమువారి ప్రకృతికి భిన్నము. కావున వైరము మరణాంతము వరకు ఉండును.[1]

రాముడు సత్యగుణము ప్రధానముగా కలవాడు. ఇది సదభిముఖముగా ప్రవచింపజేయుటకు అనగా ధరస్థాపనకు రజోగుణము అవసరమైనది. రావణుడు తమోగుణము ప్రధానముగా గలవాడు. రజోగుణముచేత ఇది పరమదుష్టత్వము భజించినది. ఒకరి ప్రవృత్తి సత్పదార్థము నాశ్రయించినది. మరొకరి ప్రవృత్తి అసల్లక్షణము నాశ్రయించినది. ఇరువురి ప్రవర్తనారీతివలన సంఘర్షణ తప్పినదికాదు. జయము చివరకు సత్తునకే లభించినది. అటులనే మహాభారతకథలో పాండవులు సల్లక్షణోపేతులు, కౌరవులు దుష్టాత్ములు. శిష్టరక్షణ, దుష్టశిక్షణకై ఉద్భవించిన భగవంతుడు శ్రీకృష్ణుడు పాండవుల పక్షము వహింపక తప్పినదికాదు. ధర్మాధర్మములను ఎదురెదురుగానుంచి వ్యాఖ్యానించినపుడు సహృదయులకు జయమెటు మొగ్గియున్నదో సులభముగా తెలియును. ఇదిక్రమముగా దేవాసురులు, రామరావణులు పాండవధార్తరాష్ట్రులుగా నిర్మితమైనది. ఈ యుపమాలంకారము కథాగతమైన మూలభూతమైన వస్తువు తీర్పు; ప్రయోజనమును సూచించునది. స్వతంత్రమైనది.

"అని యడిగిన వారికి నక్కథకుండిట్లని చెప్పెందొల్లి సర్పకులజననియైన కద్రువ శాపంబు కారణంబునంజేసి జనమేజయు సర్పయాగంబున సర్వభక్షకుండైన యగ్ని యందు సర్పంబులకెల్ల నకాండప్రళయంబైన దాని భృగువంశజుండైన రురుండు గావించు సర్పఘాతంబు సహస్రపాదుం డుడిగించినట్లు జరత్కారుసుతుండైన యాస్తీకుం డుడిగించె దీని సవిస్తరంబుగాఁజెప్పెద వినుండని భృగువంశకీర్తనంబు నాస్తీకుచరితంబును జెప్పందొడంగెను".[2]

భృగువంశజుడు రురుండు. విశ్వావసుగంధర్వునకు అప్సరసయైన మేనకకు జన్మించినది ప్రమద్వర. ఈమెను వివాహమాడ నిశ్చయించుకొనినాడు రురుడు. ప్రమద్వర ఒకనాడు పాదమర్దితమైన సర్పము కాటువేయుటవలన మరణించినది అది రురునకు దుఃఖకారణమై క్రోధమావిర్భవింపజేసినది. ఆయుష్యమునం దర్ధభాగ మిచ్చి

1. మరణాంతాని వైరాణి - రామాయణము - యుద్ధకాండ - వాల్మీకి.
2. ఆదిపర్వము 1 ఆ-128

ప్రమద్వరను బ్రతికించుకొనినాడు. ఐనను తన భార్యకపకారము చేసిన సర్పజాతిని నాశనము చేయదలచి కనబడిన సర్పములనెల్ల సంహరింప మొదలిడెను.

పాండవవంశమునకు ఉత్తరాధికారిగా మిగిలినవాడు పరీక్షిన్మహారాజు. ఆతని పుత్రుడు జనమేజయుడు. వేటకొరకై అరణ్యమున కేగిన పరీక్షిన్మహారాజు శమీకుని పట్ల ఒనర్చిన అపరాధము వలన తక్షకుని కాటుకు గురియై మరణించినాడు. తక్షకుని వల్లనే అపకారము పొందియున్న ఉదంకుడు జనమేజయుని సర్పయాగమునకు ప్రోత్సహించినాడు.

అక్కడ రురునికి భార్యాగతమైన ప్రేమ సర్పఘాతమునకు దారితీయగా, ఇక్కడ జనమేజయునికి పితృగతమైన ప్రేమ సర్పయాగమునకు కారణమైనది. ప్రేమాభిమానములు స్వార్థమునకై ఉపయోగింపకూడదు. దీనికై హింసాయత్తబుద్ధి కారాదు. ఇక్కడ జరుగకూడనిది జరిగినది. అన్ని గుణములకన్న శమము మిన్నయైనది. రురుని సహస్రపాదుడు, జనమేజయుని ఆస్తీకుడు క్రమముగా సన్మార్గమునకు మరలించుటకు యత్నము చేసినవారు. బ్రాహ్మణుడు ప్రతీకారము, క్రోధము, హింసాదివికారగుణములకు దూరముగా నుండువాడై, అరిషడ్వర్గమును జయించినవాడై సత్త్వగుణోపేతుడై ఉండవలెనన్న పరమార్థము స్థాపితమైనది. ఇచ్చట ఉపమ కథాసందర్భ పురస్కృతమైనది. రెండింటియందు సాదృశ్యములైన భూతహితము, అహింస మున్నగు ఉదాహరణములు ప్రకరణోచితముగా సంభావనీయములు.

క. క్షమలేని తపసి తపమును, బ్రమత్తు సంపదయు ధర్మబాహ్యప్రభు రా
జ్యము భిన్నకుంభమున తో, యములట్టుల యధ్రువంబులగు నివియెల్లన్.[1]

శమ ఏవ యతీనాం హి క్షమిణాం సిద్ధికారకః ।
క్షమావతామయం లోకః పరశ్చాపి క్షమావతామ్ ॥[2]

వేటకై అరణ్యమునకు వచ్చిన పరీక్షిన్మహారాజు శమీకునిపై మృతసర్పమును వైచి అపరాధమొనర్చినాడు. మునులవలన తండ్రికి జరిగిన అవమానమును విని శృంగి వాడుమొదలుగా ఏడు దినములలో తక్షకవిషాగ్నికి ఆహుతి యగునట్లు పరీక్షిత్తునకు శాపమొసంగెను. కుమారుని తొందరపాటుకు శమీకుడు చింతించి క్రోధమువలన, క్షమ లేనందువలన కలిగెడు అనర్థములను బోధించెను. క్షమ లేనటువంటి తపస్సును,

1. ఆదిపర్వము 2 ఆ-178　　2. ఆదిపర్వము 34-9

ప్రమత్తుని సంపదయు, ధర్మబాహ్యుడైన ప్రభువు రాజ్యమును, పగిలినకుండలోని నీరు నిలువని విధము సనని చెప్పెను. తనపట్ల పరీక్షిత్తు అపరాధమొనర్చినను ధ్యాన మగ్నుడైన తాను గమనించలేదు తరువాతనైనను క్షమాస్వభావముతో పుత్రునికి హితముపదేశించెను. తాము తాపసవృత్తియందున్నవారు కనుక శృంగి తొందరపాటు స్వభావమును గుర్తుచేయుటకై ప్రారంభముననే క్షమలేని తపసి తపమును అని చెప్పెను.

మూలమునందు క్షమవలన ప్రాప్తించు లాభములు మాత్రము పేర్కొనబడినవి. తెలుగునందు ఇన్ని లాభకారణములును క్షమ లేనందువలన ఎట్లధ్రువము లగునో వివరింపబడినవి. ఇచట నన్నయ పూర్ణోపమ ధర్మవిషయవివరణమునకై ఉప యోగపడినది.

"ఇట్లు నిఖిలక్షత్రియార్థం బలిగిన పరశురాముండునుంబోలెఁ గడు నలిగి పరశు రామశిష్యుం డాక్షత్త్రవర్గంబు నెల్లఁ దన శరధారావర్షంబున ముంచి యోడించి యేక వీరుండయి వచ్చువాఁడు పిఱుంద సమరసన్నద్ధుండయి సాల్వుండు సనుదెంచి"[1]

భీష్ముడు తనసోదరుడైన విచిత్రవీర్యునికి వివాహము చేయదలచి కాశీరాజు కూతుల స్వయంవరోత్సవము విని ధనుర్ధరుడై బయలుదేరిపోయెను. తక్కిన రాజలోక మంతయు వెరగుపడి చూడ ఆకన్యకల రథమెక్కించుకొని వచ్చుచుండెను నానావనీ నాథులందరు ఏకమై భీష్ముని ఎదుర్కొనిరి. ఆసమయమున నిఖిలక్షత్రియార్థం బలిగిన పరశురామునివలె భీష్ముడు క్షత్రవర్గము నెదిర్చి ఓడించెను. పరశురాముని శిష్యుడు భీష్ముడు క్షత్రియులపై పగబూని ఇరువదియొక్కమారులు దండెత్తి రాజుల నందరిని హతమార్చినవాడు పరశురాముడు. ఇక్కడ భీష్మునికి వ్యక్తిగతద్వేషము ఎవరిపైనను లేదు. సోదరునికొరకు ఈవివాహప్రయత్నము కనుక వధింపవలసిన అవసరము లేక పోయినది. వారి పరాక్రమమును మాత్రము ధిక్కరించి తనపనిని నెరవేర్చుకొనినాడు. పరశురామునితో పోలిక చెప్పినను గురుశిష్యుల కార్యస్వరూపముయొక్క స్వభావము వేరు. నన్నయ ఆవిషయమును గుర్తింపజేయుటకై క్షత్రియవర్గమును శరధారా వర్షమున ముంచి యోడించెననియే చెప్పినాడు అయినను సాధనము వేరైనను, చేయు కర్మమొక్కటియే దీని తీవ్రత, అమోఘలక్షణము స్ఫురింపజేయుటకు పరశు రామునితో పోల్చబడినది. ఈ ఉపమ నన్నయ స్వతంత్ర ప్రయోగము.

1. ఆది 4-204

"భీష్ముండును దన రథంబు నివర్తింపించి సంవర్తసమయ సమవర్తియుంబోలె నతిరౌద్రాకారుండయి నిలిచిన" 1

రాజులను జయించి పోబోవు భీష్మునితో సాళ్వుడు తలపడినాడు. భీష్ముడును తనరథము నిలిపి సంవర్తసమయ సమవర్తివలె అతిరౌద్రాకారుడై ఎదుర్కొనినాడు. ఇరువురికి జరిగిన యుద్ధమున సాళ్వుడు ఓడిపోయి విఫలమనోరథుడై నిజపురమున కరిగినాడు. భీష్ముడు ఎవరితో తలపడినను సంహరింపక ఓడించుట మాత్రము జరిగినది. రాజులందరు ఏకమై వచ్చిన అధికవిజృంభణను చూపినవాడు, సాళ్వుని విషయమునను తన క్రోధము నంతే ప్రదర్శించెను. తనమార్గమున కడ్డువచ్చినవారిని తొలగించుకొను ఉద్దేశము మాత్రమే కలవాడు కనుక ప్రళయకాలసమయ సమవర్తివలె రౌద్రుడైనాడు. ఇచట "సమవర్తి" అని నన్నయ స్వతంత్రముగా వాడిన పద విశేషము గమనింపదగినది. సమవర్తి యనగా కాలుడని అర్థము. అన్నింటిపట్ల సమముగా వర్తించువాడు సమవర్తి కనుకనే సందర్భోచితముగా విజృంభించినను సంహరింపక వానిని ఓడించినాడు సమవర్తనము కలిగినవాడు కనుకనే భీష్ముడు ఉచితానుచితముల నెరిగి ప్రవర్తించినాడు.

"పృథివ్యాదిమహాభూతంబులు గంధాదిగుణంబుల నెట్లు విడువవట్ల యేనును గురుకార్యంబున మీ శుల్కార్థంబుగా సర్వజన సమక్షంబున నా చేసిన సమయస్థితి విడువ" ........2

త్యజేచ్చ పృథివీ గంధమాపశ్చ రసమాత్మజమ్ ।
తేజస్తథా త్యజేద్రూపం వాయుః స్పర్శగుణం త్యజేత్॥
న త్వహం సత్యముత్స్రష్టుం వ్యవస్యేయం కథంచన ॥3

వంశము నుద్ధరించవలసిన విచిత్రవీర్యుని మరణముతో కురువంశక్షతి ఏర్పడు నని జననియైన సత్యవతి భీష్ముని వివాహమాడుమని ప్రార్థించినది. అప్పుడు భీష్ముడు పృథివ్యాది మహాభూతములు గంధాదిగుణములు విడువనట్లు తాను తన ప్రతిజ్ఞ విడువనని నిశ్చయముగా చెప్పినాడు. తన ప్రతిజ్ఞ సర్వజనసమక్షమున చేసినట్టిది. ప్రకృతికి సహజమైన గుణములెట్లో తన వర్తనమును అంతియ యనెను. వంశక్షయము

1. ఆది. 4–206. 2. ఆది. 4-225.
3. ఆది. 98-28, 30.

కాకుండ తనకు తోచిన విధానమును తల్లికి తెలియజెప్పినాడు. సమయభంగముగా ప్రవర్తించుట ఉత్తముల లక్షణముకాదు. పితృఋణము తీర్చుకొనుటకు తన ప్రతిజ్ఞ తోడ్పడినది. అట్టిదానిని మరల వివేచనాశూన్యుడై అతిక్రమించుట అపరాధమని భీష్మునికి తెలియును. అట్టిసమయమున అంతటి కఠినదీక్ష తల్లికి బోధపడవలెననిన పంచభూతముల గుణాదుల సామ్యము చెప్పినగాని వీలుపడదు. "పృథివ్యాది" అను ఉపమ, మహాభారత మూలమునందు లేదు. అయినను మూలగ్రంథాశయమిట ఉపమచే వివరింపబడినది.

ఉ. నీలగిరీంద్ర శృంగమున నిర్మలమైన సువర్ణవల్లరీ
జాలమువోని పింగలవిశాలజటాచయ మొప్పఁగా వచ
శ్శ్రీలలితుండు వచ్చి నిలిచెన్ హరినీలవినీలవిగ్రహా
రాళరుచుల్ వెలుంగఁగ బరాశరసూనుఁడు తల్లి ముందటన్. 1

కురువంశోద్వహనార్థము, భీష్ముని అభిమతము ననుసరించి సత్యవతి తన పుత్రుడగు కృష్ణద్వైపాయనుని ధ్యానించినది. ప్రార్థించినదే తడవుగా తల్లిముందట వ్యాసుడు ప్రత్యక్షమయినాడు. నన్నయ వ్యాసాగమనముపట్ల ప్రత్యేకమమైన శ్రద్ధ చూపించినాడనవచ్చును. కురు,పాండవవంశములకు మూలపురుషుడు కాబోవు వ్యాసుని ఆకృతివిశేష మట్లున్నది. నీలగిరీంద్ర శృంగమున సువర్ణవల్లరీజాలమును బోలిన జటాచయము కలిగినవాడును, వచశ్శ్రీలలితుడును, హరినీల వినీల విగ్రహారాళరుచితో వెలిగెడువాడును పరాశరసూనుడు. నల్లని పర్వతాగ్రమున సువర్ణకాంతి కలిగిన వల్లరీజాలముతో జటలసమూహమునకు పోలిక చెప్పినాడు. నల్లని, సువర్ణమయ కాంతులు గల వ్యాసుని గంభీరాకృతి-హరిహరుల కలయికను స్ఫురింపజేసి తిక్కన హరిహరాత్మక భావనాబలమునకు నన్నయ మూలమైనాడనిపించును. దైవత్వవిషయమున ఇది సమంజసమే. కురుపాండవుల విషయమున దీనిని (రెండు కాంతులను) గ్రహించిన అవి వారి గుణవిశేషములుగా చెప్పవచ్చును. అంబిక అంబాలికలకు పుత్రదానము చేయుటకై వచ్చినవాని ఆకృతిని ఇరువురును వేరుగా భావించుటచేతనే ధృతరాష్ట్ర, పాండురాజుల జననము అంధత్వ, పాండుత్వములతో సంభవించినది. వీరిట్టివారైనను కౌరవ పాండవుల ఆకృతి విశేషములలో, గుణసంపదలో నల్లని, సువర్ణ కాంతుల ప్రభావము కన్పించుచున్నది. కాంతిస్వచ్ఛతను స్వర్ణవర్ణముతో, దోషమును నల్లని

1. ఆది. 4-240.

వర్ణముతో పోల్చుట కలదు. ఇట్టి గుణములు కలిగినవారి వలననే భారతయుద్ధ మనివార్య మైనది. ఐనను పాండవులకు అత్యున్నతస్థానమే లభించినది. అది సువర్ణకాంతి కలిగిన జటాస్థానము. ఇంతవరకు వ్యాసుని ఆకృతివిశేషము వ్యాపించినదని చెప్ప వచ్చును. ఇట్టి పరాక్రమవంతులకు మూలాధారమైనవాడు కనుక నన్నయ వ్యాసా కృతిని గంభీరముగా తీర్చినాడు. ఇది వస్తువర్ణనాగతమైన అలంకారము.

క. శతశృంగ నగేంద్రము శత,ధృతిసర్గదినంబ పోలెఁద్రిభువనభూత
ప్రతతిఁ బరిపూర్ణశోభా, ధృతి నింద్రతనూజు జన్మదినమున నొప్పెన్.[1]

తతః పర్యచర త్తేన బలినా భగవానపి
అధాఽగామ దేవేంద్రో జనయామాస చార్జునమ్ ॥[2]

పాండురాజు కోరికపై కుంతి దుర్వాసుని మంత్రప్రభావమున ధర్మజుని, భీముని, అర్జునుని బడసినది. అర్జునుని జననవేళ "శతశృంగనగేంద్రము శతధృతి సర్గదినంబ పోలెఁద్రిభువనభూత ప్రతతిఁ బరిపూర్ణశోభాధృతి"తో నొప్పినది జన్మ సమయమున అర్జునుని గుణగణములు, భవిష్యత్కాలమున అతని విజయ పరం పరలును,దివ్యవాణి వినిపించినది. అంతేగాక మరీచ్యాది ప్రజాపతులును, ధాత్రాది ద్వాదశాదిత్యులును, ధరాదివస్తువులును, శేషాదిమహానాగముఖ్యులును, అప్సరసలు, అశ్వినులు, మొదలగు వారందరు అర్జునుని జననసమయమున శతశృంగమున కరుదెంచిరి. అజుని సృష్టిదినమువలె పరిపూర్ణశోభాధృతితో శతశృంగ నగేంద్ర మొప్పినది. అర్జునునికి గల ప్రత్యేకతను నన్నయ వివరించుటలోని ఆంతర్యము గమనించ దగినది. నరనారాయణులను మహామునులలో నరుడు అర్జునుడుగ జన్మించినాడు. పాండుపుత్రులందురు దైవాంశసంభూతులైనను అర్జునునకు నారాయణునితోడి బాంధవ్యము అధికము. నరనారాయణులే కృష్ణార్జునులు. అట్టి నరుని జన్మదినమును విశిష్టమైనదిగా నన్నయ తీర్చినాడు. మూలమున కేవలము జన్మించిన విషయము కలదు. నన్నయ అర్జునుని(నరుని) విశిష్టతను ఆలంకారికముగా గుర్తింపజేసినాడు. పరిపూర్ణమైన అర్జునుని జన్మదినము పూర్ణోపమగా సిద్ధించినది.

క మతిదలపగ సంసారం, బతిచంచల మెంతమావులట్టుల సంప
త్ప్రతతు లతిక్షణికంబులు. గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్.[3]

1. ఆది - 5-126.
2. ఆది 113-15
3. ఆది - 5-159

అతిక్రాంతసుఖాః కాలాః ప్రత్యుపస్థితదారుణాః ।
శశ్వత్ పాపీయదివసాః పృథివీ గతయౌవనా ॥[1]

పాండురాజు మరణించిన తరువాత తక్కిన కర్మకాండలన్నియు యథోచితముగా విదురుడు జరిపించెను. కుంతి పుత్రసహితముగా హస్తినాపురికి వచ్చినది. పరలోకక్రియల నిర్వహణానంతరము కృష్ణద్వైపాయనుడు వారందరికి దుఃఖోపశమనము గావించినాడు. తల్లియైన సత్యవతితో ఎండమావుల విధమున సంసారము చంచలమని, సంపదలు క్షణికములని, భవిష్యత్కాలముకన్న భూతకాలము మేలని పలికినాడు. రాబోవుకాలమున జరుగు అనర్థములన్నియు వ్యాసుని దివ్యదృష్టికి గోచరమైనవి. అందులకే గతకాలము మేలైనదనినాడు. సంసారమును ఎండమావులతో పోల్చుట, సంసారము చంచలము సంపదలు క్షణికములనుట, మరణగతమైన దుఃఖమును ఉపశమింపజేయుట ఒకటి. రాబోవు కాలవిపర్యయమును సూచించుట రెండవది. పాండురాజు శాపగ్రస్తుడై తన మరణమును తానై కోరితెచ్చుకొనినాడు. పాండుకుమారులకు సంపదలు క్షణికములే యైనవి. ధృతరాష్ట్రుడెంత సమత్వమును పుత్రులపట్ల చూపించినను కౌరవులకు పాండవులపట్ల మాత్సర్యభావము ఉండనే యున్నది మూలములోని "అతిక్రాంతసుఖాః కాలాః ప్రత్యుపస్థితదారుణాః", "శశ్వత్ పాపీయదివసాః" అన్న భావన కురురాజుల గతవైభవమును రాబోవు దారుణ పరిస్థితులను సూచించుచున్నది.

క. అనిలసుతుండంతన మే, ల్కని నీల్గుడు నతని వజ్రఘనకాయము బొం
దన లతికాపాశములె, ల్లను దెగ్సె మృణాళనాళలతికలపోలెన్[2]

దుర్యోధనుడు అపాండవముగా సముద వలయావృతాఖిలక్షోణిని పరిపాలింప దలచినాడు. శకుని దుశ్శాసనాదులతో విచారించి భీమునికి అపకారము తలపెట్టినాడు. ఒకనాడు జలక్రీడానంతరము విశ్రమించియున్న భీముని ఘనలతాపాశముల బంధించి గంగమడువున ద్రోయించెను. మేల్కాన్న భీముని అంగవిజృంభణముతో ఘనలతికా జాలములన్నియు మృణాళనాళలతికలవలె తెగిపోయినవి. ఇవన్నియు భీముని వజ్రఘనకాయమును చుట్టుకొని యున్నవి పుట్టుకతోడనే భీముని శరీరము ఘనమైనది. శార్దూలభయమున కుంతి, పూర్వము ఒకప్పుడు తన చేతిలోనున్న భీముని శిలోత్కరముపై జారవిడుపభీముని నిష్ఠురతనుహతివలన అరాలు చూర్ణమగుట దీనికి నిదర్శనము.

1. ఆది - 118-6 2. ఆది 5-172

దుర్యోధనుడు భీముని జంపుటకు చేసిన యత్నము లన్నియు విఫలమైనవి ఆ విఫలమగుట ఎట్లున్నదనగా కృతఘ్నునకు చేసిన మేలువలె ఉన్నది. జరిగినవి దుష్ప్రియత్నములే కాని అవి నిజముగా భీమునికి మేలైన కార్యములే. ఇట్టి పరీక్షలను గెలిచినాడు కనుకనే భీముని బుద్ధిపరాక్రమములు వెల్లడియైనవి. నన్నయ ఈ ఉపమా ప్రయోగమును భీమునికెదో పరమార్థమును ఆశించియే చేసినాడు; కాని వృథా ప్రయోగము కాదు. సజ్జనునికి కీడు తలపెట్టినను దుర్మార్గునికి మేలు చేయదలచినను ఫలితమొక్కటే. ఐనను పదప్రయోగము సందర్భానుసారముగా ఔచిత్యము నెరిగియే నన్నయ చేసెను. తానే రాజుగా ఉండదలచినవాడు తక్కినవారు తనపట్ల విశ్వాసము చూపుచు అణగి యుండవలెననియే కోరును. కాని భీముడు దుశ్శాసనాదులను పదుగుంద్రను ఒక్కపెట్ట పట్టి ధరిత్రిపై బడవైచి వీపులొలియ ఈడ్చియు పదుగుంద్ర నొక్కొక్క భుజమున నెక్కించుకొని నీటిలో ముంచుచు నెత్తియు, ఫలార్థులై వ్రాకుల నెక్కినవారిని పండ్లతోబాటు పడునట్లు చెట్లు కదల్చియు బాధించినాడు. ఇట్టివాడు విశ్వాసపాత్రుడు కాక కృతఘ్నుడగును. అట్టివానికి తాను చేసిన కీడు లన్నియు మేళ్ళైనవి. భీమునికి కీడు చేయదలచిన దుర్యోధనుని పాట్లు భీమునిపట్ల నిష్ఫలమైనవి. కనుకనే సిగ్గుపడి కక్షను మనసునందే దాచుకొని తగిన సమయమునకై వేచియుండెను. ఇక్కడ ఉపమ కథలోని పాత్రగతమై పరస్పర విరుద్ధమైన కృతజ్ఞత, కృతఘ్నుత యను మనస్తత్వమును భావించు తీరుపై చిత్రింపబడినది.

ఉ. హారి విచిత్రహేమకవచావృతుఁ డున్నతచాపచారుదీ
ర్ఘోరుభుజుండు భాస్వదసితోత్పలవర్ణుఁడు సేంద్రచాపశం
పారుచిమేఘమో యనఁగఁ బాండవమధ్యముఁడొప్పి బద్ధతూ
ణీరుఁడు రంగమధ్యమున నిల్చె జనంబులు దన్ను జూడఁగన్.[1]

కాంచనం కవచం బిభ్రత్ప్రత్యదృశ్యత ఫల్గునః ।
ఏకస్సేంద్రాయుధతడిత్ససంధ్య ఇవ తోయదః ॥ [2]

కుమారాస్త్రవిద్యాప్రదర్శన సందర్భమున రంగమధ్యమున నిలిచిన అర్జునుని ఆకృతివిశేష మిది. మూలమున "సేంద్రాయుధతటిత్ససంధ్య ఇవ తోయదః" అని యున్న ఉపమాలంకారమును నన్నయ "సేంద్రచాపశంపారుచిమేఘమో యనఁగ" అని మార్చి అనువదించినాడు. ఇందు అనగా అనుఉత్ప్రేక్షావాచకమున్నప్పటికి ఉపమయే కాని

1. ఆది. 6-17 2. ఆది. 128-10

ఉత్ప్రేక్ష కాదు. "భాస్వదసితోత్పలవర్ణుఁడు" అని వాచకలుప్తను ప్రయోగించినాడు. ఈ పద్యమునందు ప్రధానముగా దీపించు భావము——

జనుల యెదుట నిలచినవాడు-హేమకవచావృతుడు, ఉన్నతచాపచారుదీర్ఘోరు భుజుడు, అసితోత్పలవర్ణుడు, బద్ధతూణీరుడు. కనుక ఇంద్రచాప శంపారుచి మేఘమో యన్న భావమునకు తావైనాడు. అర్జునుడు పరాక్రమమున ఉపమాస్థానమం దుండ వలసినవాడు. రంగమధ్యమున నిల్చినవాడు ఉపమానముగా గోచరించు అర్జునుడు జనుల సొగసైన భావనకు పాత్రమైనవాడు ఉపమాశక్తిచేత అర్జునుని వ్యక్తిత్వమునకు విశిష్టమైన ఆకర్షణ చేకూరినది.

శా. సాలప్రాంశునిజోజ్జ్వలత్కవచు శశ్వత్కుండలోద్భాసితున్
బాలార్కప్రతిమున్ శరాసనధరున్ బద్ధోగ్రనిస్త్రింశు శౌ
ర్యాలంకారు సువర్ణవర్ణు ఘనుఁ గర్ణాఖ్యున్ జగత్కర్ణపూ
ర్ణాలోలద్గుణుఁ జూచి చూపఱు ప్రభూతాశ్చర్యులై రచ్చటన్.[1]

"వివేశ రంగం విస్తీర్ణం కర్ణః పరపురంజయః ।
సహజం కవచం బిభ్రత్ కుండలద్యోతితాననః ॥
స ధనుర్బద్ధనిస్త్రింశః పాదచారీవ పర్వతః ।
కానీనస్తు పృథుయశాః పృథాపుత్రః ప్రతాపవాన్" ॥[2]

అస్త్రవిద్యాప్రదర్శన సమయమున అర్జునుని కౌశలము చూచి జనులానందించు సమయమున రంగద్వారమున నిజవిద్యాకౌశలము చూపుటకు కర్ణుడు ప్రత్యక్షమైనాడు. కర్ణుని రూపవిశేషమును నన్నయ ప్రత్యేక లక్షణములు కలదిగా తీర్చినాడు. పాండు పుత్రులలో మిగిలినవారి కెన్ని విశేషణములు చెప్పినను వారివారి జన్మవృత్తాంతములు సర్వులకు విదితమే కర్ణుని విషయమున కథాగతముగా అతని జన్మరహస్య మేనలువురికో తప్ప అందరకు తెలియదు. ఆతడు సూతపుత్రుడుగానే పరిచితుడు. అట్టివాడు కథాసందర్భములందు ఎక్కడ విజృంభించినను వాని కారణజన్మత్వమును నన్నయ సూచనప్రాయముగా పద్యములం దంతర్భూతము గావించెను. సాలప్రాంశుడు నిజోజ్జ్వలత్కవచుడు, శశ్వత్కుండలోద్భాసితుడు, శరాసనధరుడు, శౌర్యాలంకారుడు, సువర్ణవర్ణుడు మొదలుగా ఇట్లెన్ని చెప్పినను ఇవన్నియు బాలార్కప్రతిమ డనుటకంటె

---

1. ఆది. 6-31 2. ఆది. 129 - 5, 6, 7

దీప్తిమంతములు కావు. ఏ పదప్రయోగమునకు తగిన రామణీయకము దానికున్నను ప్రత్యేకించి ఈ యన్నింటిలో బాలార్కప్రతిముడనుట కర్ణుని జన్మవృత్తాంతమును జ్ఞప్తికి చేయునది. మూలమున ఈ విశేషణములన్నియు కలవు. "పృథా పుత్రః ప్రతాపవాన్" అనుదానిలో "ప్రతాపవాన్" అదనముగా సౌందర్యమును సమకూర్చునది. తెలుగునందు "బాలార్కప్రతిము"డని కలదు. బాలార్కునివంటి రూపస్ఫూర్తిగలవాడని తాత్పర్యము.

అస్త్రవిద్యాప్రదర్శన సమయముననే కర్ణుడు జనులనాకర్షించి స్తుతిపాత్రుడైనాడు. తన పరాక్రమము ప్రదర్శించుటకు తగిన సమయమునే ఎన్నుకొనినాడు. అతని పరాక్రమప్రదర్శనమున కారంభసమయము కనుక బాలార్కప్రతిముడు. ఆపైన విజృంభణము అధికమైనగాని తీక్ష్ణత్వము ద్యోతమానము గాదు. ఈవిధముగా ఇక్కడ అలంకారము సాభిప్రాయముగా కథాగతాంశమైన పాత్రజన్మరహస్యమును పాత్ర ప్రవర్తనాస్వరూపమును సూచించుచు ప్రసన్నతను కలిగించినది. ఇందు కర్ణుని జన్మరహస్యము సూచితమగుచు వివేచనాత్మకమైన సందర్భముగా నున్నది.

వ. "కర్ణుండును జనుల నందఱ నదల్చి చొత్తెంచి రంగమధ్యంబున నిలిచి కలయం జూచి కృపద్రోణాచార్యులకు నమస్కరించి సజలజలధరధ్వాన గంభీర వచనంబుల నర్జునునాక్షేపించి యిట్లనియె "[1]

సోఽబ్రవీన్మేఘధీరేణ స్వరేణ వదతాంవరః।
భ్రాతా భ్రాతరమజ్ఞాతం సావిత్రః పాకశాసనిమ్॥[2]

జనుల యెదుట ప్రత్యక్షమైనవాడు రంగమధ్యమున నిలిచి కలియజూచి పెద్దలైన వారికి నమస్కరించి సజలజలధరధ్వానగంభీరవచనములతో అర్జునుని ఆక్షేపించినాడు. ఇచట ఆ వచనములు సజల జలధరధ్వానమువలె గంభీరములుగా నున్నట్లు వర్ణింప మేఘధీరేణ స్వరేణ అన్నదానిలో మేఘశబ్దము తెలుగున సజలజలధరమైనది. జలధరము-జలమును ధరించునది. సజలజలధరము అనినప్పుడు జలసహితమైన అనగా పరాక్రమ గురుత్వమును సూచించుచున్నది. అర్జునుని ఆక్షేపించిన మాటలలోని గంభీరారావము పరాక్రమస్ఫోరకమైనది కనుకనే ఆ పలుకులు జనులకు విస్మయమును, సవ్యసాచికి కోపమును, లజ్జయు, దుర్యోధనునకు ప్రీతియు కలుగజేసినవి.

1. ఆది - 6 - 32 2. ఆది - 129-8

కర్ణుని అంతస్సారలక్షణమైన పరాక్రమగురుత్వము ఆక్షేపసంభాషణా చణమైన ఆరావగాంభీర్యమును స్ఫురింపజేసినది. ఇది కర్ణుని మహావ్యక్తిత్వమున కారంభరేఖగా నున్నది. జలధరమువలె తానును (పరాక్రమము) వర్షించుటకు సిద్ధముగా గలదనిన ధ్వని వ్యక్తమగుచున్నది.

క. తన కిమ్మగునంతకు దు, ర్జనుఁ డిష్టుఁడ పోలె నుండి సర్పము పోలెం
దన కిమ్మగుడును గఱచును, ఘనదారుణకర్మగరళఘనదంష్ట్రములన్.[1]

ప్రత్యుత్థానాసనాద్యేన సంప్రదానేన కేనచిత్।
ప్రతిప్రచ్ఛన్నఘాతీ స్యాత్ తీక్ష్ణదంష్ట్ర ఇవోరగః॥[2]

ధృతరాష్ట్రుడు ధర్మజునికి యౌవరాజ్యాభిషేకము గావించెను. పాండవుల వైభవమును సహింపలేని దుర్యోధనుడు కర్ణ, శకుని, దుశ్శాసనులతో మంతనములు సాగించినాడు. రాజనీతి విషయములు తనకు బోధింపుమని యడిగెను. అప్పుడు కణికుడనువాడు సౌబలుని ఆప్తమంత్రి దుర్యోధనునికి మనఃప్రియ మగునట్లును ఇష్టమూనకు తగినట్లును రాజనీతిని బోధించినాడు. సమయమునకై వేచియుండి ప్రతీకారమును తీర్చుకొను విధమును కణికుడు బోధించినాడు కణికుడు నీతులందు "కరము కుశలుడైనవాడు." వ్యక్తుల మనస్తత్వములకు తగినట్లు నీతి నుపదేశించువాడు. దుర్జనుడై , , తగు సమయమువరకు ఇష్టునివలెనే ప్రవర్తించి సర్పమువలె కాటు వేయునని తెలిపెను. ఈ ప్రవర్తనము దుర్యోధనుడు భీమునిపట్ల కావించిన క్రియలు అవి విఫలమైన తీరును సూచించును. తరుణమునకై వేచియున్నవాడు కావుననే దుశ్శాసనాదులతో ప్రతీకారచర్యలకై మంత్రాంగము నడుపుచుండెను ధర్మరాజు యౌవరాజ్యాభిషేకమును తిలకించిన దుర్యోధనుడు వారి వైభవమును తలచియే మనసున అసూయ చెందినాడు అట్టి పరిస్థితులలో తన కర్తవ్యమేమిటో ఎట్టి ప్రతీకారమును తాను చేయవలెనో తెలిసికొనదలచినపుడు కణికుడు బోధించిన నీతిలో దుర్యోధనుడు వహింపవలసిన నీతివిధానమునందు పాత్రగతమనస్తత్వముకూడ ప్రతిబింబితమగుచున్నది.

క. తఱియగునంతకు రిపుఁ దన,
యఱకటఁ బెట్టికొని యుండునది దఱియగుడుం

1. ఆది - 6 - 113 2 ఆది - 137 - 48

జెఱుచునది ఱాతిమీఁదను,
వఱలఁగ మృద్ఘటము నెత్తివైచిన భంగిన్.[1]

వహేదమిత్రం స్కంధేన యావత్కాలస్య పర్యయః।
తతః కాల ఉపాదాయ భిన్ద్యాద్ఘటమివాశ్మని॥[2]

నీతివిధమునకు చెందినదే మరొక ఉదాహరణము, కణికుడొసగెను. తగిన సమయము వచ్చువరకు శత్రువునకు తాను విధేయుడై యుండి సమయము రాగానే మృద్ఘటమును రాతిమీద ఎత్తివైచిన భంగి ఛేదించవలెను. ఇట్టి నీతిని జీర్ణించుకొన్న తరువాతనే దుర్యోధనుడు వారణావతనగరమున లాక్షాగృహనిర్మాణము చేయించినాడు. పాండవులపట్ల తన ప్రయత్నము లన్నియు నిష్ఫలమగుచున్నను దుర్యోధనునకు ప్రతీకారేచ్ఛ విజృంభించినదే కాని తగ్గలేదు. ఇతని దుష్టస్వభావమను అగ్నికి కణికుని రాజనీతి గాలియైనది. ధృతరాష్ట్రుడును పుత్రప్రేమకు లోనై దుష్టవచన ప్రచోదితుడై పాండవులను వారణావతమునకు పంపినాడు. పాండవులను లక్కయింట కాల్పవలెనన్న దుర్యోధనుని ఆలోచనకు ప్రేరణ, మృద్ఘటము రాతిమీద పగులవేసినట్లు శత్రువులను నిర్జించవలెనన్న కణికుని నీతియే. నన్నయ మూలమునందలి భావమునే యథాతథముగా తీర్చినాడనవచ్చును.

ఉ. బాధితశత్రువర్గులగు పాండుకుమారుల దుఃఖవార్త మ
ర్త్యాధములైన సౌబలదినాధిపసూనుల యొద్ద నప్పు దు
ర్యోధనుఁడాదిగాఁగ సుతులున్న సభన్ విని దుఃఖితాత్ముఁడై
యా ధృతరాష్ట్రుఁ డావఱచినట్లఱచెన్ వివిధప్రలాపుఁడై.[3]

శ్రుత్వా తు ధృతరాష్ట్రస్తద్రాజా సుమహదప్రియమ్।
వినాశం పాండవేయానాం విలలాప సుదుఃఖితః॥[4]

పాండవులు లక్కయింట మరణించిరని సభాముఖమున తెలిసిన ధృతరాష్ట్రుడు దుఃఖించినాడు. "విలలాప సుదుఃఖితః" అని మూలము.

దుర్మార్గవర్తనులైన దుర్యోధనాదులపై పుత్రప్రేమవలన ధృతరాష్ట్రుడు వారి చర్యలపట్ల మౌనము వహించినను పాండవులకు జరిగిన ఘోరమైన అన్యాయమునకు

---

1. ఆది - 6 - 115
2. ఆది - 137 - 13
3. ఆది - 6-169
4. ఆది - 144-10

విచలితుడైనాడు. పాండురాజు, ధృతరాష్ట్రులకు గల సఖ్యము వారి పుత్రులకు లేదు. పాండురాజు మరణానంతరము ధృతరాష్ట్రుడు పాండుకుమారులను ఆదరించినాడు. అతనికి వారిపైగల అపారమైన ప్రేమకు నిదర్శనము ధర్మరాజును యౌవరాజ్యాభిషిక్తుని జేయుటయే. దుర్యోధనునిపట్ల పుత్రవ్యామోహము చేత అతని యిష్టానుసారము పాండవులను వారణావత నగరమునకు తరలించెను. అక్కడి గృహనిర్మాణ వైచిత్ర్యము ధృతరాష్ట్రునకు తెలియదు. అది యంతయు దుర్యోధనుని కుతంత్రము. తన యాజ్ఞానుసారము వెడలినవారికి సంభవించిన ఆపదను విన్న ధృతరాష్ట్రుని దుఃఖము సామాన్యమైనది కాదు. బహుదుఃఖితుడై "ఆవఱచినట్లుగా" ప్రలపించినాడు. ఇచ్చట ఆవుతో ధృతరాష్ట్రుని పోలిక ఆతని విచిత్రమైన పరిస్థితిలోని నిస్సహాయత్వము సహజగుణమైన సాధుత్వము వ్యక్తము చేయుచున్నది. హఠాత్సంభవమైన పాండవుల ఆపద్వార్త ధృతరాష్ట్రుని మనమును కలచివేసినది. జాత్యంధుడైన తన నిస్సహాయత్వము, పుత్రుల దుర్మార్గవర్తనము, పాండవుల ధర్మనిరతి ఒక్కుమ్మడిగా మనసునందు ఉల్లోలములై శోకోపహతుని గావించినవి. నన్నయ ఉపమానము ఈ సందర్భమున ధృతరాష్ట్రుని ఆర్ద్రమైన, నిర్మలమైన మనఃప్రవృత్తిని ప్రకాశింపజేయుచున్నది. ఈ ఉపమాలంకారము నన్నయ్య స్వోపజ్ఞకమైనది.

క. కులపాంసనులై యహితం
బులు సేయుచునుండు చుట్టముఁగొండక యి
మ్మల నుండువాఁడ పుణ్యుఁడు
వెలయగ గ్రామస్థితైకవృక్షమ పోలెన్.[1]

జ్ఞాతయో యస్య నైవ స్యుః విషమాః కులపాంసనాః ।
స జీవేత్ సుఖితో లోకే గ్రామద్రుమ ఇవైకజః ॥ [2]

లాక్షాగృహప్రకారమును తెలిసికొన్న పాండవులు దుర్యోధనుని కుటిల ప్రయోగముకన్న ముందుగనే ఆ గృహమును దగ్ధము గావించి రహస్యమార్గమున బయటపడిరి. నడవనోపకయున్న సోదరులను, తల్లిని ఎత్తుకొని భీముడు దక్షిణాభిముఖుడై నిర్జనారణ్యమున ప్రవేశించెను. అందొకచోట పాండవులు విశ్రమించిరి. వటవృక్షము క్రింద నిద్రితులైన తనవారిని చూచి భీముడు ఆత్మగతమున ఈవిధముగా విచారించినాడు. దుర్మార్గవర్తనులైన దుర్యోధనాదులతోడి బాంధవ్యమును నిందించు

1. ఆది 6 - 182 2. ఆది. 146-28

కొనినాడు. అపకారము చేయు జ్ఞాతులకు దూరముగా ఒంటరిగా నుండువాడు పుణ్యుడు. గ్రామమునందున్న ఒకేవృక్షము ఎట్లు జనులచేత ఆదరింపబడునో అట్లు ఆతడు గౌరవభాజనుడగును.[1] ఇట్టి యభిప్రాయము భీమునికి కలుగుటకు కారణము అప్పటి వరకు తాము కౌరవులవల్ల పడిన దురవస్థయే. అహితులైన చుట్టములను పొందక ఎడముగా నున్నప్పుడు పొందు మానసికమైన శాంతికి ప్రాధాన్య మొసగబడినది. ఈ యలంకారమునందు మనస్తత్వగతమై, ప్రకృతిరూప మాధారముగా లోకప్రవృత్తి చిత్రితమైనది.

క. పరహిత*ఫలవంతులు సు
స్థిరమూలాస్వతు లపాపధీరతులు పర
స్పరసంశ్రయమున జీవిం
తురు మనుజులు వనములోని ద్రుమములపోలెన్.[2]

బలవంతస్సమృద్ధార్థా మిత్రబాంధవనందనాః ।
జీవంత్యన్యోన్య మాశ్రిత్య ద్రుమాః కాననజా ఇవ ॥[3]

పై పద్యము తరువాతిదే ఈ పద్యము, ఇందు అన్యోన్య సహాయశీలురైన వ్యక్తుల సుఖజీవనము వివరింపబడినది. పరులకు మేలుచేయు ధనము లేదా బలము కలవారు మిక్కిలి స్థిరమైన మూలము (వేరు) తో కూడియున్నవారు. పాపబుద్ధియం దాసక్తి లేనివారు. వనములోని వృక్షములవలె పరస్పరాశ్రయముచేత అన్యోన్యము స్నేహసహకారభావముచేత సుఖముగా జీవింతురని భీముని యభిప్రాయము. ఇతడు ప్రకృతము వనములో నున్నవాడు.[4] దుర్యోధనాదులతో కూడియున్న ఊరుకన్న, వారు లేని వనమే శ్రేయస్కరముగా కనిపించినది. ఎదురుగా వృక్షముల శ్రేణి కనిపించినది. అవి ఎంతయో సుఖముగా నున్నవన్న భావము ప్రచలితమైనది. కారణము తన మనస్సే. వనములోని ద్రుమములు నిర్భయముగా ఒకదానిశాఖలు మరొక దానిపై ప్రాలి గుంపుగా ఒకచోటనుండు సుమనోమూర్తులవలె భాసింపజేయుటలో భీముని మనస్తత్వము తత్కాలమందు పొందియున్న శాంతస్థితి వ్యజ్యమానమగుచున్నది.

---

1. గ్రామవృక్షములు - వేప, చింత, కానుగ, రావి మొదలగునవి.
   గృహవృక్షములు - గన్నేరు, దానిమ్మ, జామ మొదలగునవి.

* బల (పాఠాంతరము)

2. ఆది- 6 - 183 3. ఆది - 146 - 31

4. ఆరణ్యక వృక్షములు-టేకు, మద్ది, చంద్ర మొదలగునని.

ఈ రెండు పద్యములు ఇంచుమించు సంస్కృత శ్లోకభావమునే అనుసరించినవి. తెలుగులోని 'మూల'శబ్దమునకు వంశము, కుదురు, వేరు అన్న అర్థములచే భావమునకు ప్రసన్నత చేకూరినది.

క. వడముడి యారక్కసు న
యెడ కష్టధనుః ప్రమాణ మెడ గలుగంగ నె
వ్వడి నీడ్చె నల్పమృగమును
విడువక గజవైరి యీడ్చువిధమున బెలుచన్. 1

నిగృహ్య తం బలాద్భీమో విస్ఫురంతం చకర్ష హ ।
తస్మాద్దేశాద్ధనూంష్యష్టౌ సింహః క్షుద్రమృగం యథా ॥2

లక్కయింటినుండి తప్పించుకొనివచ్చి అరణ్యమున విశ్రమించుచున్న పాండవులను హిడింబుడను అసురుడు చూచినాడు. ఆ యరణ్యము హిడింబాసురుని అధీనము నందున్నది. తన సోదరియైన హిడింబను — పాండవులను ఆహారముగా గొని తెమ్మని పంపించెను. భీముని సౌందర్యమునకు ఆకర్షితురాలైన హిడింబ వచ్చినపని మరచి కామరూపధారిణియై వారివద్ద నిలచినది. హిడింబ ఆలస్యమునకు కోపించిన రాక్షసుడు క్రోధానలజ్వలితచిత్తుడయి పాండవుల సమీపమునకు వచ్చెను. భీముడు తప్ప తక్కినవారు నిద్రాపరవశులయి యుండిరి. హిడింబాసురుడు భీమునితో తలపడినాడు. సుఖనిద్రానిరతాత్మకులయిన తనవారికి భంగము కలుగకుండ భీముడా రాక్షసుని, ఆ ప్రదేశమునుండి తొలగద్రోసికొని పోయెను. అంతటి రాక్షసుని ఆర్భాటము భీముని ఎదుట కొరగానిదైనది. అల్పమృగమును సింహము ఈడ్చు విధముగా హిడింబాసురుని భీముడు వడిగా నీడ్చివేసెను. భారతమున రాక్షససంహార మంతయు దాదాపు భీముని వలననే జరిగినది. అట్టి పరాక్రమవంతుని యెడ యుద్ధ సమయమున నన్నయ ప్రయోగించిన ఉపమలు విలక్షణమైనవి. రాక్షసుని రాక ఎంత ఉద్ధతముగా నున్నను మహాపరాక్రమోపేతుడైన భీమునికి లెక్కలోనిది కాదు. సింహము వంటి భీముని ముందు హిడింబుడు అల్పమృగమైనాడు. మూలమునందలి "క్షుద్ర", శబ్దమునకు తెలుగునందు "అల్ప"శబ్దము ప్రయుక్తమైనది. ఇది అర్థాంతరమునం దించుక భేదము కలిగించుచున్నది. క్షుద్రమనగా "క్షుదాంతి కుటుంబం పీడయతీతి క్షుద్రః"3 కుటుంబమును పీడించువాడు క్షుద్రుడు. పాండవకుటుంబమును

1. ఆది - 6—208
2. ఆది - 149-19
3. గురుబాలప్రబోధిక - పుట 655

పీడించుటకై వచ్చినవాడు కావున మూలమునందలి హిడింబునకు వేసిన విశేషణము యుక్తముగా నున్నది. "అల్యతే వార్యత ఇత్యల్పః"1 పెద్ద వస్తువులనుండి వారింప బడునది అనగా తొలగింపబడునది అల్పము. ఇక్కడ మహనీయులైన ధర్మ రాజాదులనుండి తొలగింపబడువాడు, సత్త్వరహితుడన్న భావమును స్ఫురింపజేయుచు భీముని గురుత్వమును స్థాపించుచున్నది. కథాంశము పాత్రగతముగా సముచితత్వము కలిగించుచున్నది. అలంకారము అర్థాంతరమును భావింపజేయుచున్నది.

చ. చరణహతిన్ మహాతరులు సాల్పడి జర్జరితంబులై మహిం
దొరఁగఁగ నిట్టు లొండొరులతోడ మదోద్ధతషష్టిహాయన
ద్విరదములట్లు ఘోరరణవీరులు సేసిరి మల్లయుద్ధ ముద్ధుర
బలులై సమీరణసుతుండు హిడింబుఁడు దద్వనంబునన్ 2

బభంజతుర్మహావృక్షాన్ లతాశ్చ విచకర్షతుః ।
ప్రమత్తావివ సంక్రుద్ధౌ మాతంగౌ షష్టిహాయనౌ ॥ 3

అల్పమృగమును ఈడ్చివేసినట్లు అన్నప్పుడే రాక్షసుని బలపరాక్రమములు, భీముని సామర్థ్యము సూచితమైనవి. ఐనను సంహారము జరుగునంతవరకు ఇరువురి సమత్వము దృగ్గోచర మగునట్టివిధముగా వర్ణితమైనది. వారి మల్లయుద్ధము షష్టి హాయనద్విరదములు పోరినట్లుగా సాగినది. అరువది సంవత్సరముల ప్రాయము కలిగిన మదోద్ధత గజములవలె భీమసేన హిడింబులు కలరు. వయః పరిమితి వారి ప్రౌఢత్వమునకు నిదర్శనముగా గ్రహింపవచ్చును. మూలభావమున కీపద్యము వారి యుద్ధస్వరూపముతోపాటు తత్ప్రభావమును వర్ణించుటతో పెరిగి దృశ్యరూపమును పొందినది.

వ. ధౌమ్యుండును వారి నతిప్రీతిం బూజించి పురోహితత్వంబుం బరిగ్రహించె నట్లు తేజోరూపబుద్ధివిభవంబుల బృహస్పతిసదృశుండై వేదవేదాంగ విదుండైన ధౌమ్యుం బురోహితుంగాఁ బడసి పాండునందను లశేష మహీరాజ్యంబు వడసినంతియ సంతసిల్లి తత్కృత స్వస్త్యయనులయి....4

1. గురుబాలప్రబోధిక-పుట 663
2. ఆది - 6-210
3. ఆది - 149-23
4. ఆది. 7-159

తేజసా చైవ బుద్ధ్యా చ రూపేణ యశసా శ్రియా।
మంత్రైశ్చ వివిధైర్ధౌమ్యస్తుల్య ఆసీద్బృహస్పతేః॥
తేన ధర్మవిదా పార్థా యాజ్యాస్సర్వవిదా పురా।
మేనిరే సహితా వీరాః ప్రాప్తం రాజ్యం స్వధర్మతః॥ 1

గంధర్వుడైన అంగారపర్ణుని నిర్దేశమువలన పాండవులు తమకు పురోహితునిగా ధౌమ్యుని వరియించిరి. జగదేకవీరులైన పాండవులకు పౌరోహిత్యము వహించువాడు తేజము, వాక్కు, రూపము, బుద్ధివైభవములలో విశిష్టుడై యుండవలెను. ధౌమ్యుడు బృహస్పతిసము డనుటలో పాండవుల దేవతాసదృశస్థితి సూచితము. ప్రతిభాశాలి కనుకనే ఈతని పౌరోహిత్యము మాత్రముననే పాండవులకు అశేషమహీరాజ్యము బడసినంత సంతోషము కలిగినది.

"మహాత్ములయిన పురోహితులం బడసిన రాజుల కభీష్టంబులయిన శుభంబు లగుట నిశ్చయంబ" (1-7-88) అని అంగారపర్ణుడు అర్జునునకు తన ప్రస్తావనారంభముననే తెలిపినాడు. మహాత్ముడైన ధౌమ్యుని పౌరోహిత్యమువలన పాండవుల అభీష్టము నెరవేరు సూచన మూలముతో సమానమైన ఈ యలంకారమునందు కలదు.

క. కృష్ణమృగాజినధరుఁ దరు
ణోష్ణద్యుతితేజుఁ బంకజోద్భవ సదృశుం
గృష్ణద్వైపాయను గత
తృష్ణామయుఁ గాంచి రరుగుదెంచు మహాత్మున్.2

ద్రుపదు పురమునకు పయనించు పాండవులు ఎదురైన కృష్ణమృగాజినధరుడు, తరుణోష్ణద్యుతితేజుడు, పంకజోద్భవసదృశుడునైన కృష్ణద్వైపాయనుని చూచిరి.

భారతకథావిర్భూతికి మూలమైన వ్యాసుడు పంకజోద్భవ సదృశుడు. కనుకనే పాండవుల నాశీర్వదించి ఆగామిశుభములు తెలియజేసినాడు. ఈ లక్షణము పంకజోద్భవసదృశునకు గాని, అన్యులకు సాధ్యము కానిది. ద్రుపదు పురసందర్శనము పాండవులకు కల్యాణదాయకము కాబోవుచున్నది. అది ఆగామి శుభము. పాండవులు మహిమాన్వితులు. అప్పుడే బృహస్పతిసదృశుడయిన ధౌమ్యుని పురోహితునిగా వరియించినారు. ఇట్టివారికి కృష్ణద్వైపాయనుడు రాబోవు విశేషములను తెలియ

1. ఆది. 180-11, 12   2. ఆది. 7-164

జేసినాడు. పాండవుల అమరసన్నిభత్వముతోపాటు వ్యాసుని అజలక్షణముచేత శుభోదర్కముగా పరిణమించు అదృష్టరేఖ ఈ యలంకారమునందు అంతర్గతమై వెలుగుచున్నది.

చ. అవిరళభస్మమధ్యమున నగ్నికణంబులపోలె బ్రాహ్మణ
ప్రవరులలోన నేర్పడక పాండవులేవురు నున్నఁ జూచి యా
దవవృషభుండు కృష్ణుఁడు ముదంబున వారి నెఱింగి పార్థుఁడీ
యువతిఁ బరిగ్రహించుననియుం దలఁచెన్ హృదయంబు లోపలన్.[1]

స్వయంవరసభామండపమున బ్రాహ్మణవేషముననున్న పాండవు లాసీనులై యుండిరి. వీరును, బ్రాహ్మణసమూహమందే యుండిరి. మహీతలంబున గల రాజనందనులు స్వయంవరమున కాహూతులై వచ్చిరి. అవిరళభస్మమధ్యమున అగ్నికణంబులవలె బ్రాహ్మణప్రవరులలో పాండవు లేర్పరుపరాక యుండిరి. అట్టి వారిని భగవానుడైన కృష్ణుడు మాత్రము గుర్తించినాడు. ఇచ్చట భస్మసాదృశ్యమును రెండు రకములుగా చెప్పవచ్చును. భస్మము పవిత్రమైనది. ధరించుట కుపయుక్త మైనది. భస్మముతో బ్రాహ్మణులకు - అగ్నికణములతో పాండవులకు పోలిక చెప్పబడినది. భస్మము - సత్త్వగుణము శాంతస్వభావమును; అగ్నికణములు - రజోగుణము, వీరభావమును సూచించుచు బ్రాహ్మణ క్షత్రియ స్వరూపమునకు నెలవైనవి. శౌర్యప్రదర్శనము సాధారణముగా క్షత్రియోచితమైనది. బ్రాహ్మణ సమూహము నుండి అర్జునుడు మత్స్యయంత్రభేదనమునకై వెడలునప్పు డతనిని బ్రాహ్మణప్రవరుడనియే అందరు తలంచిరి. అర్జునుడు వేషధారణచేతనే బ్రాహ్మణుడు. కృష్ణుడు మాత్రము చూడగనే గ్రహించినాడు. సాత్త్వికులైన బ్రాహ్మణుల మధ్యమున రజోమూర్తులైన పాండవులున్నారు. భగవానునికి మాత్రమా విషయము విదితమైనవి. ఇచట నన్నయ స్వతంత్రముగా భగవల్లక్షణముతోపాటు సత్త్వరజోగుణాత్మకమైన శాంతవీర భావములను స్ఫురింపజేసి కథాసంవిధానమునకు వైశిష్ట్యము చేకూర్చినాడు.

క. తమ్ముల యట్టుల తనకు వ
శమ్మయి ధర్మువును ధృతియు సత్యముఁ గారు
ణ్యమ్మును నొప్పుగఁ జేర్మి ని
జమ్ముగ మను ధర్మజున కసాధ్యము గలదే[2]

---

1. 1-7-174 2. ఆది. 8-48

యస్మిన్ ధృతిరనుక్రోశః క్షమా సత్యం పరాక్రమః ।
నిత్యాని పాండవే జ్యేష్ఠే స జయీ న కథం రణే ॥ [1]

లాక్షాగృహవృత్తాంతానంతరము పాండవులకు లభించిన వైభవమును గూర్చి విని దుర్యోధనుడు చింతాక్రాంతుడై కర్ణదుశ్శాసనాదులతో మరల ప్రతిక్రియ నాలోచించు చుండెను. విదురాదిప్రముఖులు పాండవాభ్యుదయమును విని సంతోషించిరి. ధృతరాష్ట్రునితో తన మనోగతాభిప్రాయమును దుర్యోధనుడు తెలియజేయగనే ఆతడు భీష్మద్రోణవిదురకృపాదుల రావించెను. వారు దుర్యోధనునకు పాండవుల బల పరాక్రమాదుల నెరిగించి బుద్ధి గరపుటకు ప్రయత్నించిరి. వీరి హితవును లెక్క-చేయక కర్ణుడు దుర్యోధనుని ప్రోత్సహింపగా వీరందరిని వారించి విదురుడు ధృత రాష్ట్రునితో పాండవుల మహిమనుగూర్చి చెప్పినాడు. ధర్మరాజాదుల పరాక్రమమును వివరించి - తమ్ములవలెనే ధర్మమును, ధృతి. సత్యము, కారుణ్యము ధర్మజుని వశమై యున్నవని తెలిపెను. అట్టివానికి అసాధ్యమన్నది లేదు.

"ధర్మస్వరూపుడు, ధర్మస్వభావుడు, ధర్మాచరణముననే బ్రతుకంతయు గడిపినవాడు, తుదకు ధర్మము తోడు రాగా బొందితో స్వర్గమునకు పురోగమించిన వాడు, ధర్మదేవత అంశావతారము ఐన ధర్మరాజు భారతమున నాయకుడు."[2]

భీమార్జునులు, నకులసహదేవులు ధర్మరాజు ఆజ్ఞానువర్తులై ప్రవర్తించువారు. ఇది భౌతికవర్ణనము. ఆంతరముగా ధర్మజునకు అనుజులవలెనే ధర్మము, ధృతి సత్యము, కారుణ్యములు వశమైయున్నవి. కనుకనే భారతకథకు నాయకు డనిపించు కొనినాడు. ధర్మజుడు సర్వసద్గుణసంపూర్ణుడు.

మూలమునందలి ధృతి, అనుక్రోశము, సత్యము తెలుగునందు ధృతి, కారుణ్యము, సత్యములుగా స్వీకృతమైనవి. తెలుగునందు పాండవజ్యేష్ఠగతమైన ధర్మలక్షణము మొదట ఉట్టంకితమైనది. మూలమునందలి "క్షమ" తెలుగున "ధృతి" యందు, మూలమునందలి పరాక్రమము తెలుగున "అసాధ్యము కలదే" యన్న మాటలలో అంతర్భూతములైనట్లు భావించవలెను. ఈ నవరణపల్ల నాలుగు గుణములు నలుగురు తమ్ములకు సరిపోవునట్లుగా చేసి అలంకారమునకు సమగ్రత చేకూర్చుటయే నన్నయ అభిమతమై యుండును.

---

1. ఆది. 196-46  2. మన సంస్కృతి - సాహితి, — డా. జోగారావు, యస్వీ.

వ. ఇట్టి ఇంద్రప్రస్థపురంబున నింద్రవిలాసంబుతో వ్యాసవాసుదేవానుమతుండై ధర్మతనయుండు ధౌమ్యపురస్సరమహీసురప్రవరవేదఘోషంబులు సకల జనాశీర్వాదనాదంబులు మృదుమధురమంగళ సంగీతరవంబులు వివిధ తూర్యధ్వనులు నతిసమృద్ధంబులై యెసంగ వర్గచతుష్టయంబునుం బోని యనుజవర్గంబుతో శుభముహూర్తంబునం బురప్రవేశంబు సేసి సర్వప్రకృతి జనానురాగకరుండయి.[1]

భ్రాతృభిస్సహితో రాజన్ కేశవేన సహాభిభూః ।
తోరణద్వారసుముఖం ద్వాత్రింశద్ద్వారసంయుతమ్ ॥[2]

ధృతరాష్ట్రుడు పాండవులకర్ధరాజ్య మిచ్చి ధర్మజుని అభిషిక్తుని జేసెను. ఇంద్రప్రేరితుడైన విశ్వకర్మ ఖాండవప్రస్థ నివాసమున ఇంద్రప్రస్థపురమును నిర్మించెను. ధర్మజుడు భ్రాతృపురోహితసహితుడై పురప్రవేశము గావించెను. ఆవైభవమును వర్ణించునపుడు — ధర్మతనయుడు ఇంద్రవిలాసముతో ధౌమ్యపురస్సర మహీసురప్రవరవేదఘోషములతో "వర్గచతుష్టయంబునుం బోని యనుజవర్గంబుతో" పురప్రవేశము గావించినట్లు వ్రాసెను. పాండవులకు ఇంద్రునివల్లనే ఇంద్రప్రస్థ పురము నిర్మింపబడినది. అందు ఇంద్రవిలాసముతో ధర్మజుని ప్రవేశింపజేసి నన్నయ మూలమునందలి భావమును పెంపుజేసినా డనవచ్చును. బృహస్పతిసముడైన ధౌమ్యుని పౌరోహిత్యము, ధర్మజునికి, ఇంద్ర విలాసము ఒకదానికొకటి పోషకములు. మహాత్ములయిన పురోహితుల బడసినవారికి అభీష్టసిద్ధియగునన్న పూర్వపుమాట ధర్మజునిపట్ల అన్వర్థమైనది. వర్గచతుష్టయమనగా ధర్మార్థకామమోక్షములు[3]. ఈ పురుషార్థముల వలె సోదరులు ధర్మజు ననుసరించినా రనుటలో ధర్మజుని జీవితము పొందిన సమగ్రత్వము, ధన్యత్వము సూచితమైనవి. స్వర్గారోహణము వరకు మిగిలిన వాడు ఒక్క ధర్మరాజే. కావున ఈ యలంకారప్రయోగము ధర్మజుని విజయమునకు సూచకముగా నున్నది.

క. ఈహితవిధానముల లో
కాహితదుస్సహనతేజుడయి వాడు మహో
త్సాహముతో వర్ధిల్లె ఘృ
తాహుతులం బ్రవృద్ధి నొందు నగ్నియపోలెన్.[4]

---

1. ఆది. 8-80 2. ఆది. 198-86

3. త్రివర్గో ధర్మకామార్థై శ్చతుర్వర్గః సమోక్షకైః — గురుబాలప్రబోధిక - పుట 467

4. సభా - 1-155

సోఽవర్ధత మహాతేజా మాగధాధిపతేస్సుతః ।
ప్రమాణబలసంపన్నో హుతాహుతి రివానలః ॥[1]

చండకౌశికుని ప్రసాదమున బృహద్రథుని ఇరువురు భార్యలకు రెండు మనుజశకలము లుదయించినవి. వానిని చూచి వెరచి వారు ఆవల పారవేయగా జరయను రాక్షసి వాని నొకటిగా సంధించినది. జరచేత సంధింపబడినవాడు జరాసంధుడై బృహద్రథున కొసగబడినాడు. అట్టివానిని బృహద్రథుడు గారాబముగా పెంచుచుండెను. "ఈహిత-విధానముల లోకాహిత దుస్సహతేజుడయి, ఘృతాహుతుల, ప్రవృద్ధినొందు అగ్నియ పోలెన్" వాడు మహోత్సాహముతో వర్ధిల్లినాడు. మూలమున కీభావము సమానముగా నున్నది. ఘృతాహుతుల ప్రవృద్ధి నొందు అగ్నివలె జరాసంధుడు కలడు. కాని వాని అభివృద్ధి ఘృతాహుతిచే వెలుగు అగ్ని పైగల పవిత్రభావమును స్ఫురింపజేయుట లేదు. కారణము లోకాహితదుస్సహతేజుడన్న నన్నయ వ్యంగ్యప్రయోగము. ఈహితవిధానములు వానిని గారాబముగా పెంచిన విధానమును బట్టి ఏర్పడినవి. అట్టి ప్రవర్తనవలన-లోకాహితదుస్సహతేజుడయినాడు, కాని హృదయానందకరముగాగాని, పవిత్ర భావమును స్ఫురింపజేయగలవాడుగా గాని గోచరించుటలేదు. ఈ భావము మూలమునకు కొద్దిగా పెంపుదలయే. ఇక్కడినుండియే నన్నయ జరాసంధుని పాత్ర చిత్రణమును స్ఫురింపజేసినాడు. లోకాహితదుస్సహతేజుడనగానే అట్టివాని స్వభావమును క్రియాస్వరూపమును గురించి పాఠకుల దృష్టిపథమున ఒక నిశ్చితాభిప్రాయమును నన్నయ ఏర్పరచినాడు. పవిత్రకార్యమున కుపయోగపడెడు అగ్ని, తన దీప్తిని ఈహితవిధానముల ప్రజ్వరిల్ల జేసినచో అది దుస్సహమే అగును. అవిరళ జపహోమ తత్పరునికి అగ్ని మితముగా జ్వలించుటే అభిమతమై యున్నది.

చ. అతులబలుల్ పరస్పరజయార్థులు పార్థివపుంగవుల్ మరు
త్సుతమగధేశ్వరుల్ సమరశూరులు దారుణలీలఁ బోరి రూ
ర్జితభుజదర్ప మేర్పడఁగ సింహగజేంద్రములట్లు వజ్రప
ర్వతముల యట్లు ఘోరతరవాసవవృత్రుల యట్లు నిద్దఱున్.[2]

తయోరథ భుజాఘాతాన్నిగ్రహప్రగ్రహాత్ తథా ।
ఆసీత్ సుభీమసన్నాదో వజ్రపర్వతయోరివ ॥
శిరోభిరివ తౌ మేషౌ వృక్షైరివ నిశాచరౌ ।
బలినోస్సంయుగే రాజన్ వృత్రవాసవయో రివ ॥[3]

1. సభా - 20-8 2. సభాపర్వము-1 ఆ-206 3 సభా - 22-51, 53, 54

కృష్ణభీమార్జునులు జరాసంధునితో తలపడుటకై మగధదేశమునకు వచ్చిరి. ఈముగ్గురితో యుద్ధమునకు జరాసంధుడు సమ్మతించినను కృష్ణుడు ఒక్కనితోడ పోరుటే ఉచితమని తెలిపెను. జరాసంధుడు వారిలో భీముని యుద్ధమున కాహ్వానించెను. అవ్యాయామకర్కశస్థిరకాయుల యుద్ధము భయంకరముగా సాగినది. ఆసమయమున వారి పరస్పరయుద్ధసంరంభము సింహగజేంద్రములవలె, వజ్రపర్వతములవలె, వాసవవృత్రులవలె సాగినది. ఇందలి మూడుపమానములు ఫలితమును సువ్యక్త మొనర్చుచున్నవి. ఇరువురిని సమానముగా అలంకారమునందు ప్రదర్శించినను ఉపమానములందు క్రమముగా శక్తి స్వరూపము - పర్యవసానము - సూచితమైనది. "శిరోభిరివ తౌ మేషౌ వృషైరివ నిశాచరౌ పదై రివ శుభావశ్వౌ"-ఆదిగాగల, మూలము నందలి ఉపమానములను నన్నయ్య ప్రయోగింపలేదు. పరాక్రమ ప్రదర్శనమునకేవి ముఖ్యము లనుకొనినాడో అట్టివానిని మాత్రమే ప్రయోగించినాడు. భీమసేన జరాసంధులు-అతులబలులు, పరస్పర జయార్థులు, పార్థివపుంగవులు. అయినను సింహ గజేంద్రములు, వజ్రపర్వతములు, వాసవవృత్రు లనుటలో జయమెవరికి సిద్ధించునో సువిదితమగుచున్నది. ఇక్కడ మాలోపమాలంకారమునందీభావము సుశోభితమైనది.

"వరుసగా యుద్ధక్రమమున సింహగజేంద్రముల పాశవికబలము, వజ్రపర్వత ముల జయార్థిత్వము, వాసవవృత్రుల చైతన్యప్రాభవత్వములు వ్యక్తమగుచున్నవి."1

సింహమునందు విపాటన లక్షణము, వజ్రమునందు ఖండనగుణము, వాసవుని యందు విజయశీలము, సహజములు. వీనిచేతనే గజేంద్రవినాశము, పర్వత గర్వభంగము, వృత్రాసురుని మరణము జరిగినది. కావున యుద్ధపర్యవసానము స్ఫురింపజేయుచు నన్నయ పద్యరచనాశిల్పము మూలభావమునకు ఆహవవాతావరణము కల్పించుచు ఉపమాలంకారమునకు దీప్తి చేకూర్చుచున్నది.

క. బ్రహ్మవిదులయిన నిఖిల
బ్రాహ్మణ సత్తములచేతఁ బరివేష్టితుఁడై
బ్రహ్మణ్యుఁ డొప్పెఁ గురుపతి
బ్రహ్మర్షిపరీతుఁడయిన బ్రహ్మయ పోలెన్. 2

---

1. ఉపమా నన్నపార్యస్య-(వ్యాసము)-రఘునాథశర్మ, శలాక.
(S. V. U. P. G. Centre Journal - 1970)

2. సభా - 1 ఆ - 291

పై పద్యము తరువాత పద్యమిది; నన్నయోపజ్ఞకమైనది. బ్రహ్మాదిదులయిన బ్రాహ్మణసత్తములచేత పరివేష్టితుడైన కురుపతి బ్రహ్మర్షి. ధర్మజుడు బ్రహ్మవలె భాసించి సృష్టికర్త స్థానము వహించుటలో ఔచిత్యము కలదు. సృష్టికి కర్తృత్వము వహించువాడు బ్రహ్మదేవుడు యాగమునకు కర్తృత్వము వహించినవాడు ధర్మజుడు. పాండురాజు మాటలను నారదుడు ధర్మజునికి వివరించునపుడు రాజసూయము చేసినయెడల పితృపితామహులకు సద్గతులు కలుగునని, యాగము నిర్విఘ్నముగ సమాప్తమైనచో నిఖిలప్రజాప్రళయకారణమైన రణమగునని తెలిపెను.[1]

ధర్మజుని రాజసూయము తరువాత సంభవించిన ప్రజాప్రళయము కురుపాండవుల ఘోరరణము. ఈ యాగనిర్విఘ్నపరిసమాప్తి ధర్మజుడు "బ్రహ్మ" వలె భావితుడగుటలో సూచితము. ధర్మజుడు బ్రహ్మర్షులచేత పరివృతుడైన బ్రహ్మవలె వెలుగొందెను. ధర్మజునిలో నిహితమైన సత్వగుణమునకే ఉపమానము ప్రాతినిధ్యము వహించుచున్నది బ్రహ్మ సత్వగుణమునకు నిధానముగా రజోగుణముచేత క్రియాకలనసృష్టి కుద్యమించును. ఇక్కడ ధర్మజుని ఆత్మగతమైన సత్త్వము క్షత్రియకర్మగతమైన రజోగుణము బ్రహ్మశబ్దముచేత ధ్వనితమగుచున్నవి. ఈ యలంకారము నందు అంతస్తత్త్వము బహిస్తత్త్వము రెండింటి సమ్మేళనముచేత రూపొందిన ధర్మజుని వ్యక్తిత్వము చిత్రితమైనది లేనిచో ఇంతటి ఉపమానము వేయుటలో ప్రయోజనము లేదు. వేదాభ్యాసి, అవిరళజపహోమతత్పరుడు నైన నన్నయ ఆలోచన దేవతాత్మకముగా ఋషిపరముగా భాసించుట సహజము

క. చనఁ జేఁకికి దారక్రియ
యును జెవిటికి మధురగీతియును జీకున క
న్యనుపమసురూపదర్శన
మును జేయుటఁ బోలుఁ గృష్ణుఁ బూజించుటిలన్ [2]

క్లీబే దారక్రియా యాద్వ గంధే వా రూపదర్శనమ్ ।
అరాజ్ఞో రాజవత్ పూజా తథా తే మధుసూదన ॥[3]

రాజసూయ యాగానంతరము సభాముఖమున ధర్మజు డొక్కని పూజింప దలచెను. ఆయొకడు అఖిలలోకపూజ్యుడైన కృష్ణుడని, అర్ఘ్యమునకు పాత్రుడని

1. సభా - 1 - 93 2. సభా - 2 ఆ - 14
3. సభా - 32-37

అడియే యజ్ఞఫలమని భీష్ముడు ధర్మజునితో పలికెను. సహదేవోపనీతమయిన అర్ఘ్యమును శాస్త్రదృష్టవిధానమున ధర్మజుడు వాసుదేవున కొసగెను. అది చూచి సహింపని శిశుపాలుడు కృష్ణు నాక్షేపించుచు నిందోక్తులు పలికెను. పేడికి దారవలె, చెవిటివానికి మధురగీతివలె, గ్రుడ్డివానికి సురూపదర్శనమువలె కృష్ణుని పూజించుట కలదని యాక్షేపించెను. మూలమునందలి మాలోపమను నన్నయ యథాతథముగా ననుసరించుచునే "చెవిటికి మధురగీతియును" అని మరొక సాదృశ్యమును క్రొత్తగా చేర్చెను. ఈ యుపమాలంకారమునందు భాసించిన వ్యంగ్యముతీరు గమనార్హము. సభాముఖమందున్న సర్వులకు కృష్ణు డెట్టివాడో తెలియును. శిశుపాలునికిని తెలియును. పాండవుల శక్తిసామర్థ్యములు తెలిసినను కౌరవులు వారికొనర్చు దుర్నయము లెట్టివో శిశుపాలుడును కృష్ణుని పరిపూర్ణత్వము తెలిసియు చేసిన నిందాలాపము లట్టివే. శిశుపాలునికి తన మరణము కృష్ణునివలననే సంభవించునని తెలియును. శిశుపాలుని తల్లి సాత్వతికి ఇతడొనరించు అపరాధశతమును మన్నించునట్లు కృష్ణుడు వరమొసగెను. జన్మతోనే వికృతాకృతి కలిగిన శిశుపాలుడు కృష్ణుని స్పర్శవలన సహజాకృతిని పొందినాడు. ఆ హేతువు శిశుపాలుని మృతి కాధారము. ఈసభాముఖమున శిశుపాలుని విజృంభణము మృత్యుముఖమును సమీపించుటకే. అనాదినిధనుడు, అబ్జనాభుడు, సత్సేవ్యుడైన పరమాత్ముని ఎఱుక మహాయోగులకు తప్ప అన్యులకు సాధ్యము కాదు. శిశుపాలుడు కృష్ణుని నిందించిన మాటలలో ఆతని యజ్ఞానము విస్పష్టముగా భాసించుచు అతనికే అన్వయించినట్లున్నది. ఉపమాలంకారధ్వని దుర్భావోపేతమైన శిశుపాలుని చిత్తవృత్తిని ఎత్తి చూపుచున్నది. కృష్ణుని కరస్పర్శచేత శరీరము వికృతరూపమును బాసినను మనోరూపమునందు మార్పులేదు. దీని విజృంభణముయొక్క విపరీతమైన పరాకాష్ఠదశను చిత్రించుటయే ఈ సన్నివేశ పరమార్థము మూలమునను సరించి దాని తీరులోనే సాగిన స్వతంత్రమైన మాలోపమాలంకారమునందు దీని అవగతి స్పష్టము. భగవత్పరమైన హితోక్తులన్నియు శిశుపాలునిపట్ల చెవిటికి మధురగీతి చందమైనవి.

క. కందుగల పసిండి గాంచినఁ
గంది వివర్ణమయినట్లు కౌరవు కాయం
బొందఁగ వివర్ణమయి కడు
వందె మనస్తాపహవ్యవహదాహమునన్.1

మహిమానం పరం చాపి దృష్ట్వా తేషాం యశస్వినామ్ ।
దుర్యోధనః పాపబుద్ధిః పర్యతప్యత మన్యునా ॥2

1. సభా - 2-89

2. సభా - 50 అధ్యాయము 15శ్లోకము.

రాజసూయము సమాప్తియైన తరువాత నానాదేశాగతులును, కృష్ణుడును పాండవులను వీడ్కొని వెడలిపోయిరి. దుర్యోధనుడును, శకునియు సభావిభవము చూచుట కపట కొన్ని దినము లుండిరి. ఒకనాడు దుర్యోధనుడు మయసభావిశేషములను చూచుచు దాని అపూర్వరామణీయకమున కచ్చెరువందుచు ఆయా ప్రదేశములందు తిరుగువాడు నీలాశ్మస్థగితమైనదానిని జలాశయమని పరిధాన మెగద్రోసికొనియు స్ఫటికదీప్తిజాలపరివృతమైన జలాశయమును నిర్జలస్థలమనుకొని కట్టిన పుట్టము తడియగా అందు ప్రవేశించినాడు. అట్టివానిని జూచి పాంచాలియు పాండు కుమారులును నవ్విరి ధర్మతనయుడు వానికి భీమునిచేత దివ్యవస్త్రాభరణము లిప్పించెను. తరువాత దుర్యోధనుడు పాండవుల వీడ్కొని హస్తినాపురికి వచ్చెను. ధర్మజుని రాజసూయమును తత్సభావైభవమును దుర్యోధనునకు సహింపరానివైనవి. వారి వైభవమును తలచినకొలది అతని మనస్తాపమనెడి అగ్ని అతనిని దహింపసాగినది. తాను ప్రత్యక్షముగా వారి వైభవమును చూచివచ్చినాడు. అది మరింత తాపకారణ మైనది. కందుగల పసిడి గాచిన కంది వివర్ణమయినట్లు దుర్యోధనుని మనస్తాపాగ్ని వలన శరీరము వివర్ణమయినది. మూలమున "దుర్యోధనః పాపబుద్ధిః పర్యతప్యత మన్యునా" అని మాత్రము కలదు. నన్నయ దుర్యోధనుని స్వభావమును స్పష్టముగా ఆలంకారికముగా చెప్పినాడు. పాపబుద్ధి కలిగినవాడు ఈర్ష్యవలన పరితపించువాడే యైనను ఆ యీర్ష్య దుర్యోధనుని మనసున ఎట్టి సంచలనము కలిగించుచున్నదో పసిడితో పోల్చినాడు. కందుగల పసిడిని కాచిన ఇంకను వివర్ణతను పొందును. దుర్యోధనుడు కందుగల పసిడివంటివాడు అట్టివానికి ఈర్ష్యాజనకమై పాండవుల వైభవము కనబడినది. కనుక దుర్యోధనుని శరీర మింకను అంతస్తాపమువలన వివర్ణతను పొందినది. కేవలము పసిడి అని చెప్పినపుడున్న ఉన్నతదృష్టి కందుగల పసిడి యనగానే దానికున్న విలువ తగ్గిపోవును పాండవుల వైభవమును చూచి పరితపించు దుర్యోధనునికిని కందుగల పసిడికున్న స్థితినే నన్నయ ఆపాదించినాడు.

కందుగల పసిడి ఎన్ని మెరుగులతో భాసించినను దాని నిజస్వరూపము కాచిన గాని బయటపడదు కాచినతోడనే వివర్ణమైపోవును. దుర్యోధనుడు తన ఈర్ష్యాళుత్వమును కప్పిపుచ్చి పైకి సాధుస్వభావమును కనబరచ ప్రయత్నించినను మనస్తాప హవ్య వాహమున కాయము వివర్ణమై అతని దుష్టస్వభావము పైకి స్ఫురించెను. మేలిమి బంగారము కాచినను వన్నె తరుగక యుండును. సజ్జనుడు ఈర్ష్యాద్వేషాదులకు లొంగక వన్నె తరుగక సచ్చరిత్రుడై యుండును. కాని దుర్యోధను డట్టివాడు కాడు. దీనిచే దుర్యోధనుని దుర్జనత్వము వ్యక్తమగుచున్నది.

క. ఇంద్రప్రస్థ పురంబున
కింద్రగురుప్రతిభుఁ డరిగి యింద్రసమానుం
జంద్రయశు ననుజసహితు నృ
పేంద్రుని ధర్మసుతుఁ గాంచె నెంతయుఁ బ్రీతిన్.[1]

దుర్యోధనుని కోరిక ననుసరించి ధృతరాష్ట్రుడు పాండవులను తోడ్కొని వచ్చుటకు విదురుని ఇంద్రప్రస్థపురమునకు పంపించెను. మాయాద్యూతము దురంతమని చింతించినను ధృతరాష్ట్రుని నియోగ మలంఘ్యము కనుక విదురుడు పోక తప్పలేదు. "ఇంద్రప్రస్థ పురంబున కింద్రగురుప్రతిభు డరిగి యింద్రసమానుం జంద్రయశు"డైన ధర్మజుని గాంచెను. నన్నయ స్వోపజ్ఞకమైన ఈ యుపమ ధర్మజుని మహనీయత్వమును భావింపజేయుచున్నది. ఇంద్రగురుప్రతిభుడుగా విదురుని పేర్కొనుట సముచితమే. ఇరుపక్షములవారి శుభమును కాంక్షించువాడు విదురుడు. కనుకనే ద్యూతమును వారించుటకు చేతనయినంత ప్రయత్న మొనర్చినాడు. కాని ధృతరాష్ట్రి విధాతృనియోగమని నన్నయ ముందు పద్యమున ప్రయోగించినాడు. ఆ రూపకాలంకారము ఈ వాచకలుప్తోపమ కుపస్కారకమైనది. విధాతృడైన ధృతరాష్ట్రుని నియోగము అనుల్లఘనీయము. ఇంద్రగురుప్రతిభు డేగక తప్పలేదు. పోవగనే కన్పించినవాడు "ఇంద్రసమానుడు, చంద్రయశుడు", అనుజసహితుడు ఐన ధర్మజుడు. ఇంద్రసమానుడు-ధర్మమేదో చెప్పబడలేదు కనుక ధర్మలుప్త అలంకారమును వివరించు చోట లుప్తమైన ధర్మము ధర్మజునియందే అంతర్గతమైయున్నది. అట్టి ధర్మవర్తనుని వర్ణించునపుడు వేరుగా ఇంద్రుని ధర్మజుని సమానధర్మ మేదో చెప్పనవసరము లేదనుకొని నన్నయ ఇంద్రసమానుడని ప్రయోగించినాడు. చంద్రయశుడు అన్నపుడు చంద్రుని కాంతి ధర్మము, ఉపమావాచకము లుప్తమై ధర్మవాచకలుప్త ఐనది. విదురునికి కనిపించిన ధర్మజుని విశిష్టత, వ్యక్తిత్వము ధర్మజుని ఆలంకారికముగా వర్ణించుట కుపయోగపడినవి. విదురునకే కాక ధర్మజుని అవగాహన చేసుకొన్నవా రందరికిని ఈయలంకారముల ప్రయోజనము విదితము కాగలదని నన్నయ అభిమతము. అచ్చటచ్చట నన్నయ ఇట్టి స్వతంత్రప్రయోగములను వ్యక్తుల ఔన్నత్యమును గుర్తింపజేయుటకు ఆ సందర్భమునకు తగినట్లు పాత్రలను తీర్చిదిద్దుటకు ఉపయోగించుచుండును.

---

1. సభా - 2-155

వ. జూదంబున నెగ్గు వుట్టు దీన నయ్యెడు ఫలంబు వేణుఫలంబునుంబోలె సహ మూలవినాశంబునకు నిమిత్తం బగుననిన దుర్యోధనుండు విదురుం దూల నాదరి ప్రాతికామి యనువానిం బిలిచి యీవిదురుండెప్పుడు నరిష్టంబ కాని పలుకండు పాండవులకు వెఱచు నీవు వోయి ద్రౌపదిం దోడ్కొని రమ్మని పంచిన.[1]

అయం ధత్తే వేణురివాత్మఘాతం
ఫలం రాజా ధృతరాష్ట్రస్య పుత్రః
ద్యూతం హి వైరాయ మహాభయాయ
పక్వం న బుద్ధ్యత్యయమంతకాలమ్॥[2]

మాయావిదుడైన శకుని దుర్యోధనుని పక్షమువహించి ధర్మజునితో జూదమాడెను. క్రమముగా ధర్మజుడు జూదమున సర్వమును కోల్పోయెను. చివరకు తమ్ములను, తనను, పాంచాలిని పణముగాపెట్టి ఓడిపోయెను. దుర్యోధనుడు విదురునితో ద్రౌపదిని తోడ్కొని రమ్మనెను. అది సహింపలేని విదురుడు దుర్యోధనుని నిందించెను. జూదము వలన కీడు ప్రాప్తించునని అది వేణుఫలము వలె సహమూల వినాశనమునకు దారితీయునని తెలిపెను. ఇక్కడ ఉపమ కథాగతముగా సాధారణముగా జరిగెడు క్రియావిశేషమును చెప్పునదిగానే కల్పించినను ఇందు విశేషార్థము కలదు. జూదమునకై యత్నించుటయే దుష్కార్యము. ఈ వ్యూహమునందు కౌరవుల ఎత్తులును, పాండవుల ఓటమితో దారి తీసిన పరిస్థితిని, సభాప్రముఖులకు వారించుటకు శక్యము కాలేదు. పాండవులు సంపూర్ణ ముగా ఓడిపోవుటతో కౌరవుల అంతరద్వేషము ప్రబలినది. క్రియారూపమున విజృం భించినది. మొదటినుండి ఓడినవానిని లెక్కచేయక చివరకు పణముగా నొడ్డిన ద్రౌపదిని అవమానింపదలచిరి. అట్టి సందర్భము భీముని భీకర ప్రతిజ్ఞలు వెలువడుటకు హేతువైనది. ఇది జూదమువలన వేణుఫలమువలె పుట్టిన క్రియా రూపము. పాంచాలీ పరాభవము పాండవులను జ్వలితులను గావించి కౌరవులను దగ్ధముచేయు శక్తిని ప్రేరేపించినది. ద్యూతమునకు పూర్వమే విదురునకు లాక్షా గృహ వృత్తాంతమువలన ఫలితము విదితమైనది. ప్రస్తుతద్యూతము వలన కలుగు పరిణామము విదురునకు తెలియును. కౌరవులు సమూలముగా నాశనమగుటకు తమకు తామే కల్పించుకొన్న వేణుఫలము ద్యూతము. అట్టి ఫలమువలన రాబోవు విపత్తు ఘోరరణమునందు కౌరవవినాశము, విదురునకు తెలిసినను కౌరవులను వారించుటకు అశక్తుడైనాడు.

---

1. సభా - 2 - 205. 2 సభా - 60 - 5

సీ. ఇది సేయఁ గాదని మది విచారింపక సద్గర్హితుండు దుశ్శాసనుండు
నెట్టన ద్రౌపది గట్టిన పుట్టంబు సభలోన విడ్చె నాశంక లేక
యుడుగక యొలువంగఁ బడియు మున్నపనీతమైన తద్వస్త్రంబునట్టి వలువ
లలితాంగి జఘనమండలమునఁ బాయక యొప్పుచునున్న నయ్యువిదఁ జూచి

ఆ. సభ్యులెల్ల నుదితసమ్మదులయిరి దు
శ్శాసనుండు వస్త్రచయము పర్వ
తోపమానమయిన నొలువంగ నోపక
యుడిగె లజ్జఁబొంది యుక్కు దక్కి.[1]

యదా తు వాససాం రాశిః సభామధ్యే సమాచితః ।
తతో దుశ్శాసనశ్శ్రాంతో వ్రీడితస్సముపావిశత్ ॥ [2]

ఈ పద్యము ద్రౌపదీ వస్త్రాపహరణ సమయమున దుశ్శాసనుని అసామర్థ్యమును వెల్లడి చేయునది. దుశ్శాసనుని చర్య ద్రౌపదిపట్ల భంగపడినది. ఈ పద్యమందలి రెండు విశేషములు గమనార్హములు. ఒకటి - మున్నపనీతమైన తద్వస్త్రంబునట్టి వలువ రెండు-పర్వతోపమానమయిన వస్త్రచయము. మూలమునం దీవిశేషణములు లేవు దుశ్శాసనుని లజ్జ మాత్రము పేర్కొనబడినది. ఓడినవారి వస్త్రము లపహరింపుమని దుర్యోధనుడు దుశ్శాసనుని నియమించెను. పాండవులు తమ పయిపుట్టము లాసభలో నుంచిరి. కౌరవుల చర్య అంతటితో ఆగక ద్రౌపది నవమానించుటవరకు పోయినది. కాని ఆ ప్రయత్నము విఫలమైనది. పూర్వము ఎట్టి వస్త్రము ద్రౌపది నావరించి యున్నదో అట్టి వస్త్రము ఎడతెగక వచ్చుచుండెను. అది పర్వతోపమానమై పడినది. దుశ్శాసనుడు ఉక్కు దక్కి లజ్జించినాడు. మొదటినుండి కౌరవుల దుష్కార్యముల కిట్టి పరాజయస్థితు లెదురైనను విడువక అపకృతు లొనరించుచునే యుండిరి. పాండవు లీవిధముగా వీరివల్ల ఎన్ని అగచాట్లు పడినను వారి పరాక్రమ వైభవమునకు క్షతి లేదు. దీనితోపాటు వీరికి భగవంతుడైన కృష్ణుని కృప గలదు. ఈ సమయమున ధ్యానమూర్తియైన ద్రౌపదికి కృష్ణుని సహాయము లభించినది. సభలోనికి కొనిరాబడినప్పుడే ద్రౌపది భీతయై కృష్ణుని తలంచినది. కట్టిన పుట్టమును దుశ్శాసను డొలుచునపుడు అట్టి వస్త్రమే ఎడతెగక వచ్చుచు పర్వతతుల్యముగా రాశీభూత మగుటలో దుశ్శాసనుని మౌర్ఖ్యనిర్భరమైన సాహసకృత్యము, ద్రౌపది భక్తి,

1. సభా - 2 - 231 2. సభా - 61 - 52

భగవంతుని కృప ఇన్నిటిని మించి మానవబుద్ధికి, ప్రయత్నమునకు అతీతమైన సంస్థితి ఈ యలంకారమునందు వ్యంజిత మగుచున్నది. ఇది నన్నయ స్వతంత్రమైన కథా ప్రసన్నతోచితమైన ఉపమాప్రయోగనైపుణికి ఉదాహరణీయమైనది.

వ. ఆప్పాండవుల కెంతలగ్గు సేసియు నింక హితుల మయ్యెదమె యాశీవిషం బుల నలిగించి కంఠసమీపంబున వీడుమనట్లు వారల విడిచిపుచ్చి కర్జంబు దప్పితిమి.[1]

అహీనాశీవిషాన్ క్రుద్ధాన్ నాశాయ సముపస్థితాన్ ।
బద్ధ్వా కంఠే చ పృష్ఠే చ కస్సముత్స్రష్టుమర్హతి ॥
ఆత్తశస్త్రా రథగతాః కుపితాస్తాత పాండవాః ।
నిశ్శేషాన్ నః కరిష్యంతి క్రుద్ధా హ్యాశీవిషా ఇవ ॥ [1]

శకునితో జూదమాడిన ధర్మజుడు సోదరులను భార్యను సమస్తమును ఓడి పోయెను. దుశ్శాసనాదులు ద్రౌపదిని పరాభవించి పాండవుల నవమానించిరి క్రోధో ద్విగ్నమనస్కులైన పాండవులు భీకరప్రతిజ్ఞలు చేసిరి. ఈ దుష్పరిణామముల నెరిగిన ధృతరాష్ట్రుడు ద్రౌపదికి వరము లొసగినాడు తత్ఫలితముగ వారికి రాజ్య ప్రాప్తియు దాస్యవిముక్తియు లభించినవి. ద్రౌపదీసహితులై వారు ఇంద్రప్రస్థ పురమునకేగిరి. దుశ్శాసనునివలన ఈ వృత్తాంతమెరిగిన దుర్యోధనుడు తండ్రివద్దకు పోయి — అహితులను ఉపేక్షించగూడదని, పాండవుల కెంతలగ్గు చేసినను హితులము కామని పలికెను. అంతేకాక ఆశీవిషంబుల నలిగించి కంఠసమీపంబున విడుమనట్లు వారల విడిచిపుచ్చి "కర్జంబు దప్పితి" మని పలికెను. మూలమున — "అహీనాశీ విషాన్ క్రుద్ధాన్ నాశాయ సముపస్థితాన్, బద్ధ్వా కంఠే చ పృష్ఠే చ కస్సముత్స్రష్టు మర్హతి" "నిశ్శేషాన్ నః కరిష్యంతి క్రుద్ధా హ్యాశీవిషా ఇవ" కంఠమున పృష్ఠమున సర్పమును బంధించి స్వాధీనము చేసికొని ఎవడు వదలిపెట్టును. విడువడు. విడిచిన అతనిని కాటు వేయకమానదు. కోపగించిన ఆశీవిషములవలె శస్త్రములు కలిగి రథ గతులైన పాండవులు మమ్ము నిశ్శేషము చేయక మానరు, అని మూలమునందలి భావము.

ఈ భావమును నన్నయ ఒక్క వాక్యములో మూలానుసరణముగా చెప్పినాడు. ఆశీవిషంబుల నలిగించి కంఠసమీపంబున విడుమనట్లు - అని వాని స్వభావమ్ము దుట్టో

1. సభా - 2 - 272

1. సభా - 66 - 10, 11

ధనునకు పూర్తిగా అవగతమైన విధము ధ్వనింపజేసెను. అంతేగాక దుర్యోధనుడు మరల తండ్రిని ద్యూతవిషయము నంగీకరించుటకు సుముఖునిగా ఒనర్చుకొనవలెను. అందులకై ఇపు డెంతమేలు చేసినను పాండవులకు హితులము కాము; ఆశీవిషముల నలిగించి కంఠసమీపమున విడుచునట్లు పాండవులను విడిచితిమని తెలిపెను. "బద్ధ్వా కంఠే చ పృష్ఠే చ" అనువానిలో నన్నయ కంఠమందు ఆశీవిషమును విడుచుటే ప్రాణమునకు హానికరము. ఇంకను పృష్ఠే చ అను ప్రయోగమును కాని "ఆత్తశస్త్రా రథగతాః" అను మాటలనుగాని గ్రహించలేదు. దుర్యోధనునకు, ఎట్లైనను పాండవులను నిరాధారుల జేయుటే ముఖ్యోద్దేశము. కనుక ధృతరాష్ట్రుడు వారల దాస్యవిముక్తుల చేయుటయు, రాజ్యమొసగుటయు నచ్చలేదు. పుత్రప్రేమకు కట్టుబడు ధృతరాష్ట్రుడు దుర్యోధనుని అభిప్రాయము నంగీకరించక తప్పలేదు.

వ. కావున బంధుమిత్రధనసంచయంబులవలని స్నేహంబు విడుచునది, పద్మపత్రంబు నీరంబొందని యట్లెఱుక గలవారి నెట్టియెడలను స్నేహంబు వొందదు, స్నేహంబున రాగంబును, రాగంబునం గామంబును, గామంబునం గ్రోధంబును, గ్రోధంబునం దృష్ణయు వర్తిల్లు.[1]

జ్ఞానాన్వితేషు ముఖ్యేషు శాస్త్రజ్ఞేషు కృతాత్మసు ।
న తేషు సజ్జతే స్నేహః పద్మపత్రేష్వివోదకమ్ ॥[2]

పాండవులు నిజాయుధధారులై పాంచాలీసహితముగా వనవాసమున కరిగిరి. గంగాతీరమున ప్రమాణాఖ్యవటమున విడిసిరి. తమతో వనవాసము చేయదలచి వెంట వచ్చిన విప్రుల నతిప్రీతి నర్చించి తదాశీర్వాదముల నభినందితుడైనాడు ధర్మజుడు. వారితో ధర్మజుడు తాము అపహృతసర్వస్వులమని, వనవాసము భయానకమని వివరించి క్రమ్మరి వెడలిపోవుడనెను. కాని వారు ధార్మికులైన పాండవులను విడిచిపోమని వన్యమూలఫలభక్షణమైనను ఇష్టదాయకమని తెలుపగా ధర్మజు డొడంబడినాడు. కాని ఇష్టమృష్టాన్నముల దృప్తులగు మహీసురవరుల కానలందు శాకాశనులుగా నెట్లు చూడనోపుదునని ధర్మజుడు శోకమూర్ఛితుడైనాడు. అప్పుడు శౌనకుడను బ్రహ్మర్షి అతని నాశ్వాసించి తొల్లి ఆత్మవ్యవస్థానార్థంబు జనకగీతములయిన శ్లోకార్థములు బోధించినాడు. అందొకటి - పద్మపత్రము నీటిలో నుండియు బిందుసిక్తము కాని యట్లు జ్ఞానరూపులను సంసర్గము పొందజాలదని - తెలిపెను. బ్రాహ్మణులపై గల

1. అరణ్యపర్వము - 1 ఆ - 24 2. అరణ్య - 2 - 33.

భక్తి భావమువలన వారు పడుకష్టములు తలచి సహింపలేక ధర్మజుడు శోకమూర్ఛితుడైనాడు. తన్నాశ్రయించినవారి పట్లనే కాక తన బంధుజనము నెడలను అట్టి స్నేహము పనికిరాదని శౌనకుని పరమార్థము.

ఇచ్చట స్థితప్రజ్ఞునియందు చూపట్టు అనాసక్తలక్షణము వివృతమైనది. ఈ పద్యమందలి భావము యథామూలకము. పద్మపత్రముపై నీరు నిలువనట్లు ఐహిక విషయములందు జ్ఞాని స్నేహము పొందడు. బ్రహ్మర్షి ముఖమున భవిష్యఫలము సూచితమైనది.

స్వర్గారోహణపర్వమున ధర్మజుని నలువురు సోదరులు, పాంచాలి అనుసరించలేక మార్గమధ్యముననే పడిపోయినప్పుడు ధర్మజుడు మాయామోహితుడు కాలేదు. స్థితప్రజ్ఞత్వము కలుగుటకు కావలసిన పరిపూర్ణజ్ఞానవికాస హేతువులుగా ఇట్టి ఉపదేశములు మొదటినుండి ధర్మజునికి తోడ్పడినవి. స్నేహమువలన రాగము, కామము, క్రోధము, తృష్ణ వరుసగా ఉద్భవించి జ్ఞానమునకెట్లు భంగకరములుగా పరిణమించునో స్ఫుటమొనర్చినాడు. మూలవిధేయమైన ఈయలంకారము ధర్మజుని పరిపూర్ణమైన జ్ఞానస్వరూపమూర్తిగా పరిణమింపజేయుటకు ప్రధానమైన హేతువులలో ఒకటిగా, కథాగతమైన అంతస్తత్త్వమును పాత్రస్వరూపమును తీర్చి దిద్దునదిగా భావింపవచ్చును.

వ. నా వచనంబున నెగడునది యనిన ధర్మరాజు నట్ల చేయుదునని యున్నంత నిట ధృతరాష్ట్రుండు పాండవుల యొద్ద విదురు నునికి యెఱింగి ధృతిహీనుండై తన హృదయంబును దృష్టియుంబోని విదురుం బాసి నిమిషంబేని నిర్వహింపనోపక సంజయున కిట్లనియె [1]

దుర్యోధనుని దుర్మార్గవర్తనమును అధర్మద్యూతమును గూర్చి విదురుడు ధృతరాష్ట్రునితో పలికినాడు. కులదూషకు దూషించి కులమును రక్షించుకొనుట ధర్మమనెను. విదురుని పలుకులకు ఆగ్రహించిన ధృతరాష్ట్రుడు విదురుని దూషించి అతని సహాయ మక్కరలేదనియు పాండవుల కడకైనను ఇంకెచటికైనను పొమ్మని పలుకగా విదురుడు వెంటనే కామ్యకవనమున నున్న పాండవులకడ కేగి అచ్చట నుండెను. పుత్రప్రేమకు లోనై ధృతరాష్ట్రుడు విదురుని బాసినను అతని సామీప్యము తన కెంత ప్రయోజనకారియో తెలిసినవాడు. క్షణికావేశమున విదురుని పోగొట్టుకొంటినని బాధపడినాడు. ఈ మానసిక వర్తనము ధృతరాష్ట్రునిదే కాదు

1. ఆరణ్య - 1 - 62.

నన్నయది. ధృతరాష్ట్రునిపట్ల నన్నయకున్న సానుభూతి అది. అంధుడైన రాజుకు పుత్రు లెట్లును వశానువర్తులై లేరు. ధార్మికవర్తనుడు, బాంధవుడు మిత్రుడు ఐన విదురునైనను ధృతరాష్ట్రునికి సన్నిహిత మొనర్చవలెనన్న సానుభూతియే స్వతంత్రమైన అలంకార ప్రయోగమైనది. అందుకే ధృతరాష్ట్రుడు ధృతిహీనుడై "తన హృదయంబును దృష్టియుంబోని విదురుం బాసి నిముసం బేనియు నిర్వహింప నోపక సంజయుని" విదురునికొరకు పంపించెను. ధృతరాష్ట్రునికి హృదయమును దృష్టియు విదురుడు. కౌరవులు పాండవుల కొనర్చు అపకృతివల్ల విదురుడెంత పరితాపమందుచున్నాడో ధృతరాష్ట్రుడును అంతే బాధపడువాడు. పుత్రప్రేమకు కట్టుబడి ధర్మాధర్మ విచారణ చేయకున్నాడు. విదురు డట్లుకాక ఇరుపక్షములందున్న గుణవిచారము చేయుచు ధృతరాష్ట్రుని హృదయమందు మథనపడెడి విషయమునే సముఖమున ప్రస్తావించెడివాడు. ధృతరాష్ట్రునికి దృష్టి లేకపోయినను విదురుడు తన దృష్టికి గోచరమగుచున్న వాతావరణము నంతయు ఎప్పటికప్పుడు వివరించుచు హితమును బోధించెడివాడు. అంధుడైన రాజుకు విషయవివరణ మొనర్చి న్యాయ సమ్మతమైన తీర్పు నాశించువాడు విదురుడు. అట్టి ధర్మవర్తనుడు, నిష్పక్షపాత బుద్ధి గలవాడు, సన్నిహితుడు ఐన విదురుడు తనకు దూరమైనగాని ఆ లోటు ఎట్టిదో ధృతరాష్ట్రునికి తెలిసిరాలేదు. అందుకే ధృతిహీనుడైనాడు. సకల బాంధవులు, సమస్త రాజ్యమును ఉన్న ధృతరాష్ట్రునికి ఒక్క విదురుడు లేకపోవుటవలన ధృతి హీనత్వము సంభవించినది. అందుకే తన హృదయమువంటివాడు, దృష్టివంటివాడు ఐన విదురుని బాసి నిమిషమైనను గడుపలేక పోయినాడు. హృదయమునకు దృష్టికి ఉన్నటువంటి ధర్మము లోపించి ధర్మలుప్త ఐనది. అలంకారమందే, కాక విదురుని ఎడబాయుటనునది ధృతరాష్ట్రుపట్ల ధర్మలోపమే కనుక నన్నయ ధర్మలుప్తను ప్రయోగించినాడు. ఈ లుప్తోపమల ప్రయోజనము నొక్కొక్కచోట ఒక్కొక విధముగా నన్నయ తీర్చినాడు.

సీ. విమలహర్మ్యంబుల విహరించువారలం ప్రియమహార్హాసన శయనరతులఁ
జందనాగురులిప్త చారుసర్వాంగుల నతనరనాథసేవితుల మిమ్ము
వనమునఁ గ్రుమ్మరువారిఁగాఁ గుశబృసీశయనాభిరతులఁగా నియతరూక్ష
భూరేణుధూసరీభూతవిగ్రహులఁగా ద్రుతవన్యమృగనిషేవితులఁ గాఁగ

ఆ. నిట్లు సూచి చూచి యేనెట్లు చిత్తోప
శాంతి సేయుదాన సకలభోగ

విషయవిరతిఁ జేసి విధియును ధృతరాష్ట్రు
నట్లు మీకు నహితుఁ డయ్యెనొక్కొ.[1]

అరణ్యవాసమున నున్న ద్రౌపదీధర్మరాజుల సంభాషణమున-తమకు కౌరవులవలన ప్రాప్తించిన దురదృష్టమును తత్ఫలితముగా కలిగిన దురవస్థయు చెప్పబడినది. ద్రౌపది అదివరకు పాండవులకున్న వైభవమును గుర్తింపజేయుచు ప్రస్తుతమున్న ఇక్కట్లను వివరించుచున్నది. విమలహర్మ్యంబుల విహరించువారైన పాండవులు వనమున గ్రుమ్మరుచున్నారని, మహార్హాసనశయనరతులు, కుశబృసీశయనాభిరతులైనారనియు, చందనాగురులిప్తచారుసర్వాంగులను భూరేణుధూసరీభూత విగ్రహులుగా, నతనరనాథసేవితుల వన్యమృగనిషేవితులుగా తాను చూచి ఓర్వలేనని ద్రౌపది పలికినది. అందులకే "విధియును ధృతరాష్ట్రునట్లు మీకు నహితుఁడయ్యె నొక్కొ" అని వాపోయినది. తమ దురదృష్టమునకు చింతించిన అసహాయురాలివలె విధిని తలచుకొన్న ద్రౌపదిని నన్నయ వర్ణించినాడు. ద్రౌపదియు దైవాంశసంభూతురాలై జన్మించినదే. ఐనను మానవుల చిత్తవృత్తి సుఖదుఃఖములపట్ల ఎట్లు వర్తించునో నన్నయ భావింపజేసినాడు. దైవమైన కృష్ణుడు తమపట్ల గలడని ద్రౌపదికే కాక పాండవులకును విశ్వాసము కలదు. ఐనను కర్మఫలమనుభవింపవలెనన్న భగవానుని హిత మనుసరించి తమకు సంభవించిన కష్టము ననుభవించుచున్నను అప్పుడప్పుడు ఉద్విగ్నమయ్యెడు చిత్తక్షోభమునకు రూపముగా ఇట్టి తలపోత వారికి తప్పలేదు. గతవైభవము జ్ఞప్తికి వచ్చినపుడు అది తప్పనిసరి యగును. అదే స్థితిని పొందిన ద్రౌపదియు - పుత్రవ్యామోహమునకు లోనైన ధృతరాష్ట్రుని వలననే తమకు ఇట్టిపాట్లు సంభవించినవని నమ్మినది. విధి కూడ ధృతరాష్ట్రునివలెనే మిన్నకుండిన తమకిన్ని విపర్యయములు సంభవించినవని ధృతరాష్ట్రుని కఠినత్వమును విధి కాపాదించినది. ఇచట ద్రౌపది హృదయపరితాపమును, సామాన్యగృహిణి లక్షణములను నన్నయ ఆలంకారికముగా పాత్రోచితముగా తీర్చినాడు.

క. భవదాజ్ఞానిగళంబునఁ
దవిలి పరాక్రమము విడిచి ధరణీశ్వర నీ
యవరజు లిడుములఁ బడి కడుఁ
జివికిరి చెఱఁబడిన సింహశిశువుల తెఱఁగున్.[2]

1. అరణ్య-1-210
2. అరణ్య-1-211

పాండవు లరణ్యమున దుఃఖోపశమనములయిన కథలు చెప్పుకొనుచున్న సమయమున ద్రౌపది ధర్మజునితో సంభాషింప మొదలిడెను. కౌరవులపట్ల తనకు గల ప్రతీకారేచ్ఛ ధర్మజునికి విదితమొనర్చి ఉద్విగ్నయయ్యెను. మన్యువ్యవసాయదీపకము అయిన మాటలవలనగాని ధర్మజునిలో జ్వలనము కలుగదనుకొనినది. పుత్రవ్యామోహ వశమున ధృతరాష్ట్రుడు తమకు చేసిన అపకారమువలన తాము పడు ఇక్కట్లు పేర్కొనినది. ధర్మజుని మాటకు కట్టుబడి సోదరులు పరాక్రమము విడిచి ఇడుముల పాలైనవిధ మిందు వర్ణితమైనది. దుర్దశాపరీతులైన అనుజుల స్థితి చెఱబడిన సింహములవలె కలదని నన్నయ స్వతంత్రోపమను ప్రయోగించెను. ఇచ్చట ద్రౌపదీ ముఖమున ధర్మజుని మనఃప్రవృత్తిని వీరభావోపపన్న మొనర్చుటయే ధ్యేయము. ఇది కరుణము నాశ్రయించి జ్వలనోన్ముఖము చేయు ప్రయత్నముగా గమనింపవచ్చును. కౌరవు లెంతటి అపకృతి యొనర్చినను ధర్మవర్తనుడైన ధర్మజునకు వారిపట్ల క్రోధము లేదు. అజ్ఞాతవాసము తరువాత కూడ తమకు ఐదూళ్ళిచ్చిన చాలునని కృష్ణుని రాయబారమునకు పంపుట ఇందుకు నిదర్శనము. అట్టివాని ఆజ్ఞయైనగాని నలువురు సోదరుల పరాక్రమవిజృంభణము జరుగదు. కనుక ధర్మజుని ఆజ్ఞ, ఇడుములుపడు సోదరుల పరాక్రమమునకు సంకెల ఐనది. ఈస్థితి చెఱబడిన సింహ శిశువులతో ఉపమింపబడి వ్యంజితమైనది. అట్టివారు క్షత్రియోచితమైన సహజ పరాక్రమముతో విజృంభించి రాజ్యమును పొంది సుఖప్రదమైన జీవనము గడుపుట కుత్సహింపజేయు ద్రౌపది వాక్యములు ఆమె పాత్రస్వరూపమును దీపింపజేయునవి.

తే. తగిలి నిత్యంబు నేకాంతధర్మనిరతు
డగుట యుక్తమె పురుషున కట్టివాని
వెలయ నర్థకామంబులు విడుచు బ్రాణ
విగతు సుఖదుఃఖములు రెండు విడుచునట్లు[1].

సర్వథా ధర్మనిత్యం తు పురుషం ధనదుర్బలమ్ ।
జహతస్తాత ధర్మార్థౌ ప్రేతం దుఃఖసుఖే యథా ॥[2]

ద్రౌపది వచనముల కనుగుణముగా భీముడు ధర్మజునితో దుర్మార్గులను దుర్మతులను క్షత్రియోచితబలముతో జయింపవలెగాని, వారిపట్ల ధార్మికమృదు వర్తనము పనికిరాదనెను. నిరంతరము ధర్మనిరతు డగుటలో లోకవర్తనమునందు వ్యక్తికి

1. ఆరణ్య-1-244 2. ఆరణ్య-29-22

నష్టము వాటిల్లునని యాతని అభిప్రాయము. ఆనష్టము ధర్మమునందు సదా ప్రవర్త మానమగు ధర్మజుని మనసునకు సువిదితమగునట్లు అలంకారము ప్రయుక్తమైనది.

ప్రాణవిగతుని సుఖదుఃఖములు విడుచునట్లు నిత్యధర్మనిరతుని అర్థకామములు విడుచునని ఉపమాలంకృతిభావము, మూలమునకు యథాతథముగా ఆవిష్కృతమైనది. వ్యక్తి స్వభావమునుబట్టి అత్యంతపరిచయమైన విషయ మెక్కువగా ఆకర్షించును. మృత్యువునకు సంబంధించిన ఉపమానము శుభావహము కాదు; గౌరవభంజకము. ఇక్కడ-ధర్మజుడు పురుషార్థసాధకుడు. పురుషార్థములనే అనుజులుగా కలిగిన వాడు. కావున భీముని మాటలలో పురుషార్థసాధనాస్వభావము కలదు. ఇచట పరమ శాంతస్వభావుడైన ధర్మజుని హృదయమునకు హత్తుకొనవలెనన్న ఇట్టి ఉపమానమే తగును. కావున నన్నయ దీనిని యథాతథముగా ననుసరించుటలో ఔచిత్యమునే పాటించినాడు.

సీ. ధర్మకామంబులు దఱుగంగ నర్థార్థియగువాఁడు పతితుఁడౌ నర్థసేవ
నర్థార్థముగఁ జేయునతఁ డుగ్రవనములో గోరక్షసేయు నక్కుమతిఁబోలు
నర్థధర్మములకు హానిగాఁ గామార్థి యగునాతఁ డల్పజలాశయమున
జలచరం బెట్టు లజ్జలములతోఁ జెడు నట్లు కామంబుతో హానిఁ బొందు

ఆ. నర్థధర్మములు మహాబ్ధిమేఘములట్లు,
లుభయమును బరస్పరోదయమ్ము
లిట్లుగా త్రివర్గ మెఱిగి సామ్యమున సే
వించువాడు సర్వవిత్తముండు.[1]

తస్య ధర్మార్థహీనస్య కామాంతే నిధనం ధ్రువమ్ ।
క్రీడతో రమమాణస్య మీనస్యేవాంభసః క్షయే ॥
సర్వథా ధర్మమూలోఽర్థో ధర్మశ్చార్థ పరిగ్రహః ।
ఇతరేతరయోర్నితౌ విద్ధి మేఘోదధీ యథా ॥[2]

ఉత్తముడైనవాడు వర్గచతుష్టయము నెట్లనుష్ఠింపవలయునో ధర్మజునికి భీముడు వివరించినాడు. ధర్మకామములు వినష్టమగునట్లు అర్థార్జన చేయువా డుగ్రవనములో గోరక్షణ సేయు కుమతి వంటివాడని పలికెను అర్థధర్మములకు హానికరముగా కామార్థి యగువాడు అల్పజలమున జలచరము చెడునట్లు పతితుడగును. ధర్మార్థములు

1. ఆరణ్యా - 1 - 245-  2. ఆరణ్యా - 29 - 27, 29

మహాబ్ధిమేఘముల వలె పరస్పర సహకార యుతములు. ఈ విధముగా త్రివర్గమును సమభావముతో సేవింపవలెను. కేవల ధర్మాచరణముచేతనే శత్రువులను జయించుట సాధ్యము కానిపని. సమయాతిక్రమభీతిని కౌరవులు పరాక్రమహీనత్వముగా తలచుటకు వీలు కలదు కావున నిత్యము సమరోత్సాహమతితో నుండవలయునని తెలిపెను. మూలానుసరణమైన ఈ పద్యమందు నన్నయ్య "ఉగ్రవనములో గోరక్ష సేయు నక్కుమతి బోలు" అని విషయమును వివరించినాడు. సత్వగుణ ప్రధానుడైన ధర్మజునికి క్రమానుసారముగా ధర్మార్థకామమోక్షములెట్లు సహజములో ఉపమానముల ద్వారా సూచితమైనవి. ధర్మజుని మనసునందు సమరకాంక్ష జ్వలింపజేయుటకు భావమును స్ఫుటముగా ఆవిష్కరించుటయే ఇచ్చట ఈ యుపమాలంకార ప్రయోజనము.

వ. ఆబాలవృద్ధప్రసిద్ధుండవై పార్థివసూర్యుండవైన నిన్నును సింహ సదృశులైన నీ తమ్ములను నెఱుఁగనివారు లేరు. మన గూఢభావంబు మేరువు నిగూఢ భావంబునుంబోలె నఘటమానం బిట్లేని నివ్వనవాసక్లేశం బెన్నఁడును మనకుఁ బాయనేరదు. మనమిప్పు డివ్వనమునఁ బదుమూఁడు మాసంబులు సలిపితిమి, సంవత్సరప్రతినిధిగా మాసంబులు సేసికొనుట యెందునుం గలయదియ దీన ధర్మవిరోధంబు లేదు. విజయారంభంబున కిది యవసరంబనిన భీమసేను పలుకులు విని నిశ్వాస వ్యాకులిత ముఖుండై పెద్దయుం ప్రొద్దు చింతించి ధర్మరాజిట్లనియె. 1

మాం చాపి రాజన్జానంతి హ్యాకుమార మిమాః ప్రజాః।
అజ్ఞాతచర్యాం పశ్యంతి మేరోరివ నిగూహనమ్ ॥ 2

ద్రౌపది అభిప్రాయమునకు ప్రోత్సాహకరముగా భీముడును తన అభిమతమును ధర్మజునికి తెలియజేసెను. ఇంతవరకు తామెన్నో బాధలు పడుచు పన్నెండు సంవత్సరములు అరణ్యవాసము గడిపిరి. ఇట్టి విపర్యాసమునకు కుంతియు పాండవులును అంతస్తాపము నందుచుండిరి. భీముడు రాజధర్మమును తెలియజేయుచు - శత్రు సంహారము చేయకున్న హాని సంభవించునని ఒరు లెరుగకుండ అజ్ఞాతవాస మొక దినమైనను తాము చేయలేమని పలికినాడు. పన్నెండేడులు అరణ్యవాసమొనర్చిన తమకు అజ్ఞాతవాస మెట్లు కష్టమో కారణము వివరించినాడు. ఆబాలవృద్ధప్రసిద్ధమైనవాడు

. ఆరణ్య - 1 - 266    2. ఆరణ్య - 32 - 27

పార్థివసూర్యుడు ధర్మజుడు. సోదరులైన తాము సింహసదృశులమని తమ పరాక్రమమును వర్ణించినాడు. అంతేకాక "మన గూఢభావంబు మేరువు నిగూఢభావంబునుం బోలె నఘటమానంబు" అని అజ్ఞాతవాసమునకు హేతువును సూచించినాడు వీరులైన పాండవులకు ప్రతిచోటను తమ పరాక్రమమును ప్రదర్శించు సంఘటనలు తటస్థపడుచునే యున్నవి. ఆబాలవృద్ధ ప్రసిద్ధి వగుటకు ధర్మజుని ధర్మవర్తనమే కారణము. తమ పరాక్రమ ప్రదర్శనలు తమను సింహసదృశులుగా భావింపజేయును. రూప, విక్రమాదులందు జగత్ప్రసిద్ధులైన వీరికి అజ్ఞాతవాసము కష్టతరము. మేరువు నిగూఢభావ మెట్లుండునో పాండవుల గూఢభావమును అట్లే అఘటమానము, ఉన్నతమైన మేరుపర్వతమువలె పాండవు లత్యున్నతులు. పర్వతములలో ఉన్నతముగా భాసించు మేరుపర్వతము గూఢముగా నుండలేదు అట్లే లోకమున ప్రసిద్ధులైన పాండవులు గూఢభావమున నుండుట కష్టము. మూలమునందలి భావమునే నన్నయ గ్రహించి సోదరులు సింహసదృశులను భావమును చేర్చి పెంచి వ్రాసెను. మేరు గూఢబావముతోబాటు, పాండవుల పరాక్రమ ప్రస్తావనమును వారి అఘటమానమైన అజ్ఞాతవాసమునకు హేతువగునని నన్నయ తలచినాడు. ముఖ్యముగా భీముడు యుద్ధప్రియుడు. తామిట్లు కౌరవులవలన క్లేశపడుటగాని సంధికార్యము గాని ఇష్టపడనివాడు. ప్రతీకారమున కెదురు చూచుచుండినవాడు. అట్టివాడు అజ్ఞాతవాస మెట్లుపొసగదో చెప్పవలెనన్న తగు కారణము చెప్పవలెను. అందులకు నన్నయ కొద్దిగా పెంచి వ్రాసిన సింహసాదృశ్య ముపస్కారమైనది.

క. పుడమియు రాజ్యము బంధుల
విడిచి మృగావలులఁ గలసి విపినంబులలోఁ
గడుకొని మాయట్లిడుమలఁ
బడిన నరులు గలరె యొరులు పరమమునీంద్రా.1

నాస్తి రాజా మయా కశ్చిదల్పభాగ్యతరో భువి ।
భవతా దృష్టపూర్వో వా శ్రుతపూర్వోఽపి వా భవేత్ ॥2

భీముని సంరంభమును ధర్మజుడు సాంత్వనవచనములతో ఉపశమింపజేసెను. పదమూడేండ్ల తమ గడువు ముగిసిన తరువాత కాని తమ విజృంభణము నెరపవచ్చునని శాంతపరచెను. అట్టి సందర్భమున బృహదశ్వుడను మహాముని పాండవుల వద్దకు వచ్చెను. విధిదృష్టవిధానమున ధర్మరాజాదు లతనిని పూజించిరి. అనంతరము

1. ఆరణ్య - 2-3    2. ఆరణ్య - 44-46

ధర్మరాజు అధర్మపరులైన కౌరవులవలన తాము పడిన పాట్లన్నియు బృహదశ్వునితో చెప్పినాడు. ఇంకను "పుడమియు రాజ్యము బంధుల విడిచి మృగావలులఁ గలసి విపినంబులలో గడుకొని మాయట్లిడుమలఁబడిన నరులు గలరె యొరులు" అని ప్రశ్నించినాడు. మూలమున-నావలె అల్పభాగ్యతరమైన రాజు భువిపై లేడు, ఇదివరకు చూచిగాని వినిగాని యున్నారా- అని కలదు.

మూలమున కుపస్కారమైన ఈయలంకార ప్రయోజనము-ప్రధానకథ కనువుగా ఉపకథను సంధించుటకొరకే. వీరివలెనే అడవులపాలై, సర్వమును కోల్పోయి చివరకు భార్యను సైతము విడనాడిన నలమహారాజు కథనిట ప్రస్తావించవలయును, అందులకై ధర్మజునకు కలిగిన సందేహము బృహదశ్వుని ప్రశ్నించిన తీరును నన్నయ వివరించినాడు. ఇచట ధర్మజుడు బృహదశ్వుని అడుగుటకును కారణముత్నిది. తామింతవరకు అనుభవించినటువంటి కష్టములను బృహదశ్వునికి వివరించి తమవలె బరులెవరైన ఇడుమలబడినవా రున్నచో తమకును అట్టికీర్తియే లభించునని అభిమతము. నలుడెన్ని కష్టము లనుభవించినను చివరకు సర్వస్వమును మరల సంపాదించుకొనెను. పాండవుల వృత్తాంతమును అట్టిదే. భారతమున ప్రధానకథకు సంబంధించి అక్కడక్కడ ఉపకథల కూర్పు సందర్భోచితముగా కలదనుటకు ఇట్టి సంభాషణ ముదాహరణము. పాండవుల అరణ్యవాసమునకు సంబంధించిన వివరములు, రాబోవు అజ్ఞాతవాసమున వారి జీవనవిధానము అందులకు ప్రోత్సాహకరముగా నలోపాఖ్యానము చెప్పబడినది. ధర్మబద్ధమైన జీవనమునకు కట్టుబడినవా రెదుర్కొన వలసిన సంఘటనలు చివరకు ధర్మమునకే జయము ప్రాప్తించునన్న రుచిరార్థ సూక్తికి ప్రసన్నకథాకలితార్థయుక్తికి ఈ ఘట్టము నిదర్శనము.

సీ. గమన వేగంబున ద్రుమలతాజాలసంచాలన సేయుచు శైలగుహల
నడఁగి యదృశ్యులై కడువేడ్కతోఁ దన్నుఁ జూచు ఖేచరసిద్ధ సురభుజంగ
గరుడ గంధర్వ కిన్నర కామినులచేత మానుగా నభివీక్ష్యమాణుఁడగుచు
మ్రాఁకులు విఱుచుచు వీఁకతోఁ దీగలు పెఱుకుచుఁ బదహతిఁ బృథునగేంద్ర

ఆ. మృదువ నున్నతంబులయి నెడలెక్కుచు
మదగజంబువోలె మధ్యముండు
పవనవైనతేయ పటుజవయుక్తుఁడై
యరిగె గంధమాదనాంతరమున.[1]

1. అరణ్య - 3 - 312

లతావల్లీశ్చ వేగేన వికర్షన్ పాండునందనః ।
ఉపర్యుపరి శైలాగ్రమారురుక్షురివ ద్విపః ॥[1]

గంగాతీరమున బదరీవనమున పాండవులున్నప్పుడు సమీరవిధూతమై ఒక్క సౌగంధికకమలము వారి ముందట బడినది. దాని అపూర్వరామణీయకమున కచ్చెరువంది ద్రౌపది అట్టి కుసుమములు పెక్కు కావలయునని కోరిన ఆమె యభిమతమును తీర్చుటకు భీముడు బయలుదేరెను. అతని గమనవేళాసంరంభమును వర్ణించుచు నన్నయ - "మదగజమువలె మధ్యముడు పవనవైనతేయపటుజవయుక్తుఁడై "నట్లు వ్రాసెను. ఈవిశేషము ప్రకృతసన్నివేశమునకు సహజముగా భాసించినను రాబోవు సంఘటన కుపస్కారకముగా నుండుట గమనింపదగినది. "ఆరురుక్షురివ ద్విపః" అని మూలము. దీనికి పవనవైనతేయపటుజవమును నన్నయ కల్పించెను. భీముడు పవన పుత్రుడు, వైనతేయునికి సాటివచ్చు అప్రతిహతబలుడు. అయినను మధ్యేమార్గమున త్రోవ కడ్డముగానున్న కపివరుని లాంగూలమును కదల్చలేక ఉద్గతఘర్మజలార్ద్ర దేహుడై కాపురుషుండుఁబోలె నిజగర్వము దక్కి చింతాపరుడై అడగియున్నాడు. ఇంకను-లజ్జ నధోముఖుండుతో నొప్పెను- (329 ప). దీనికి మూలమున 'తస్థౌ వ్రీడాదధోముఖః' అని కలదు. దీనికి పెంపుచలయే "కాపురుషుండుఁ బోలె" అను నన్నయ వాక్యము. భీమునికన్నను అధికమైన శక్తిగలవాడు హనుమంతుడు. అట్టివాని బలపరాక్రమమును వేరుగా వర్ణింపక భీముని ఓటమియందే దానిని ధ్వనింపజేయుట ఇందలి ప్రత్యేకత. రాక్షసులనందరిని హతమార్చిన భీముని పరాక్రమము హనుమంతుని ముందర మొక్కవోయినది. అందుకే బలగర్వితుడైనభీముని కాపురుషుడని ఆసమయ మున చెప్పుట జరిగినది. ఇందలి ఉపమ ప్రముఖముగా పాత్రగతమై గుణక్రియా స్వరూపమును ఆవిష్కరించునదిగా నున్నది.

క. సురచాపచిత్రగగన
స్ఫురణం బురణించునట్లు భూవనిత నిరం
తరచిత్రితయై యొప్పెను
సురచిరనవతృణశిలీంధ్రసురగోపములన్ [2]

నన్నయభట్టు కవిత్వమునందలి చివరి ఘట్టమున భూసతికి శరత్సమాగమమున కలుగు సౌందర్యస్వరూపము చిత్రితమైనది. సురచాపచిత్రగగనస్ఫురణము బురణించు నట్లు భూవనిత నిరంతరచిత్రితయై యొప్పినది.

---

1. ఆరణ్య - 120-41    2. ఆరణ్య - 4-138

సురచాపము గగనమున చిత్రవర్ణములు కలుగజేయునట్లే వర్షాగమనమువలన భూమి సురుచిరనవతృణజాలము, శిలీంధ్రసంతతి, సురగోపబృందమువలన చిత్రవర్ణోపేతమై ప్రకృతి భాసించును. ప్రకృతిసహజమైన వర్ణన కుపయుక్తమైన అలంకారముగా భాసించినను రచనాగతముగా చిత్రవర్ణసముపేతమైనది. వర్షమువలన భూమి నూతనశోభను సంతరించుకొనుట సహజము. శ్రీకృష్ణుడు నిమిత్తమాత్రుడుగా సాగిన భారతకథానిర్వహణములోని చిత్రవిచిత్రరూపములు చూడవచ్చును.

ఈ యలంకారము కేవల తత్కాలవర్ణనవరకే పరిమితముగా వస్తుగతమైన సుందరరూపచిత్రమును ఆవిష్కరించుటకు యోగ్యమైనది. ఇది నన్నయ ఉపమాలంకార ప్రయోగనైపుణికి నిదర్శనము.

ఉ. శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులం
చారుతరంబులయ్యె వికసన్నవకైరవగంధబంధురో
దారసమీరసౌరభము దాల్చి సుధాంశువికీర్యమాణక
ర్పూరపరాగపాండురుచిపూరములం బరిపూరితంబులై.[1]

నన్నయ కవిత్వమునందలి చిట్టచివరి పద్యమిది ఇదియు ఉపమాలంకృతమైనది. శరత్కాలము మనసున కాహ్లాదము కలిగించును. అట్టి శరత్కాలరాత్రులు ఉజ్జ్వలముగా ప్రకాశించు తారకహారపంక్తులతో,వికసన్నవ కైరవ సుగంధబంధురమైన సమీరసౌరభముతో, కర్పూరమువలె తెల్లనైన చంద్రునిచే వెదజల్లబడిన కాంతి ప్రవాహముతో చారుతరములైనవి.

నన్నయ కల్పితమగు స్వతంత్రోపమచే చారుతరమైన ఈపద్యము శారదరాత్రివలె సర్వులకు ఆహ్లాదకరమైనది. నక్షత్రముల కాంతి తెల్లనిది, శరత్కాలరాత్రి సమయమున వికసించినవి తెల్లకలువలు, చంద్రుని వెన్నెలయు తెల్లనిది.

ఇన్ని విశేషణములలో ప్రత్యేకముగా సుధాంశువికీర్యమాణమైన వెన్నెలను కర్పూరపరాగపాండురుచితో పోల్చుట-సత్సభామోదయోగ్యమైన కవిత్వరచనయందు నన్నయ కృతకృత్యుడైనాడని తెలియజేయుటకే. నన్నయ కవిత్వము-వెన్నెలవంటిదే కాక అందు కర్పూరపరాగ, కైరవగంధ, సమీరసౌరభము కూడ నిక్షిప్తమై యున్నది. అది భారతకథాస్వాదనమున కాని అనుభవయోగ్యము కాదు. అందుకై వాచకలుప్తగా దీనిని రచించినాడు.

1. ఆరణ్య - 4-141

భారతమునందనేక ఉపాఖ్యానము లున్నవి. ఆదిపర్వము ఉదంకోపాఖ్యానముతో ప్రారంభమైనది. ఈయుపాఖ్యానము లన్నియు ప్రఖ్యాతి గాంచినవి. నన్నయ ప్రత్యేక ప్రయోజనము నాశించియే వీనిని రచించినాడు. పురుషార్థముల ప్రయోజనమును, అరిషడ్వర్గమువలన సంభవించెడి ఫలితములను పాత్రల మనస్తత్వ సంబంధులైన విషయవివరణములను ఉపకథలందు నిక్షిప్తపరచినాడు. కథాగమనమున కాటంకము కలిగించునట్లు కాక ఆయా సందర్భములందు వీని ఆవశ్యకతయు ప్రయోజనమును భారతార్థమెరిగిన విద్వాంసులు వివరించియున్నారు.

నన్నయ ఈయుపాఖ్యానములను కొన్నిటిని స్వతంత్రకావ్యములవలె వర్ణించినాడు. గరుడోపాఖ్యానము, నలోపాఖ్యానము, దుష్యంతోపాఖ్యానము మొదలగునవి నన్నయ భిన్నశిల్పవిధానమున కుదాహరణములు. అట్లే వీనితో భావికథాంశములను సూచించు ఘట్టములను నిబంధించినాడు. ఉదంకోపాఖ్యానమున—ప్రల్లదుడైన యొక్క కులపాంసను చేసినదానం దత్కులం బెల్లను దూషితంబగుట యేమి యపూర్వమా[1] అని ఉదంకుడు జనమేజయుని సర్పయాగమునకు ప్రోత్సహించినాడు. తక్షకునిపై గల క్రోధము సర్పయాగమునకు హేతువైనది. ఈపద్యమునందు ధ్వనిగా రాబోవు కథావిశేషము తెలియుచున్నది. కౌరవవంశ మంతయు ఒక్క దుర్యోధనుని దుష్టత్వమువలన నాశనమగునన్న విషయము చదువరులకు విదితమగును.

ఈ విధముగా భారతమున ఉపాఖ్యానములు నన్నయ కథాకథనశిల్పమును చాటుచున్నవి. ఉపాఖ్యానముల రచనాశిల్పమున నన్నయ ఉపమాలంకారములప్రయోగమును మూలానుసరణముగను, భావానుసరణముగను అమూలకముగను తీర్చిన విధము ఈప్రకరణమున వివరింపబడినది.

క. పంకజభవసన్నిభుఁ డఘ
పంకక్షాళనమహోతపస్స్పలిలుఁ డనా
తంక మతి పైలశిష్యుఁ డు
దంకుండను మునివరుండు దద్దయు భక్తిన్[2]

పైలశిష్యుడైన ఉదంకుడు గురువువలన అణిమాదికాష్టగుణముల బొంది అపరిమితమైన నిష్ఠతో జ్ఞానము నార్జించినాడు. గురుదక్షిణకొరకై పౌష్యదేవి కుండలములను తెచ్చి గురుపత్నికి సమర్పించెను. ఉదంకుని విశిష్టత యిది.

1. ఆది - 1-125 1. ఆది 1-92

ఆరంభముననే పంకజభవునితో సమానుడని పాపపంకమును క్షాళనము చేసెడి తపస్సనెడి జలము కలిగినవాడని సంబోధించుటలో రాబోవు సన్నివేశములందు ఉదంకుని ప్రజ్ఞాప్రాభవములను ప్రకాశింపజేయుట జరిగినది. అంతటివాడు కనుక తక్షకు ననుసరించి పాతాళమున కేగి సృష్టిక్రమమును దర్శింపగలిగెను. ఇది స్వతంత్రమైనది. ఎక్కడికక్కడే అలంకారము భాసించునట్లుగాను భవిష్యమునకు సూచకముగాను నన్నయ ప్రయోగించుట జరిగినది.

ఉ. నిండు మనంబు నవ్యనవనీతసమానము పల్కు దారుణా
ఖండలశస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు నిక్క మీ
రెండును రాజులందు విపరీతము గావున విప్రుఁ డోపు నో
పం డతిశాంతుఁడయ్యు నరపాలుఁడు శాపము గ్రమ్మఱింపగన్.[1]

నవనీతం హృదయం బ్రాహ్మణస్య వాచి క్షురో నిహిత స్తీక్ష్ణధారః।
విపరీతమేతదుభయం క్షత్రియస్య వాఙ్నవనీతం హృదయం
తీక్ష్ణధారమ్॥ ॥ఇతి॥.[2]

కుండలములు గ్రహించి వెడలుచున్న ఉదంకుని పౌష్యుడు భోజనము చేసి పొమ్మనెను. కేశదుష్టమైన అన్నమును చూచి ఉదంకు డలిగి అంధుడవగుమని పౌష్యుని శపించెను. అల్పదోషమునకు శాప మిచ్చెనని తలచి పౌష్యుడును అనపత్యుడవు కమ్మని ఉదంకుని శపించెను. అనపత్యుడగుటకు ఓపని ఉదంకుడు పౌష్యుని శాప ముపసంహరించుకొనుమనెను. అప్పుడు పౌష్యుడు - బ్రాహ్మణుల మనసు నవనీతమని పలుకు వజ్రతుల్యమని, రాజులందు ఇవి రెండు విపరీతమని పలికినాడు. బ్రాహ్మణునికే సహనశక్తి ఎక్కువ, కనుక అతడే శాప ముపసంహరింప సమర్థుడని చెప్పెను.

ఇక్కడ ఉదంకుని మనసును నవనీతముతో పోల్చుట జరిగినది. నవనీత ధర్మము చెప్పబడలేదు కనుక ధర్మలుప్త యగుచున్నది. అది లుప్తమగుట ఈ సందర్భమున సమర్థనీయమే (నవనీతధర్మము) ఉదంకుని మనోధర్మము దాని వలన కలుగు పరిణామము అనుభవైకవేద్యమే కాని వాచ్యము కానక్కరలేదు.

ఉదంకునకున్న గుణములు పౌష్యునికి లేవు కనుక శాపవిమోచన మనుగ్రహించుటకు తగడు. వెన్నవంటి మనస్సు కరిగినగాని ఉదంకుడు అనుగ్రహింపడు.

1. ఆది 1-100 2. ఆది-3-138

ఉదారస్వభావుడు కనుకనే తనకు విమోచనము లభించకపోయినను పౌష్యుని అనుగ్రహించినాడు. కొద్దిపాటి వేడికి (ప్రార్థనకు) కరుగు స్వభావము వెన్న (మనస్సు)ది. అది స్వభావసిద్ధమైనట్లు పౌష్యుడు ఉదంకుని వేడుకొని శాపవిముక్తుడైనాడు. అల్ప దోషమునకే దారుణాఖండల శస్త్రతుల్యమైన మాటతో శాపమిచ్చినవాడు మనసునందు యోచన చేసి నవనీతమైనాడు.

క. సముదిత సూర్య సహస్రో
పమ దుస్సహతేజు జగదుపప్లవసమయా
సమదీప్తి తీవ్రపావక
సముఁ జూచుచు నసుర భస్మసాత్కృతుఁడయ్యెన్.[1]

తం దృష్ట్వా మాతురుదరాచ్చ్యుతమాదిత్యవర్చసమ్ ।
తద్రక్షో భస్మసాద్భూతం పపాత పరిముచ్య తామ్॥[2]

భృగువను విప్రుడు తన భార్యయైన పులోమను గర్భిణిని ఆశ్రమమందు అగ్నికార్యములు నిర్వహింపుమని చెప్పి తాను అభిషేచనార్థ మరిగినాడు. అంతలో పులోముడను రాక్షసుడు అగ్నిహోత్ర గృహమునకు వచ్చి అగ్నివలన ఆపతివ్రత కలరూపు తెలిసికొని అపహరింపదలచెను. ఆసమయమున పులోమ కుక్షిచ్యుతుడైన బాలకుడు చ్యవనుడైనాడు.

సముదితసూర్యసహస్రోపమతేజుడు, తీవ్రపావకసముడునైన చ్యవనుని జూచి ఆ రాక్షసుడు భస్మసాత్కృతుడైనాడు. 'ఆదిత్యవర్చసమ్' అనుదానికి సముదిత సూర్యసహస్రోపమతేజుడని, తీవ్రపావకసముడని నన్నయ చ్యవనుని ప్రతాపమును తీక్ష్ణతర మొనర్చినాడు. పుట్టుకతోడనే చ్యవనుడు తల్లికి మహోపకార మొనర్చినాడు. చ్యవనుని తీక్ష్ణత్వ మెంతటిదనగా రాక్షసుని భస్మీభూతు నొనర్చినది.

"జగదుపప్లవసమయాసమదీప్తి" చేత ఘోరరాక్షసుడు త్రుటిలో భస్మమైనాడు. భృగువంశమునకే మూలపురుషుడు భృగువు. పులోమ మహాపతివ్రత. ఇట్టివారికి జన్మించిన చ్యవనుడు గొప్ప తేజోవంతుడగుట సహజము.

వ. పులోమయు నక్కొడుకు భృగుకులవర్ధను నెత్తికొని నిజాశ్రమంబునకు వచ్చె మున్నదఱ నారక్కసునకు వెఱచి యక్కోమలి యేడ్చుచుం బోయిన

1. ఆది-1-131 2. ఆది-౬-3

...కృతస్నానుండై భృగుండు సనుదెంచి బాలార్కుండునుంబోని బాలకు నెత్తికొనియున్న నిజపత్నింజూచి యసుర సేసిన యపకారంబున కలిగి... పులోమ యిట్లనియె.[1]

స ఏవ చ్యవనో జజ్ఞే భృగోః పుత్రః ప్రతాపవాన్ ।
తం దదర్శ పితా తత్ర చ్యవనం తాం చ భామినీమ్ ॥ [2]

అగ్నిదేవునివలన "భృగుపత్నియని కలరూ" పెరింగి పులోముడను రాక్షసుడు తొల్లి తాను వరియించినదాని భృగుడు పెండ్లియాడెనని వరాహరూపమున నెత్తికొని వేగముగా చనుచుండగా కుక్షిచ్యుతుడై చ్యవను డుదయించెను. దుస్సహమైన తేజస్సుతో వెలుగు బాలుని చూచుచు రాక్షసుడు భస్మసాత్కృతుడయ్యెను. పులోమ కొడుకు నెత్తికొని నిజాశ్రమమునకు వచ్చిన సందర్భములో మూలమున 'ప్రతాపవాన్' అని కలదు. రాక్షసుని ప్రకృష్టముగా తపింపజేసిన లక్షణము సూచితము. అతడు దగ్ధమగుటకు కారణము బాలుని రూపమందు నిక్షిప్తమైనది. తండ్రియైన భృగువు ప్రతాపవంతుడైన పుత్రుని చూచెను. అను మూలభావమునకు నన్నయ, బాలార్కుని వలెనున్న బాలకు నెత్తికొనియున్న నిజపత్నిని చూచెనని వ్రాసెను.

బాలార్కుడు-అతని నెత్తికొనియున్న నిజపత్ని రెండును ఆలోచనాత్మకములు. బాలార్కు డనుటలో తేజోరూపముతో పాటు శిశుసహజమైన రూపము ఆవిష్కృత మగుచున్నది. ఇప్పుడున్నది-అభిషేచనార్థము తా నరుగునపుడులేని ఆనందస్థితి. అది "భృగుకుల వర్ధను" డామె చంక నుండుట. సంతోషపూర్వకమైన ఆశ్చర్యరూపము మాతృస్థానీయముగా చిత్రితమైనది. బాలకసహితమైన మూర్తి చిత్రణ మీవిధముగా ఈ సన్నివేశమున కందము తెచ్చినవి. ఇచ్చట బాలార్కసాదృశ్యముచే దీప్తియు చేకూరినది. ఇంతవరకు సంతానము లేదు. ఒక విధముగా ఎంత తపస్సంపన్నులైనను ఈలోటు అంధకార సదృశమే. ఈ యంధకారమును పోగొట్టి వంశమును వెలిగించు జ్యోతీరూపము ఆ బిడ్డడు. ఇక్కడ నన్నయ ప్రయోగించిన ఉపమానము కథాగతమైన పాత్ర మనోభావాత్మకముగా కథాంశమును వెలిగించునదిగా నున్నది. ఇతడు జన్మించుటతోనే రాక్షసుడు దగ్ధమైనందున ప్రతాపవంతుడనుట న్యాయమే, "అర్క"శబ్దముతో దీనిని స్ఫురింపజేయుచునే నన్నయ"బాల"శబ్దముచేత శిశుత్వమును ఆపైన దీనిని పొందియున్న మాతృమూర్తిని మెచ్చి తన వాహనమై యుండుమని

1. ఆది - 1 - 132 2. ఆది - 5 - 8.

దర్శింపజేసినాడు. భృగువు మనసును వెలిగించు ఆనందరూపముగా మూలభావాను సరణిగ తీర్చిదిద్దెను.

వ. కని కద్రువ వినతం జూచి చూడవె యల్ల యతిధవళంబైన యశ్వంబు నందు సంపూర్ణచంద్రునందు నల్లయుంబోలె వాలప్రదేశంబునందు నల్లయై యున్నది యనిన విని వినత నగి నీవేకన్నులం జూచితే యక్క యెక్కడిది నల్ల యీయశ్వరాజు మూర్తి మహాపురుషకీర్తి యుంబోలె నతినిర్మలంబై యొప్పుచున్నయది యనిన విని నవ్వి వినతకుఁ గద్రువ యిట్లనియె [1]

శ్వేత ఏవాశ్వరాజోఽయం కిం వా త్వం మన్యసే శుభే ।
బ్రూహి వర్ణం త్వమప్యస్య తతోఽత్ర విపణావహే ॥ [2]

కద్రూవినతలు సముద్రతటమునకు వినోదార్థము జని విహరించు వేళ, కద్రువ వినతతో అక్కడ తిరుగుచున్న ఉచ్చైఃశ్రవమును లక్షించి "సంపూర్ణ చంద్రునందు నల్లయుంబోలె" వాలప్రదేశము నల్లయై యున్నదనెను. దానికి వినత "నీవే కన్నులం జూచితె!" నల్ల యెక్కడిది! ఈ యశ్వరాజుమూర్తి "మహాపురుషుని కీర్తివలె" అతి నిర్మలమై యున్నదని బదులు పలికెను. మూలమునందలి 'శ్వేత' అనుమాటకు "మహాపురుషుని కీర్తియుంబోలె ధవళంబై" యనునది పెంపుదలయే. ఇక్కడ పాత్రల మనః ప్రవర్తన పరిశీలింపవలసి యున్నది. నిజముగా వాలప్రదేశమున నల్ల లేదు. కద్రువ మనసులోని నలుపుదనము ఈ మాటలలో దొరలినది. దీనికి వినత పైఉపమానసహిత వాక్యములు పలికినది. తరువాత వెంటనే కద్రువ సహజస్వభావముతో దాసీత్వము పణముగా పందెము వైచినది. వినత అంగీకరించినది ఆయశ్వమును సమీపింతమనగా కద్రువ ఇప్పుడు ప్రొద్దు లేదు, రేపు చూతమన్నది. చిత్రము! వినత ఒప్పుకొనినది. అశ్వమును చూచినప్పటినుండి కద్రువ ఇంటికి వచ్చి కుమారులను అధర్మారంభమునకు ప్రేరేపించినది. అంగీకరించనివారిని శపించువరకు పోవు మనస్తత్వము ఒక తప్పు. తరువాత మరొకటి, దాని ననుసరించి మరొకటి చేయుటగా సాగినది.

ఈ మోసము సల్లక్షణము కాదు. వినత ఆపై ఉపమానసహితవాక్యము తప్ప కద్రువ మాటలన్నియు అంగీకరించినది. ఈ ప్రవర్తన సల్లక్షణోపేతమైనది. ప్రధానమైన ఒక్క యథార్థవిషయ ప్రపంచమునందు తప్ప తక్కిన విషయములందు దామె మనస్సు ఉపేక్షావహమై కన్పించును. కద్రూవినతలు పరస్పర భిన్నప్రకృతులు

1. ఆది - 2 - 30 2. ఆది - 15 - 3.

కలవారు. వారి చూపులో, ఆలోచనలో, ప్రవర్తనలో ఇది కన్పించును. కథలో సత్కీర్తి ఎవరికి దక్కినది. కొంతకాలము కద్రువకు సేవ చేయవలసి వచ్చినను వినతకే దక్కినది. ఈమె కీర్తి అతినిర్మలమైనది. తరువాత పాములు గరుత్మంతుని వలన జీవితాంతమును భయావహమైన స్థితిని పొందవలసివచ్చినది. ఆదిశేషానంత వాసుకిప్రముఖు లెంతగొప్పవారైనప్పటికి కద్రువవలన వారి కీర్తి నల్లదనముగల చంద్రునివలె నున్నది. ఇక్కడ చెప్పబోవునది సర్పకథాగతమైన భావిరహస్యము. ఆద్యంతము సాగిన సంభాషణ ఆలోచన, ప్రవర్తనలో పాత్రగతమైన దానిని కవి అలంకారమునందు నిక్షేపించి సూచించునట్లు కన్పించును. ప్రకృతము అశ్వరాజు నిర్మలత్వమును వెన్నెలవలె తెల్లగా నున్నదనక "మహాపురుషుని కీర్తి" తో ఉపమించుట నన్నయ గంభీరదృష్టి ఉదాత్తమైన అలంకార ప్రయోగమున కాదర్శమైనది.

క. హరికులిశక్షతి యెఱుఁగని
గురుతరపక్షములతోడి కులగిరి వోలెన్
గరుడుండు గగనగతి నురు
తరజవమున నరుగుదెంచి తల్లికి మ్రొక్కెన్.[1]

తతః కామగమః పక్షీ మహావీర్యో మహాబలః ।
మాతురంతిక మాగచ్ఛత్పరం తీరం మహోదధేః ॥[2]

వినతాపుత్రులలో రెండవవాడు గరుత్మంతుడు. మొదటివాడు వినత తొందర పాటువలన అనూరుడై జన్మించినాడు. తన స్థితికి వగచి తల్లిని సవతికి దాసివి కమ్మని శపించి సూర్యరథసూతుడై అరిగినాడు. పంచశతవర్షములు నిండగా రెండవ అండమునుండి పతంగతేజుడు, తల్లికి మనఃప్రీతి యొనర్చువాడు సుపర్ణు డుదయించినాడు. ఈ పదములు గరుత్మంతుని అపారశక్తిని సూచించునవి. ఇంద్రుని వజ్రాయుధము బారి పడని కులపర్వతమువలె అరుగుదెంచి తల్లికి మ్రొక్కినాడు. ఇంద్రుని బారి పడని పర్వతములలో మైనాకుడు (సముద్రములో దాగియుండుటవలన) క్షతి లేనివాడు. గరుడునికి దాగియుండవలసిన అవసరము లేదు. ముఖాముఖి ఎదుర్కొని విజయమును పొందెను. తల్లి దాస్యవిముక్తికొరకు అమృతము తేవలసి వచ్చినది. సమర్థుడైన పుత్రుడు తలిదండ్రుల ఇక్కట్లు బాపువాడు. అంతటి బలసంపన్నుడైన గరుడుడు దేవతలతో తలపడినాడు. అమృతమును గ్రహించి పోవ నారాయణుడు

1. ఆది-2-40 2, ఆది-18-1, 2

వరమిచ్చెను. ఇంద్రుడు వజ్రాయుధము ప్రయోగించగా దానికి అవమానము కలుగకుండుటకై ఏకపర్ణశకలమును విదల్చినాడు. ఇతనిపై వజ్రాయుధము శక్తి పనిచేసిన తీరు ఇది. 'కామగమః' అనునది గరుత్మంతుని విశేషణము. స్వేచ్ఛాయుతమైన గతి కలవాడని అర్థము. దీనిని వదలి నన్నయ "ఉరుతర జవమున" అని వ్రాసెను. "మహావీర్యో మహాబలః" అనుదానికి 'హరికులిశక్షతి యెరుగని గురుతరపక్షములతోడి కులగిరివోలెన్" అని పౌరాణికకథాస్ఫూర్తిలో స్వతంత్రమైన ఉపమచే గరుత్మంతుని శక్తిసామర్థ్యములు వ్యంజితములు.

ఉ. ఆయతపక్షతుండహతి నక్కులశైలములెల్ల నుగ్గుగాఁ
జేయు మహాబలంబును బ్రసిద్ధియునుం గల నాకు నీపనిం
బాయక తొమ్మనందవడుఁ బాముల మోవను వారికిం బనుల్
సేయను నేమికారణము సెప్పుము దీనిఁ బయోరుహాననా.[1]

అంతటి శక్తిసంపన్నుడైన గరుడుడు కూడ కద్రువ పంచిన పనులెల్ల వినత యనుమతంబున నతివినయపరుడై చేయుచుండెను. ఒకనాడు సప్తాశ్వమండలమునకు గరుడు డెగయ అతని మూపుపైనున్న యురగులు నేలబడియు మూర్ఛనొందిరి. కద్రువ కడు నలిగి గరుడనిం బదరి అతిభక్తి నింద్రునారాధించి పర్జన్య ప్రసాదమున మహావృష్టి వారిపై కురిపించి విగతపరితాపుల జేసినది. ఇంకను గర్వమున గరుడుని వినతనుం బనులు గొనుచుండెను. అప్పుడు కాని గరుడునికి సందేహము కలుగలేదు. తానెంత బలవంతుడో చెప్పి, ఈపాములకు కద్రువకు తాముదాస్యముచేయుటెందుకని తల్లినడిగెను. ఆసందర్భమున వినతను 'పయోరుహాననా'అని సంబోధించెను, ఈసంబోధన ముచితము కాదని కొందరి వాదము. గరుడుని అవిధేయతగా చిత్రించవలెనో, లేక నన్నయ ప్రయోగమందలి పొరపాటుగా, భావించవలెనో అని పెద్దల వివాదాంశము. అందున ఇది నన్నయ స్వతంత్రముగా ప్రయోగించిన వాచకలుప్తోపమాలంకారము. విపులశబ్దశాసనుని ప్రయోగమును సహృదయులు ఉచితానుచితము లెరిగి వ్యాఖ్యానించవలెను. 'పయోరుహాననా'! అన్న గరుడుని అభిప్రాయమును ఈవిధముగా భావించవచ్చును. పుత్రుని చూడగనే తల్లి తన బాధ నంతయు మరచి ఆనందవీచికలు మోమున కన్పించగా పయోరుహానన బనది. రాత్రి అగుటతో పద్మము ముకుళించుకొనిపోవును. సూర్యోదయమున కాని వికసింపదు. వినతకు సూర్యునివంటివాడు గరుడుడు. చూడగనే పయోరుహానన బనది. తన బాధ జ్ఞప్తికి వచ్చిన ఆమె మోము ముకుళించుకొని

1. ఆది - 2 - 48.

పోవును. లోకప్రసిద్ధమైన-లోకబాంధవుని పద్మము మిత్రత్వమును ఇక్కడ నన్నయ్య గరుడునికి, వినతకు ఆపాదించినాడు. తెలియక చేసిన ప్రయోగము కాదిది. అంతకుమునుపే గరుడుని జననవేళ "తార్క్ష్యుఁడు తల్లికిన్ మనఃప్రీతి యొనర్చుచున్ నెగసె" (37) అని వినత హృదయమును ఆనందపరచువానిగా గరుడుని వర్ణించినాడు. ఆ హృదయవికాసము పుత్రదర్శనసందర్భమున మోమున వెల్లివిరిసి పయోరుహానన ఐనది. అంతగా సంతోషించెడి తల్లికి దాస్యమునుండి విముక్తి కలిగించవలెనన్న కోరిక గరుడునికి కలుగుటలో ఆశ్చర్యములేదు. కేవలము సంబోధన యందున్న ఉపమాలంకారమున నన్నయ ఇట్టి పరమార్థమును భద్రపరచినాడు.

క. రయమున మ్రింగుడు గాలము
క్రియ నెవ్వఁడు కంఠబిలము క్రిందికి జన క
గ్నియపోలె నేర్చుచుండును
భయరహితా వానినెఱుఁగు బ్రాహ్మణుఁ గాగన్. [1]

యస్తే కంఠబిలం ప్రాప్తో నిగీర్ణం బడిశం యథా ।
దహేదంగారవత్పుత్ర తం విద్యాత్ బ్రాహ్మణర్షభమ్ ॥ [2]

అమృతము తెచ్చుటకు బయలుదేరిన గరుడునికి వినత హిత ముపదేశించినది. గరుడునికి తగిన ఆహారమును, భక్షణవిషయమున బ్రాహ్మణుని పరిహరించు విధమును తెలిపినది. తినునప్పుడు కాని గరుడునికి ఏ పదార్థము ఎటువంటిదో తెలియదు. బ్రాహ్మణుని విషయమున గాలమువలె కంఠబిలము క్రిందికి చనదని, అగ్నివలె దహించునని - వినత బ్రాహ్మణస్వభావమును గరుడునికి ఎఱుకపరచినది. గరుడుని విషయమున దహించినను వెనుదీయని స్వభావము కలవాడు కనుక 'భయరహితా' అని సంబోధించి అట్టి వానిని వదలివేయు మనినది. బ్రాహ్మణులు నిత్యాగ్నిహోత్రులు. అట్టివారు అగ్న్యంశకలవారు కనుకనే తద్రూపస్వభావములు కలిగినవారు. విప్రుని ఆశీస్సు పుత్రునికి లభించవలెననియే వినత ఆశయము కాని వరాక్రమవంతుడు కనుక యోచన లేక ప్రవర్తింపుమని కాదు.

ఇక్కడ ఈ పద్యము నన్నయ బ్రాహ్మణస్వభావవివరణముకొరకు సంస్కృతము నందున్నదానిని యథాతథముగా వివరించినాడని చెప్పవచ్చును. పరిపూర్ణమైన బ్రాహ్మణ తత్వమును తెలిపెడు మాట కనుక పూర్ణోపమను వాడినాడు.

1. ఆది - 2 - 60 2. ఆది - 20 - 18.

వ. అని బ్రాహ్మణ స్వరూపంబుఁ జెప్పిన నెఱింగి వినతకు మ్రొక్కి వీడ్కొని గరుడుం డతిత్వరితగతిం బఱచి సముద్రోదరంబున నున్న నిషాదుల ననేక శతసహస్రసంఖ్యలవారిం బాతాళవివరంబునుం బోని తన కంఠ బిలంబుఁ దెఱచి యందఱ నొక్కపెట్ట మ్రింగిన నందొక్క విప్రుండుండి కుత్తుకకు డిగక నిప్పునుంబోలె నేర్చుచున్న నెఱింగి ..[1]

తస్య కంఠమనుప్రాప్తో బ్రాహ్మణః సహ భార్యయా ।
దహన్ దీప్త ఇవాంగార స్తమువాచాంతరిక్షగః ॥[2]

భక్షణవిషయమున తల్లి బోధించినట్లు బ్రాహ్మణుడే అడ్డు పడినాడు. పాతాళ వివరమును బోలిన కంఠబిలమందు నిషాదులందరు ఒక్కసారిగా పడినను బ్రాహ్మణుడు మాత్రము నిప్పువలె నేర్చుచు గరుడుని వివేచనమును మేల్కొల్పినాడు. కంఠబిలము వెలువడుమని ప్రార్థింపగా అపవిత్రమైన నిషాది భార్యకొరకు బ్రాహ్మణుడు సందేహించినాడు. అప్పుడు గరుడుడే విప్రుల పొందియున్న అప విత్రులను పూజ్య లగుదురని ఇరువురిని వెలికి రమ్మనినాడు. సాటిలేని బలపరాక్రమ ములు కలిగిన గరుడుని కంఠబిలము పాతాళవివరమును బోలినది. నారాయణునికి వాహనమైనవాని విశ్వరూపమును వర్ణించియే బ్రాహ్మణతేజము అధికము కనుక నన్నయ గరుడుని కంఠమందే దానిని అడ్డుపడినట్లు వర్ణించినాడు. అంతటి ప్రతిభా వంతుడైన బ్రాహ్మణుడును గరుడుని అనుగ్రహమున నిషాదీసహితుడై వెలువడి గరుడుని దీవించి యథేచ్ఛగా వెడలినాడు. కార్యారంభమున బ్రాహ్మణుని దీవన లభించినది. వినత అభిమతముసు నెరవేరినది.

క. బలవత్ఖగేంద్ర కోపా
నలభస్మీభూతుడై క్షణంబున వాడున్
బలమఱి క్రాగె నుదగ్ర
జ్వలనజ్వాలావలీఢశలభము పోలెన్.[3]

స తేన పతగేంద్రేణ పక్షతుండనఖైః క్షతః ।
ముహూర్తమతులం యుద్ధం కృత్వా వినిహతో యుధి ॥[4]

---

1. ఆది-1-62 2. ఆది-21-1

3. ఆది - 2 - 97 4. ఆది - 24 - 4

గరుడుడు అమృతార్థియై వచ్చి అమృతరక్షకులతో తలపడినాడు. అమరవరుల దృష్టి చెదరునట్లు పక్షానిలము రజఃపూరితమై వ్యాపించినది. అట్టి సందర్భమున భౌమనుడను కింకరుడు పరశు, కులిశ, కుంత, ప్రాస, బాణాసనాద్యాయుధములతో గరుడుని ఎదిరించెను. భౌమనుని యుద్ధారంభమే అధికముగా వర్ణింపబడినవి. కాని గరుడుని తాకిన మరుక్షణమే వాడు ఉచగ్రగజ్వలనజ్వాలలచేత అవలీఢమైన శలభము వలె నైనాడు. ఇంద్రుని వజ్రాయుధమును సైతము ధిక్కరించిన గరుడుని కోపానలము వానిని భస్మీభూతము చేయగలిగిన శక్తి కలది. కొద్దిసేపు పోరాటమైనను గరుడుని శౌర్యమునకే అవమానము. తగిలియు తగులకమునుపే వాడు భస్మమగుట గరుత్మంతుని పరాక్రమమునకు పరకాష్ఠదశ. దేవేంద్రుడంతటివాడు నిస్సహాయుడైనపు డితరుల పరాక్రమవిశేషములు గరుడునికి లెక్కలోనివి కావు. మూలమునందు లేని ఈయంశము ఉపమయందు పాత్రగతమై సముజ్జ్వలరూపము నొందినది. ఇది - నన్నయ అగ్నిగతమైన వైదికభావనారీతిని ప్రకటించుచున్నది.

క. వాలుపయి నడచున ట్ల
బ్బాలిక నడునడనడుంగి భయమున నియమా
భీలుఁడగు పతికిఁ బవలున్
రేలును నేమఱక పరిచరించుచు నుండెన్.[1]

పితృపితామహుల ఊర్ధ్వగతికొరకు జరత్కారుడు సనామధేయురాలైన జరత్కారును వివాహమాడెను. వివాహమునకు ముందుగానే తన నియమమును తెలిపెను. ఎన్నడైన తనకు అవమానము జరిగినయెడల భార్యను విడిచిపెట్టెద ననెను. జరత్కారుడు సామాన్యుడు కాడు. పరమ తపోనిధి, లోకోత్తరుడు, బ్రహ్మచర్యవ్రతదీక్ష గలవాడు. అట్టివాడు కేవలము పితృపితామహుల సుగతికొరకే వివాహధర్మము స్వీకరించి నాడు. అట్టివాని పట్ల ఎట్లు ప్రవర్తించవలెనో జరత్కారు వెరుగును. వాలుపయి నడచునట్లు, నియమాభీలుడయిన పతికి రేయింబవలు సేవచేయుచుండెను. ఇక్కడ నన్నయ వాడిన ఉపమానము అపూర్వము, అర్థవంతము. దోష మొనర్చినవారి పట్ల కొద్దిపాటిశిక్షను విధించుట న్యాయసమ్మతము. క్షమకలిగియుండుట ఉత్తముల లక్షణము. కాని జరత్కారుడు పరిత్యాగమునే విధిగా నియమించుకొన్నవాడు. అట్టివానితో జీవనము వాలుపై నడకయే. ఏమాత్రము ఏమరుపాటు కలిగినను శిక్ష కడు భయంకరము. వాక్కు నుపమించునపుడును వాలుతో తుల్యత్వము నాపాదించుట కలదు. అట్టిచో

1. ఆది - 2 - 154

జరత్కారు తన ప్రవర్తనను వాలుపై నడకవలె ఏమరక వర్తించె ననుట నన్నయ స్వతంత్రోపమానము.

వాలుపయి నడకవంటిదే ఐన ఘరొక ప్రయోగము అసిధారావ్రతమని లోక వ్యవహారమునందు కలదు. అసిధారావ్రత మనగా కత్తిమీద నిలుచుటవలె లేదా కత్తిని నిలిపి ఆచరించు పరమకఠోరమైన వ్రతచర్య. ఇది అవలంబించుటకు దుష్కరమైనది. ఒక పని చేయుటలోని అసాధ్యమైన లక్షణమును ప్రకటించుటకు ఈ పలుకుబడి నుపయోగింతురు. ఈ వ్రతమునకు సంబంధించిన మరియొక అంశము– పురుషుడు వ్రత మవలంబించినపుడు ఏకశయ్యాగతయైన స్త్రీని స్పృశించకుండ మనస్సును స్థిరముగా చేసికొని వర్తించు బ్రహ్మచర్యమును తెలుపునది. ఒకే శయ్యపై నున్నపుడు స్త్రీ పురుషులు ఇరువురి నడుమ కత్తిని పెట్టుకొని నిద్రింతురు. ఆ కత్తిని తాకిన వ్రణిత మగునన్న భయము వారి మనస్సులను వ్రతముపట్ల జాగరూకులుగా నుంచును.

అసిధారావ్రతమనగా స్థూలముగా కఠోరమైన దుష్కరమైన వ్రతమును కఠిన నియమముతో స్థిరచిత్తముతో నవలంబించుటయే ఈ పలుకుబడిని పైభావమునం దుపయోగించుట కలదు.

క. అనవరత భక్తిఁ బాయక
తనపతికిం బ్రియము సేసి తద్దయు గర్భం
బనురక్తిఁ దాల్చి యొప్పెను
దినకరగర్భయగు పూర్వదిక్సతి వోలెన్.[1]

తత్ర తస్యాం సమభవద్గర్భో జ్వలనసన్నిభః ।
అతీవ తపసా యుక్తో వైశ్వానరసమద్యుతిః
శుక్లపక్షే యథా సోమో వ్యవర్ధత తథైవ సః ॥[2]

జరత్కారు వర్ణనమిది. ఆమె దినకరగర్భ యగు పూర్వదిక్సతివలె ఒప్పారెను. దివకరుడు – దివంకరోతీతి దినకరః–వీని రాకతో రాత్రి పోవును; దినము వచ్చును. సర్పముల కితని జన్మవల్లనే జనమేజయు డొనరించు సర్పయాగమునుండి విముక్తి కలిగినది. వారల దుఃఖసమాప్తికి ఆనందప్రాప్తికి హేతువయినాడు. కావున ఈ యలంకారమునం దుపమానమైన దినకరశబ్ద మొంచుట తగియున్నది.

1. ఆది - 2 - 155    2. ఆది - 39 - 13, 14

అగ్ని, సూర్యుడు భారతీయతత్వ ప్రపంచమునందు ఇంచుమించు సమానార్థకములే. మరొకటి అనలశబ్ద మితని తేజోరూపమును దర్శింపజేయునది. ఇతడు సర్పయాగ మణచుటకు వచ్చినవాడు. స్వదేహకాంతిచే సభాంతరము వెలిగించెను. ఇక్కడ చెప్పబడునది ఉపమాలంకార నిక్షిప్తమైన గర్భస్థవర్ణనమందుగల దినకరగతమైన, తేజోరూపము. తరువాత - కథాగతమైన, అవసరమైన, ప్రధానమైన స్థలములందు ప్రవేశపెట్టు అలంకారము, అలంకారముగా కాక కథాగితాంశములపై కాంతిప్రసార చిహ్నములుగా చూడవచ్చును.

వ. అనిన నమ్మునికుమారుని సుకుమారత్వంబును వినయప్రియవచనమృదు మధురత్వంబును నవవరత నియమవ్రత ప్రకాశిత ప్రశాంతత్వంబునుం జూచి శుక్రుం డతిస్నేహంబున వీనిం బూజించిన బృహస్పతిం బూజించిన యట్లయని యభ్యాగతపూజల వాని సంతుష్టుంగాఁ జేసి శిష్యుంగాఁ జేసికొని యున్నంత నక్కచుండు.[1]

> కచ స్వాగతమద్యాహ మభిగృహ్ణామి తే వచః ।
> అర్చయిష్యేఽహమర్చ్యం త్వామర్చితోఽస్తు బృహస్పతిః ॥[2]

దేవాసురరణమున గతజీవితులగు అసురులను వారి కాచార్యుడైన శుక్రుడు మృతసంజీవని విద్యచే బ్రతికించుచుండెను ఆ విద్య తెలియని దేవతలు మృతసంజీవని బడసి తేనోపునట్టి మహాసత్త్వు డెవ్వడని ఆలోచించి బాలుడును నియమవ్రతశీలుడును తపశ్శ్రీవిభవుడును ఐన బృహస్పతి పుత్రుని కడకేగిరి. కచునికి పరిస్థితి వివరించి శుక్రాచార్యుని కడకేగి అతని నెమ్మి బడయుమనిరి. దేవహితార్థమై కచుడు శుక్రుని వద్దకు వెళ్ళి తనను తాను పరిచయ మొనర్చుకొని "శిష్యవృత్తి పని చేయుగ వచ్చితి" ననెను. అతని సౌశీల్యము, వినయప్రియవచన మృదుమధురత్వమును, అనవరత నియమవ్రత ప్రకాశిత ప్రశాంతత్వంబును చూచి శుక్రునికి ఆనందము కలిగినది. రాక్షసాచార్యుడు శుక్రుడు. మహావిద్యా సంపన్నుడు. దేవగురువైన బృహస్పతి పుత్రుడు కచుడు. దేవతలందరిచేత సంజీవనీవిద్య తెచ్చుటకు మహాసత్త్వుడని భావించబడిన కచుడు శుక్రాచార్యునికి ఇన్ని విశేషగుణములు గలవానిగా భాసించుటలో ఆశ్చర్యము లేదు. ఇన్ని గుణములు పుంజీభూతమైన స్వరూపమునుచూచి "వీనింబూజించిన బృహస్పతిం బూజించిన యట్ల" యని అభ్యాగతపూజల వాని సంతుష్టు నొనర్చి శిష్యునిగా స్వీకరించెను.

---

1. ఆది - 3 - 109 2. ఆది - 60 - 21

భావికథాసూచకముగా ఈ ఉపమాలంకార ప్రయోగమును నన్నయ ఉపయోగించెను. చూడగనే శుక్రుని ఆకర్షించిన కచునికి మృతసంజీవనీవిద్య తప్పక లభించునని గ్రహించవచ్చును. ఆ విద్యకు అర్హుడు కనుకనే శుక్రునిచేత అభ్యాగతపూజల నందినాడు. అసురుల కాచార్యుడైనను తన శిష్యులలో సంజీవనీవిద్యకు పాత్రుడైనవాడు శుక్రునికి లభించలేదు. అసురులకు శత్రువులైనను దేవతల ప్రతినిధి ఐన కచుని ఉత్తమలక్షణ ముల నెరిగి స్వీకరించినాడు ఇరుపక్షముల ఆచార్యులకు ఒకరిపట్ల ఒకరికి గౌరవము, సదభిప్రాయము, అభిమానము ఉన్నవనిన విషయము కచుని పూజించుటతో విదిత మగును. శిష్యస్థానమున ఉన్నవాడైనను సురగురుని పుత్రునిలో తాను దర్శించిన మహోన్నతగుణములకు సంతసిల్లిన శుక్రుడు కచుని పూజించిన బృహస్పతిని పూజించి నట్లే యనుకొనెను. మూలమున కుపస్కారకమైన ఈ యలంకారము కచుని మహోన్నత వ్యక్తిత్వమును, శుక్రుని సహృదయత్వమును భావింపజేయుచున్నది.

క. ఉదరభిదాముఖమున న
భ్యుదయముతో నిర్గమించె బుధనుతుడు కచుం
డుదయాద్రి దరీముఖమున
నుదితుండగు పూర్ణహిమమయూఖుడ పోలెన్.[1]

గురోః సకాశాత్సమవాప్య విద్యాం
భిత్వా పార్శ్వం నిర్విచక్రామ విప్రః ।
కచోఽభిరూపో దక్షిణం బ్రాహ్మణస్య
శుక్లాత్యయే పౌర్ణమాస్యామివేందుః॥[2]

బృహస్పతిపుత్రుడైన కచుడు దేవతల ప్రార్థన ననుసరించి మృతసంజీవనీ విద్యకొరకు రాక్షసగురువైన శుక్రాచార్యునివద్ద శిష్యుడుగా చేరెను. అసురులు కచునిపై పగగొని అతడు పూలకై వనమునకు జనినపుడు వానిని చంపి కాల్చి బూడిద చేసి సురలో కలిపి శుక్రునిచే త్రావించిరి. దేవయాని పరమ దుఃఖిత కాగా ఆమె తండ్రి ప్రసన్నుడై జరిగినదంతయు దివ్యదృష్టిచే కనుగొని కచుని సంజీవితుని చేసెను.

అపుడు కచుడాతని ఉదరమునుండి "నేను నీ ప్రసాదమున సంజీవితుడనై నిర్గ మించు మార్గ మేమి" యనెను. శుక్రుని ఉదరము భేదిల్లిన గాని కచుడు బయటకు రానేరడు. ఉదరభేదనమువల్ల మూర్ఛితుడైన తనను సంజీవితుని చేయుటకై కచునికి సంజీవనీవిద్య నుపదేశించెను.

1. ఆది - 3 - 125    2. ఆది - 80 - 65

ఇక్కడ - మూలమునందు గురుని నుండి సంజీవనీవిద్యను చక్కగా పొంది పార్శ్వమును భేదించుకొని శుక్లపక్షాంతమందు పౌర్ణిమాచంద్రునివలె నావిప్రుడు బయటకు వెళ్ళెనని కలదు.

ఇందు ఉదరభిదాముఖమున నభ్యుదయముతోనని ఉదయాద్రి దరీముఖముననని ఉపమేయోపమానములను కల్పించెను. శుక్రుని ఉదరమును ఉదయాద్రిగాను, భేదిల్లిన రంధ్రను దరీముఖముగాను భావించెను. ఇతని యాగమనము పూర్ణిమాచంద్రునివలె నున్నదన్న మూలములోని అలంకారము అత్యంతోచితమైనది.

అసురులు చంపి సురతో కలిపినప్పటి కచునకును ఇప్పు డుదరనిర్గతుడగు కచునకును ఎంతో భేదము కలదు. ఇది దేవతల మహాకార్యము సాధించుటకు వలసిన మహాసత్వలక్షణము[1] తపశ్శ్రీ విభవత్త్వము[2] నియమవ్రతశీలత్వము[3]లతో కూడిన అమేయమైన వ్యక్తిత్వము. ఇవి సంజీవనీవిద్య శుక్రుని నుండి పొందుటకు కావలసిన ప్రధానమైన అర్హతలు. కచునిలో ఇవి పూర్వమే యున్నవి. శుక్రుని సేవతో అవి దీప్తిని పొందినవి. దీప్తిలక్షణము "ధర్మజ్ఞుడు" "మహాత్ముడు" "బ్రహ్మచర్య వ్రతాశ్రమ సంపన్నుడు" అన్న దేవతల మాటలలో సువ్యక్తము.

ఇపుడో సంజీవనీవిద్యాసంపన్నుడు. సంజీవని మృతులను బ్రతికించు అసాధారణశక్తి కలది. మూలమునందీ హ్లాదమైన అమృతమయమయిన శక్తిని ప్రభావవంతముగా పౌర్ణిమాచంద్రుడనుట అత్యంతోచితముగా నున్నది. నన్నయ హిమమయూఖు డనుటతో అదే అభిప్రాయము ఆవిష్కారరూపములో కొంచెము భేదమును పొందినది. కచుడు ఛేదించుకొని వచ్చినప్పుడు సంజీవనీవిద్య ప్రసారరేఖల మూర్తిత్వమును హిమమయూఖములందు నన్నయ భాసింపజేసినాడు. గర్భమునుండి మెల్లమెల్లగా వచ్చునప్పటి స్థితిలో అతని శక్తిప్రసారరేఖలు క్రమముగా చిత్రితమైనవి. ఇది, బింబప్రతిబింబభావోపమయందు సంఘటనాక్రమమును రమణీయముగా చిత్రించు నన్నయ వర్ణనాశక్తిని వెలార్చుచున్నది.

తే. విగతజీవుడై పడియున్న వేదమూర్తి
యతనిచేత సంజీవితుడై వెలుంగె
దనుజమంత్రి యుచ్చారణదక్షుచేత
నభిహితంబగు శబ్దంబునట్ల పోలె.[4]

---

1. ఆది - 3 - 102
2. ఆది - 3 - 105
3. ఆది - 3 - 106
4. ఆది - 3-127

దృష్ట్వా శయానం బ్రాహ్మణం బ్రహ్మరాశిమ్
ఉత్థాపయామాస మృతం కచోఽపి ।
విద్యాం సిద్ధాం తామవాప్యాభివాద్య
తతః కచ స్తం గురుమిత్యువాచ ॥[1]

మూలమునందు - మృతుడై క్రిందపడియున్న ఆ బ్రహ్మరాశి యగు శుక్రుని చూచి కచుడు జీవింపజేసెను, అని కలదు. దీనిని నన్నయ రెండు పాదములలో దాదాపు ఈ యర్థమే ప్రఖ్యాత మగునట్లు వ్రాసి ఆ తరువాత కచునికి సంజీవనీవిద్యామహార్హతను భావింపజేయు ఉపమాలంకారము ప్రయోగించెను. బ్రహ్మరాశి యనుదానికి వేదరాశి యని నన్నయ రెండిటికి నభేదము కల్పించెను. తాత్పర్యతః రెండును ఒకటే. బ్రహ్మమనగా వేదము, తపస్సు అనియు అర్థము కలదు. వేదముల రాశీభూతరూపము శుక్రుడు విగతజీవుడైనాడు మరల సంజీవనీవిద్యాప్రభావముచేత సంజీవితుడైనాడు. ఇంతకుముందు నెలకొన్న ప్రేతఃకళ పోయి దాని స్థానమున వచ్చిన చైతన్యరేఖలు "వెలిగె" నన్న మాటలో స్ఫురించుచున్నది.

ఈ కథాంశమును క్రింది ఉపమానము ఉజ్జ్వలితము చేయుచున్నది. ఉచ్చారణా దక్షునిచేత అభిహితమైన శబ్దమువలె చైతన్యవిలసితుడైనాడు. శ్రుతి శబ్దప్రమాణము కలది. అది ఉచ్చరితమగునే కాని వ్రాయబడదు. ఉచ్చారణలోని లోపము కీడును కలిగించును. కావున దానికి దక్షత అవసరము. పరమశక్తిసంభృతములైన వేదమంత్రములు స్వరసహితము పఠించుట సామాన్య విషయము కాదు. ఇక్కడ సంజీవనీవిద్యోపదేశము తరువాత కచుడు తొలిసారిగా ప్రయోగించుచున్నాడు. కావున జాగరూకత ఎంత అవసరమో వేరుగా చెప్పనవసరము లేదు. పైగా "అనవరత నియమవ్రత ప్రకాశిత ప్రశాంతత్వము" చేత శుక్రుని "నెమ్మి" వడసి ప్రియశిష్యుడై మెలగినాడు. అంతరమైన మనోధర్మము దృఢమైన ప్రేయోస్థానము వహించినది. కచుడు గురునినుండి అభ్యసించిన శబ్దరూపమైన మంత్రము ఉచ్చారణదక్షతతో, జాగరూకతతో త్రికరణశుద్ధిగా భావించి గురుప్రాణములపై కేంద్రీకరించి, సంజీవనీ విద్యాప్రభావముచేత పునర్జీవింపజేసిన విధము ఈ యలంకారమునందు నిక్షిప్తమైనది. శుక్రుడు మరల "వెలుగు"టకు కచుడొనర్చిన ప్రయత్నము మహిమాపూర్ణమైనది.

1. ఆది - 6.-66

శబ్ద స్వరూపము చక్కగా తెలిసికొని ప్రయోగించినచో అతడు (కచుడు) స్వర్గలోకమునందు కామధుక్[1] అగును. సుష్ఠుప్రయుక్తమగు శబ్దమే కామధుక్, కామధుక్ అనగా కామధేనువు. కోరికలు పితుకునది. కల్పతరువు కూడ కావచ్చును. దీనియందు కోరిన కోరికలు ప్రసాదించగల అసాధారణమైన శక్తి కలదు. అక్షరములు వాని సంయోజనములోని విలక్షణతవల్ల ఒక శక్తి యుద్భవించును. కొన్ని శబ్దముల సమాహారభూతమైన వాక్యమునం దీశక్తి వ్యాప్తమైయుండును. ఇది ఉచ్చారణా లక్షణమువలన శక్తినిభృతమై ప్రసరించును. ఈ ప్రసరణము తపోవిభత్వము వలన లక్ష్యమునుబట్టి సిద్ధించును. శబ్దముయొక్క సారము నాదము. స్వరసహితముగా మంత్రము పఠించునపు డుద్భవించు తరంగము నాదమయమై భాసించునని గుర్తించవలెను. నాదప్రపంచమే సంగీతము. వేదాభ్యాసుడైన తపోమూర్తిచేత ఉచ్చరితమైన శబ్దము నాదమయమై మంత్రగతమైన ప్రభావమును కలిగియుండును. ఆహృతి, సంహృతి, విహృతి యను వివిధస్థానములనుండి బహిర్గతమై సూక్ష్మదశలలో ఆకాశమునందు ప్రయాణించిన శబ్దము అత డుద్దేశించిన లక్ష్యమును పొంది ప్రభావమును పొందును.

నన్నయ-అవిరళజపహోమతత్పరుడు, సంహితాభ్యాసుడు కావున ఈ పరమార్థ మును దృష్టిలో నుంచుకొని వ్రాసెననుటలో సామంజస్యము కలదు.

చ. వలయు నమాత్యులం దగినవారల నుండగ బంచి ధారుణీ
తలవిభుఁ డొక్కరుండ చని తన్విఁ బయోజదళాయతాక్షి సం
కులమిళితాళినీలపరికుంచితకోమలకుంతలన్ శకుం
తలయను కన్యకం గనియెఁ దన్మునివల్లభు మందిరంబునన్.[2]

శ్రుత్వాఽథ తస్య తం శబ్దం కన్యా శ్రీరివ రూపిణీ ।
నిశ్చక్రామాశ్రమాత్తస్మాద్యథా విద్యుత్ ఘనాంతరాత్ ॥[3]

మృగయావినోదార్థియై వెడలిన దుష్యంతునికి పుణ్యనదీతీరమున నున్న కణ్వుని యాశ్రమము గోచరించినది. అక్కడ వినవచ్చెడి సామగానాది ఘోషలును, వైరము

1. సమ్యక్ జ్ఞాతః సుష్ఠు ప్రయుక్తః శబ్దః స్వర్గే లోకే
కామధుక్ భవతి - నిరుక్తము - 1 - 10.

2. ఆది - 4 - 25 3. ఆది - 82 - 3

మాని సఖ్యము కలిగిన జంతువర్గమును చూచుచు మునిశక్తి కెంతయు చోద్యమంది "కణ్వునికి నమస్కరించి వచ్చెద"నని తన అమాత్యుల నక్కడే ఉండబనిచి తానొక్కడు ఆశ్రమములోనికి ప్రవేశించినాడు. ప్రవేశించినవానికి శకుంతలయను కన్యక-తన్వి, పయోజదళాయతాక్షి సంకులమిళితాళినీలపరికుంచితకోమలకుంతల-గా దర్శన మిచ్చినది. కణ్వుని కొరకై వచ్చినవానికి శకుంతల దర్శనము ఆకర్షణీయకముగా గోచరించినది. ఆయాకర్షణ పయోజదళాయతాక్షి, సంకులమిళితాళినీల పరికుంచిత కోమలకుంతల అన్న ప్రయోగములలో చూడవచ్చును.

తన్వియైన శకుంతలయందు ఇట్టి ఆకర్షణను నన్నయ నిక్షిప్తపరచినాడు కనుకనే దుష్యంతుని మనసున శకుంతలపట్ల ఆసక్తి కలుగుటకు హేతువును సులభ ముగా గ్రహింపవచ్చును. మూలమున "యథా విద్యుత్ ఘనాంతరాత్" అన్నది ఒక్క సారిగా మెరసి కన్నులు మిరుమిట్లు గొలుపు సౌందర్యాపాదకప్రయోగమైనది. నన్నయ దుష్యంతుని హృదయమున శకుంతలాదర్శనము, తరువాత పోనుపోను హృదయమందు ఆసక్తిని అనురాగమును నిక్షిప్తపరచినాడు. కనుక చూచియు చూడగానే దృగ్గోచరమైన తన్వి ఆకృతివిశేషమునందు అక్షి, కుంతలములందు విలక్షణ మైన ఆకర్షణను అలంకృత మొనర్చినాడు. తరువాత వచ్చు సంభాషణమున-సర్వ లక్షణలక్షితంబులయిన సర్వావయవంబులుం జూచి "సంచలిత హృదయుండై"యన్న వాక్యములోని పరమార్థము సులభముగా అర్థమగుచున్నది. మొదట ముఖసౌందర్యము చేత ఆకర్షింపబడినవానికి తరువాత సమాహారభూతమైన తక్కిన సౌందర్యరూప దర్శనము కలుగును. దుష్యంతునికి సంచలితుని జేయుటలో సూక్ష్మమైన ముఖపరి శీలనావ్యాప్తమైన మనస్తత్వము కలదు. ఇది దృక్ స్ఫూర్తినుండి స్తిమితమునొందిన మనోదశకు చెందినది.

వ. అదియును ననంతవిలాసంబున జయంతుండ పోని దుష్యంతు నెఱింగి యతిసంభ్రమంబున నాసనార్ఘ్యపాద్యాదివిధులం బూజించి కుశలం బడిగి యున్న నక్కన్యకం జూచి దుష్యంతుం డిట్లనియె.[1]

సా తం దృష్ట్వైవ రాజానం దుష్యంత మసితేక్షణా ।

... ... ... ...

సా తమాయతపద్మాక్షం వ్యూఢోరస్కం సుసంహతమ్ ॥[2]

---

1. ఆది - 4 - 26 2. ఆది - 82 - 4, 5

తండ్రివంటి తాపసులను తప్ప రాజవేషముతో నున్నవారిని శకుంతల చూచి యుండలేదు. తండ్రివద్ద చదువు నేర్చినపుడు ప్రసంగవశమున వచ్చిన వర్ణనలు వినియున్నది. దుష్యంతుని చూడగనే జయంతునివలె ఉన్నాడనుకొనినది. అందుకే అతిసంభ్రమముతో ఆతిథిసత్కార మొనర్చినది. మొత్తము రూపవిశేషమును చూచి జయంతు డనుకొని సంభ్రమ మొందుటలో విశేషము కలదు. శకుంతల కారణ జన్మురాలు. కణ్వమహర్షి ఆశ్రయముననున్న తపస్విని. అట్టిదానికి మనసునందు సంభ్రమము కలుగుటకు కారణము జయంతునివంటి దుష్యంతుడు.

"నన్నయగారి శకుంతల నిశ్చయజ్ఞానము కంది. తానెందుకు జన్మించినదో తనకు తెలియును. తన జన్మపరమార్థ మేమనగా అతనియందు భరతచక్రవర్తిని కనుట."[1] అందువల్ల అతడీమె మనసు సంభ్రమింప జేసినాడు. తనకు భర్తకాబోవు దుష్యంతుని శకుంతల సరిగా గుర్తించినది. ఈ గుర్తించుటలో నిక్షిప్తమైన జయంతుని లక్షణము శకుంతల హృదయమును శృంగారాభిముఖముగా ఆవిష్కరించుచు కథాగతికి రామణీయకమును కలిగించుచున్నది. ఈ యుపమానము స్వతంత్రమైనది. నన్నయ కథాప్రసన్నతకు నెలవైనది.

వ. వారు వచ్చునంతకు నొక్కముహూర్తం బుండునది యనిన విని యక్కోమలి వినయంబునకు మృదుమధురవచనంబులకు సంతసిల్లి దానిం కన్యకంగా నెఱింగి మనోజరాజ్యలక్ష్మియుం బోనిదాని స్వరలక్షణలక్షితంబులయిన సర్వావయవంబులుం జూచి సంచలితహృదయుండై నీవెవ్వరికూతుర విట్టి రూపలావణ్యవిలాసవిభ్రమగుణసుందరి విందుల కేల వచ్చితని యడిగిన నది యిట్లనియె.[2]

అవశ్యమానస్తమృషిం తథా చోక్తస్తయా నృపః।
తాం దృష్ట్వా చ వరారోహాం శ్రీమతీం చారుహాసినీమ్॥
విభ్రాజమానాం వపుషా తపసా చ దమేన చ।
రూపయౌవనసంపన్నామిత్యువాచ మహీపతిః॥[3]

---

1. నన్నయ్యగారి "ప్రసన్నకథాకలితార్థయుక్తి"-పుట 168 సత్యనారాయణ, విశ్వనాథ - (Edition - 1970)
2. ఆది - 4-28
3. ఆది - 82 - 14, 15

శకుంతలచేత సత్కారమును పొందిన తరువాత దుష్యంతుడు తీరికగా ఉపవిష్టుడై కణ్వుని ఆగమనవిశేషములు అడిగినాడు. శకుంతల కణ్వుడు వచ్చువరకు వేచి యుండుమని కోరినది. దుష్యంతు డప్పుడు శకుంతల సౌందర్యవిశేషములను గమనించి మనోజరాజ్యలక్ష్మివలె ఉన్నదనుకొనినాడు. శ్రీమతీం, చారుహాసినీమ్, రూపయౌవనసంపన్నాం అన్నమాటలను నన్నయ - మనోజరాజ్యలక్ష్మియుం బోనిదాని, సర్వలక్షణలక్షితంబులయిన సర్వావయవంబులుం జూచి సంచలితహృదయుండై అని వ్యక్తపరచినాడనవచ్చును.

లోకమున ఉత్తముల ప్రవర్తన సామాన్యులకు మార్గదర్శకము. ఆ యుత్తముల కేసందేహము కలిగిన వారి మనస్సే వారికి సహాయము చేయును కాళిదాసు- సతాం హి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః[1] అని వీరి కథనే నాటకముగా రచించెను. కాళిదాసు భావమునే నన్నయ దుష్యంతునిపట్ల భవిష్యత్తు తెలిసినవానిగా తీర్చినాడు. రూపలావణ్యములే కాక సహజీవనమునకును తగినది కనుకనే దుష్యంతుని మనస్సు చలించినది. శకుంతల జన్మవృత్తాంతము తెలిసిన తరువాత తన హృదయసంచలనము సరియైనదే అనుకొనినాడు. రాజు విష్ణ్వంశ సంభూతుడు. అతనికి రాజ్యము లక్ష్మి. విష్ణోరేషానపాయినీ-యని-రాజు, రాజ్యలక్ష్మి అనపాయులు. ఇక్కడ శకుంతల నాయిక. రాజు మనము నాకర్షించిన సర్వలక్షణలక్ష్మి కావున మనోజ. అనగా మనసునందు పుట్టునది, రాగము కావున రాగబద్ధముగా ప్రేమసహితముగా అతడు విష్ణువు ఈమె లక్ష్మి పరముగా దాంపత్యలక్షణము సూచితమైనది. మన్మథసామ్రాజ్యలక్ష్మితో పోల్చుట సౌందర్యాతిశయ ద్యోతనార్థముకూడ. మనోజ-శబ్దముచేత సౌందర్యము, రాజ్యశబ్దముచేత దుష్యంతుని పొందుటవలన కలుగు సామ్రాజ్య విభవత్వము; లక్ష్మి శబ్దముచేత సౌభాగ్యసంపన్నత్వము శకుంతల కన్వయింపవచ్చును. శకుంతల వ్యక్తిత్వమును సాధారణస్థితినుండి విశేషస్థితిలో భావింపజేయుచున్నది.

చ. ఇది మునినాథకన్యయని యెంతయు నిస్పృహవృత్తినున్న నా
హృదయము రాజపుత్రినని యిక్కమలాక్షి నిజాభిజాత్యసం
పద నెఱిఁగించినన్ మదనబాణపరంపర కిప్పుడుండ నా
స్పదమయి సంచలించె నళిపాతవికంపితపంకజాకృతిన్.[2]

---

1. అభిజ్ఞాన శాకుంతలమ్ I - 20
2. ఆది - 4 - 51

శకుంతల జన్మవృత్తాంతము విన్న తరువాత అంతకు మునుపున్న తన హృదయ సంచలనము సరియైనదని దుష్యంతుడు భావించెను. అది ఇప్పుడింకను తీవ్రతరమై అళిపాతవికంపితపంకజాకృతి ధరించినది. మునికన్యయని నిస్పృహవృత్తి నున్న వానికి రాజపుత్రియని తెలియగనే మదనబాణపరంపరకు మనస్సు ఆస్పదమయినది. అదివరకున్న అభిలాష బలీయమైనది. కనుక మనస్సు చలించుటకు అవకాశము కలిగినది. నన్నయ స్వతంత్రముగా చెప్పదలచిన భావము స్పష్టమగుచున్నది.

మదనబాణములను అళులతో, హృదయమును పంకజముతో, ఉపమించినాడు. దుష్యంతుని సంపూర్ణేచ్ఛ సంపూర్ణోపమగా సిద్ధించినది. ఉత్తముల ప్రవర్తనకు మనస్సు తోడ్పడునను భావము ఇచట దుష్యంతునిపట్ల సిద్ధించినది. మునికన్యయే ఐనచో దుష్యంతుని హృదయసంచలనము అధర్మవర్తన గలది యగును. జన్మ వృత్తాంతమును చెప్పుటకు శకుంతల ఉపక్రమించినపుడు - ఇది మునికన్యయైనను నాహృదయము ఈమెయందే ఆసక్తి చూపించుచున్నది–అని అనుకొనినవాడు-ముని కన్యయని నిస్పృహవృత్తినున్న హృదయము రాజపుత్రియని తెలియగానే మదనబాణ పరంపరకు గురియైనది. దుష్యంతుని మదనోద్దీపన మిచట కవిసమయముతో సమర్థింప బడినది. పంకజము - భ్రమరము శృంగార భావమునకు దోహద మొనర్చుచున్నది. 'వికంపిత' శబ్దము అనుభూతివిశేషమును వ్యజ్యమానము చేయుచున్నది. ఈ ఆంతర మైన - ధర్మయుతమైన మనోలక్షణముతోపాటు శృంగారభావమీ ఉపమయందు నిక్షిప్తమైనది.

క. విను గార్హపత్యమను న
య్యనలము విహరింపఁబడి తదాహవనీయం
బన వెలుఁగునట్లు వెలుఁగును
జనకుఁడు దాఁ బుత్త్రుఁడై నిజద్యుతితోడన్.[1]

యథా వాఽఽహవనీయోఽగ్నిర్గార్హపత్యాత్ప్రణీయతే।
ఏవం త్వత్తః ప్రసూతోఽయం త్వమేకస్సన్ ద్విధాకృతః॥[2]

పుత్త్రవతియైన శకుంతలను కణ్వుడు దుష్యంతుని వద్దకు పంపించినాడు. దుష్యంతుడు ఎరుగనివానివలె తిరస్కరించెను. శకుంతల రాజునకు ధర్మోపదేశ మొనర్చినది. ధార్మికవర్తనులు ప్రవర్తింపవలసిన తీరును విశదపరచినది. భార్యా

1. ఆది - 4 – 87 2. ఆది - 86 - 92

భర్తల అనుబంధమును, సంతానముపట్ల వారు ప్రవర్తింపవలసిన తీరును వివరించు నపుడు – గార్హపత్యమను అనలము ప్రజ్వాలింపబడి ఆహవనీయముగా వెలుగునట్లు జనకుడును పుత్రుడై నిజద్యుతితో వెలుగునని పితాపుత్రసంబంధమును పవిత్రమైన అగ్నిరూపాంతరముగా వర్ణించినది. ఇక్కడ తండ్రితో సమానుడుగా పుత్రుడు వర్ణింపబడినాడు. సమానత్వము ఈ విషయమునందే సంస్కృతమున తెలుగున ఒకే తీరుగా భాసించినది. దుష్యంతునితో సంభాషణ ప్రారంభించగనే "బాలార్క తేజుడగు నీ బాలుడు నీ కొడుకు" అని తెలిపినది. తండ్రి ఎట్టిద్యుతి కలవాడో పుత్రుడు అట్టి విధముగా వృద్ధినందినవాడే. ఆ విషయము రాజు గుర్తించుటకై సమానమైన ప్రతిపత్తిని తండ్రికొడుకుల విషయమున శకుంతల ద్వారా నన్నయ్య ప్రతిపాదించినాడు.

జనకపుత్రుల సంబంధము పవిత్రమైనదిగా ప్రణీతమై ఉపమ అతిలోకమైన తేజోరూపమును ఆవిష్కరించుచున్నది. ఇది మూలమునకు ఉపస్కారకమైనది.

క. తాన తననీడ నీళ్ళల
లో నేర్పడఁ జూచునట్లు లోకస్తుత త
త్సూను జనకుండు సూచి మ
హానందముఁ బొందు నతిశయప్రీతిమెయిన్.1

సరసీవామలేఽఽత్మానం ద్వితీయం పశ్య తే సుతమ్।
సరసీవామలే సోమం ప్రేక్షాత్మాసం త్వమాత్మనా॥2

క. నీ పుణ్యతనువువలనన
యీ పుత్రకు డుద్భవిల్లి యెంతయు నొప్పన్
దీపంబువలన నొండొక
దీపము ప్రభవించినట్లు తేజంబెసగన్.3

అంగాదంగాత్సంభవసి హృదయాదధిజాయసే ।
ఆత్మా వై పుత్రనామాసి స జీవ శరదశ్శతమ్॥1

సభాసదులకు విషయవివరణము చేయవలెనన్న శకుంతల తలంపునకు ఈయుపమానము లన్నియు ఉదాహరణములు. తండ్రికొడుకుల అనుబంధమును బింబప్రతిబింబ

---

1. ఆది - 4 - 88 2. ఆది - 86 - 91
3. ఆది - 4 - 90 4. ఆది - 86 - 87

సమానత్వముగా తెలియజేయ దలచినది కనుక "తాన తన నీడ నీళ్ళలలో నేర్పడ జూచునట్లు తత్పూను జనకుండు చూచు"నని, "నీ పుణ్యతనువువలనన యీ పుత్రకుడు" దీపంబువలన నొండొక దీపము ప్రభవించినట్లు ఉద్భవిల్లినాడని తెలియజేసినది.

మూఢెడు సభాసదులు పుత్రునందు చక్రవర్తి లక్షణములు గుర్తించి యైనను నిజమని తలచగలరు. అంతేగాక నీటియందు కనిపించు బింబసాదృశ్యముగ దుష్యంతుని ఆత్మవిమర్శనము చేసికొనుమనియు ప్రబోధించినది. అట్టి యంతర్దృష్టి కలిగినప్పుడైనను సత్యము బోధపడునని శకుంతల భావము.

సీ. శమహీనుఁడైన విశ్వామిత్రు చేసిన యపకారమునఁ జేసి యాత్మసుతులు
యమసదనంబున కరిగినవారలఁ దన తపోవీర్యసత్త్వములపేర్మిఁ
గ్రమ్మఱఁ దేఁగ శక్తి గలిగియు వేల నయ్యంబుధి గడవనియట్ల శాంతుఁ
డయి యెవ్వఁడేని కృతాంతకుఁ గడవంగ నొల్లండ యట్టి యత్యుగ్రతేజుఁ

ఆ॥ డగు వసిష్ఠముని మహాత్మతఁ జెప్పనా యలవి యయ్యె యనిన నవ్వసిష్ఠ
గాధిసుతుల కేమి కారణంబున నిట్టి వైరమయ్యె నెఱుఁగవలతు దీని.[1]

మృతాంశ్చ పునరాహర్తుం శక్తః పుత్రాన్ యమక్షయాత్।
కృతాంతం నాతిచక్రామ వేలామివ మహోదధిః॥[2]

పాండవులు జననీసహితముగా ద్రుపదుని పురమునకు వెడలునపుడు మధ్యే మార్గమున అంగారపర్ణుడను గంధర్వుడు అర్జునునితో జరిగిన పోరునందు ఓడిపోయి శరణువేడెను. ఆ సందర్భమున గంధర్వునివలన అర్జునుడు తమ కులభూపతులకు పుణ్యభాగులకు పురోహితుడైన వసిష్ఠుని మాహాత్మ్య మెరుగగోరెను. అంగారపర్ణుడపుడు కామక్రోధములు రెండును జయింపబడి ఎవని సేవచేయుచుండునో అట్టి బ్రహ్మర్షి మహిమ నెరిగించెను. శమహీనుడైన విశ్వామిత్రుని అపకృతివలన వసిష్ఠపుత్రులు మరణించిరి. వసిష్ఠుడు తన తపశ్శక్తివలన వారిని మరణమునుండి తప్పించు శక్తి గలవాడైనను సముద్రము చెలియలికట్టను దాటనట్లు శాంతుడై విధికృతము నంగీకరించెను. "కృతాంతకుఁ గడవంగ నొల్లండ" "కృతాంతం నాతిచక్రామ వేలామివ మహోదధిః"- అన్నమాటలలో బ్రహ్మర్షిత్వము సువ్యక్తమగుచున్నది. యముని శక్తిని సైతము ధిక్కరించగల తపశ్శక్తిగలవాడు మిన్నకుండుటలోని ఆంతర్యమిది.

---
1. ఆది – 7- 95 2. ఆది – 173 - 8

ఇచ్చట సముద్రముతో నుపమించుటలో సాగరగభీరమైన యాతని ఆత్మశక్తి గోచరమగుచున్నది. సముద్రగర్భమున రకరకముల ప్రాణిజాలము, ధనరాసులే కాక భయంకరమైన బడబాగ్నియు దాగియుండును. తాలోత్తాలతరంగము లెగసి దుమికి క్రమించుచుండును. ఇన్నింటితో పరిపూర్ణమైన సాగరమెప్పుడును వేల నతిక్రమింపదు. ఇది విశేషము.

వసిష్ఠుని శాంతగుణము పుత్రశోకముతో బడబాగ్నిని ప్రజ్వలింపజేయునది కాదు. తన తపశ్శక్తి ఎంతటిదో, సామాన్యులకే గాక సర్వులకును మృత్యువెట్లు విధిదత్తమో తెలిసినవాడు. కావున పుత్రప్రేమకు లోనుగాక, వారు ప్రాణి సహజమైన మృత్యువును పొందుటగా భావించి సర్వత్ర సమదర్శనమును ప్రదర్శించినాడు.

ఈ యుపమాలంకారము మూలవిధేయమై వసిష్ఠుని అతిలోకమైన వ్యక్తిత్వమును ప్రతిబింబించుచున్నది.

తే. శక్తి చదువునుబోలె సువ్యక్తమగుచు
వీనులకు నిది యమృతోపమానమయ్యె
వేదనాదంబు దీని పుణ్యోదరమున
నున్నవాఁడు సుతుండు విద్వన్నుతుండు.[1]

పుత్రి కస్యైష సాంగస్య వేదస్యాధ్యయనస్వనః ।
పురా సాంగస్య వేదస్య శక్తేరివ మయా శ్రుతః ॥[2]

వసిష్ఠుడు మహాదుఃఖమును భరించినను చివరకు వివశాత్ముడై దోషమని తలచక ఆత్మహత్యకు పాల్పడినాడు. ఆ తపస్సంపన్నుని ప్రయత్నము లన్నియు విఫలమైనవి. శరీరపరిత్యాగనిశ్చయుడై యున్నను అప్రాప్తమరణుడై ఆశ్రమమునకు తిరిగి వచ్చుచుండగా తన పుత్రుడైన శక్తి భార్య అదృశ్యంతి గర్భమునుండి షడంగాలంకృత వేదధ్వని విని విస్మితుడైనాడు వసిష్ఠుడు తన పుత్రుడైన శక్తి చదువువలె వీనులకు అమృతతుల్యముగా సోకుటతో ఆంతరమైన అనుభూతిని పొందెను. పౌత్రగతమైన మధుర భావము ఆతనిలో పరివర్తనకు హేతువైనది పౌత్రుని అమృతోపమానస్వరము తపశ్శక్తి సంపన్నుడైన అతనిలో అమృతభావము నింపి మరణవిముఖుని గావించినది. అంత వసిష్ఠుడు మరణోద్యోగమును విరమించుకొని విరక్తిభావము వీడి యథాస్థితికి చేరు

1. ఆది - 7 - 125    2. ఆది - 175 - 16

కొనెను. వసిష్ఠుని మరణవ్యవసాయమునుండి మరలించుటకు కారణభూతమైనది "అమృతోపమాన"మైన పుత్రపౌత్రభావము. దీనితోపాటు సంస్కృతమున లేని మరొక విశేషణము "విద్వన్నుతుడు". ఈ రెండును పరస్పరపోషకములై వసిష్ఠుని శాంత మనస్కునిగా ప్రవర్తింపజేయుటకు దోహదమైనవి అలంకారభావమును ప్రసన్న మొనర్చునవిగా నున్నవి. ఈయుపమ ధార్మికమైన సద్బుద్ధిని ప్రకాశింపజేయునది.

క. దమయంతి మనోభవనిభు
అమరేంద్రప్రతిము దినకరాభు సుధారుక్
సము వరుణసదృశు ధనదో
పము నశ్విసమాను నిషధపతిఁ జూచి నలున్ [1]

తతస్తా నైషధం దృష్ట్వా సంభ్రాంతాః పరమాంగనాః ।
ఆసనేభ్యస్సముత్పేతుః తేజసా తస్య ధర్షితాః ॥[2]

దమయంతి స్వయంవరమునకు నిఖిలధరావలయమున గల రాజులందరు వచ్చిరి. నారదప్రేరితులై ఇంద్రుడు, లోకపాలవరులును కనకరత్నరమ్య దివ్య విమానారూఢులై బయలుదేరిరి. నిషధేశ్వరుడైన వీరసేనుని పుత్రుడు నలుడు హంస వలన దమయంతి రూపగుణాదు లెరిగియున్నాడు. నలదమయంతు లిద్దరు అన్యోన్య రూపగుణశ్రవణసంజాతప్రీతులై యుండిరి. స్వయంవరార్థము బయలుదేరిన ఇంద్రాదు లకు మార్గమందు నలు డగపడినాడు. అంతరిక్షమునుండి దిగి భూతలమునకు నలుని వద్దకు వచ్చి తమయం దెవరినైనను దమయంతి వరించునట్లు రాయబార మొనర్చు మనిరి. నిత్యసత్యనిరతుడైన నలుని దేవహితముగా ఈకార్యమును నెరవేర్చుమని పలికి ఒరు లెరుగకుండ దమయంతి నివేశము ప్రవేశించునట్లు చేసిరి. దమయంతీ గృహము సొచ్చిన నలుడు తాను హంసవలన విన్నదానికన్నను, అధికమైన రూప విభవాతిశయమున వెలుగుచున్న దమయంతిని చూచినాడు. శతకన్యకాళిచే పరివృతయై యున్న దమయంతియు హఠాత్తుగా ప్రవేశించిన నలుని చూచినది. నలుడు-మనోభవ నిభుడుగ, అమరేంద్ర ప్రతిముడుగ, దినకరాభుడుగ, సుధారుక్సముడుగ, వరుణ సదృశుడుగ, ధనదోపముడుగ, అశ్విసమానుడుగ అగుపించినాడు.

ఇన్ని లక్షణములు నలునియందు నిక్షిప్తపరచిన నన్నయ దమయంతికే కాక దేవతలకును రాబోవు పరిణామమును తెలియజేసినా డనవచ్చును. చూచియుచూడగనే

1. ఆరణ్య - 2-41 ఆరణ్య - 46-46

దమయంతికి నలుని ఆకృతి ఇంతవైభవోపేతముగ అగుపించుటకు కారణము, అంతకు మునుపే దేవతా సందర్శనమొంది ఇంకను అధికమైన తేజస్సును పొందియుండుటే. మూలమున "తేజసా తస్య ధర్షితాః"— అని నలుని అధిక తేజస్సు వర్ణింపబడినది. సర్వగుణ సౌందర్యముల నలుని బోలినవారు లేరని హంస దమయంతికి తెలియజేసినది. ఇట్టివానిని రాయబారిగా పంపినగాని దేవతలు తమ పని సాధ్యపడదనుకొనిరి. ఐనను వారి ఆశయము నెరవేరలేదు. చివరకు స్వయంవరసభామంటపమున దిక్పాలురు నలుని వేషముతోనే ఆసీనులైనారు. దేవతలు సైతము అనుకరించు రూపసంపద కలిగిన నలుడు దమయంతికి, అన్నివిధములుగా ద్యోతకమగుటలో ఆశ్చర్యము లేదు.

ఆ. అగ్నిశిఖయుఁబోలె నంటను డాయను
జూడరానియట్టి శుభచరిత్ర
నెఱుకలేని కఱకుటెఱు కపేక్షించెఁగా
దనకతనకు నాయు వల్పమైన.[1]

స తు పాపమతిః క్షుద్రః ప్రధర్షయితుమారభత్ ।
దుర్ధర్షాం తర్కయామాస దీప్తామగ్నిశిఖామివ ॥[2]

వ. దమయంతియు వాని నలిగి చూచి యేను పతివ్రత నైతినేని యిద్దురాత్ముం డైన కిరాతుం డిప్పుడ మృతుం డయ్యెడుమని శాపం బిచ్చిన వాఁడప్పుడ యగ్నిదగ్ధంబైన వృక్షంబునుంబోలె విగతజీవుండై పడియె నట్టి పరమ పతివ్రతాగుణప్రభావంబున.[3]

ఉక్తమాత్రేణ తు తయా సాధ్వ్యా స మృగజీవనః।
వ్యసుః పపాత మేదిన్యామగ్నిదగ్ధ ఇవ ద్రుమః॥[4]

అడవియందు అజగరమున కాహారము కాబోవు దమయంతిని ఒక ఎఱుకు రక్షించినాడు దమయంతి సౌందర్యము వాని నాకర్షించినది. దమయంతి శుభ చరిత్ర. పరమ పతివ్రత కన్నెత్తి చూడరానియట్టి అగ్నిశిఖాసదృశమైన యామెను స్పృశించుటకు సమీపించుట కపేక్షించినాడు. ఈ ప్రవర్తనకు కారణము తరువాత చెప్పబడినది. అదియే ఎఱుకలేని కఱకుటెఱుక దనము. ఎఱుకలేనివాడనగనే జ్ఞానము

1. ఆరణ్య - 2-91
2 ఆరణ్య - 51-35
3. ఆరణ్య – 2 - 92
4. ఆరణ్య - 51 - 38

లేనివాడని యర్థము. పాపమతిః క్షుద్రః అని మూలము. ఈ విశేషణములు వాని అల్పత్వమును సూచించుచున్నవి. అట్టివాడు అగ్నిశిఖవలె వెలిగెడు దమయంతి నపేక్షించుట అజ్ఞానవిలసనమే ఆది వాని ఆయుఃక్షీణతకు కారణమైనది. క్షణకాలము లోపల భస్మీభూతుడైనాడు. అగ్నిదగ్ధమైన వృక్షమువలె విగతజీవుడగుటలో శాప ప్రభావము, పాతివ్రత్యమహిమ ద్యోతమానమగుచున్నవి.

వృక్షము నీడనిచ్చునది. దమయంతిని ప్రాణాపాయమునుండి రక్షించి నీడ నిచ్చినాడు కిరాతుడు. ఇంతవర కితని మనస్సు ఉదారమైనది. ఆ తరువాత మనసున పాపచింతన కలిగి వాని క్షుద్రత్వము బయట పడినది. వాని పాపచింతనయే మృత్యువునకు దారితీసినది. అజగరము నోటబడినపుడు విధివశమైనది. కిరాతుని చేతిలో బడినపుడు తన పతివ్రతాప్రభావమును ప్రకటించినది. కారణము-అక్కడ ప్రాణము పోవును అంతియే. ఇక్కడ శీలము పోవుచున్నది. తానిన్నినాళ్ళు ప్రోది చేసికొన్న ఆంతరమైన పుణ్యరూపమున కొక్కమారు క్షతి కలుగబోవుచున్నది. కావున దీనిని నివారించుకొనక తప్పలేదు. ప్రాణము పోవుటకన్న స్త్రీకి మానహాని సహింపరానిది. ఈ ఆంతర్యము నెరిగి నన్నయ అలంకారనిర్వహణము సాగించెను.

నన్నయ ఇంకను "శుభచరిత్ర" "ఎఱుకలేని కఱకుటెఱుక" "ఇద్దురాత్ముండైన కిరాతుండు మొదలుగా గల భావసముదాయముతో శోభను సంపాదించి దమయంతి పాత్రకు ఔజ్జ్వల్యమును చేకూర్చినాడు ఇవి యన్నియు వ్యాసహృదయావిష్కార రూపములుగా గ్రహించవచ్చును.

క. పవనసమీరిత మధుసం
భవ వివిధప్రసవసౌరభముఁబోలి ముని
ప్రవరుని తనువునయం దు
ద్భవమై రమ్యమయి సౌరభము విలసిల్లున్. 1

యథా వనం మాధవమాసి మధ్యే
సమీరితం శ్వసనేనేవ భాతి।
తథా స భాత్యుత్తమ పుణ్యగంధీ
నిషేవ్యమాణః పవనేన తాత॥2

1. ఆరణ్య – 3 - 105 2. ఆరణ్య - 89 - 8

వ. మఱియు నక్కుమారుం డొక్క యెఱ్ఱని ఫలంబున దన దక్షిణపాణి తలంబున నందంద చఱచుచు నది నేలంబడి యెగయంబోయిన వలనికి వ్రాలుచు వాతావధూతంబైన బాలవృక్షంబునుంబోలె నొప్పుచున్న నమ్మునిపుత్రునందు నా హృదయంబు దద్దయుం దగిలినయది.[1]

తచ్చాభిహత్యా పరివర్తతేఽసౌ
వాతేరితో వృక్ష ఇవావఘూర్ణః।
సంప్రేక్ష్య మే పుత్రమివామరాణాం
ప్రీతిః పరాతాతరతిశ్చ జాతా॥[2]

విభాండకుని పుత్రుడు ఋశ్యశృంగుడు. తండ్రిని తన యాశ్రమమును తప్ప ఇతర మెరుగక తప మాచరించువాడు. అంగాధిపతి రోమపుని రాజ్యమున పురోహితాపరాధకృతమున అనావృష్టి కలిగినది. ఋశ్యశృంగుని ఆగమనమువలన గాని వృష్టి కలుగదని బ్రాహ్మణులు రాజుతో చెప్పిరి. ఋశ్యశృంగుని తోడ్కొని తెచ్చుటకు రోమపుడు విదగ్ధవేశ్యాంగనలను పంపెను. వారు తమ చేష్టావిలాసములతో ఋశ్యశృంగుని ఆకర్షించిరి ఆసమయమున విభాండకుడు వన్యఫలాదులకై అడవి కేగినాడు. అతడు తిరిగి వచ్చుసరికి అగ్నిహోత్రము వేల్వక విపరీతబుద్ధియై యున్న పుత్రుని జూచి ఇట్లేల కాలాతిక్రమణము చేసితివని యడిగెను. వేశ్యను ఋషి కుమారునిగా తలచిన ఋశ్యశృంగుడు తన నాకర్షించిన విశేషములను తెలియజేసినాడు.

మునిప్రవరుని తనువునుండి వెలువడిన రమ్యమైన సౌరభము, పవనసమీరిత మధుసంభవ వివిధప్రసవ సౌరభమును పోలియున్నదని తన నూతనానుభవమును చెప్పెను. ఈ భావము మూలమునకు సమానముగా నున్నది. ఇట్లు భాసింపజేయుటకు కారణము ఋశ్యశృంగునికి అన్యవిషయపరిజ్ఞానము లేకుండుటయే. తండ్రిని తపమును తప్ప ఇతర మెరుగనివానికి సుగంధపరిమళములు సహజముగా వనమున ప్రసరించు ప్రసవసౌరభమును బోలియుండుటలో విపరీతములేదు. వనమున తాననుభవించు ప్రసవ సౌరభమును పోలినదే ఋషి కుమారుని తనువునందుద్భవిల్లిన రమ్యసౌరభము. ఐనను రెంటికి గల కొద్దిపాటి తారతమ్యమును ఋశ్యశృంగుడు గ్రహించినాడు. ఇది అపరిచితమైన విశేషానుభూతి కనుక తనకు పరిచితమైన అనుభవముతో పోల్చి తండ్రికి విశదపరచినాడు.

1. ఆరణ్య - 3 – 106 2 ఆరణ్య - 89 - 11

ఇంకను తాను ఋషికుమారునిగా భావించు వేశ్య కందుకక్రీడను తాను భావించిన విధము తెలియజేయుచున్నాడు. ఎట్టని ఫలమును తన దక్షిణపాణి తలమున చరచుచు దాని గమనము ననుసరించుచున్న ఋషికుమారుడు వాతావధూతంబైన బాలవృక్షము వలె ఒప్పియున్నాడు

"వాతేరితో వృక్ష ఇవావఘూర్ణః" అనుదానిని నన్నయ- వాతావధూతంబైన బాలవృక్షంబునుంబోలె అని ప్రయోగించినాడు. ఇక్కడి విశేషము గమనింపదగినది. వాతావధూతమైన వృక్షమునకు, బాలవృక్షమునకు గల భేదము ఋష్యశృంగుని మనః ప్రవృత్తిని తెలియజేయుచున్నది. ఋష్యశృంగుని ఆకర్షించినది క్రీడావిశేషము, ఎట్టని ఫలమనగానే ఋష్యశృంగుడు సత్త్వగుణమును వదలి రజోగుణమువైపు ఆకర్షితుడగుట సూచితము. తానే బాలవృక్షమైనాడు. బాలవృక్షమైనా డనుటలో 'బాల' శబ్దము ఏమియు తెలియని అమాయిక లక్షణమును స్ఫురింప జేయుచున్నది.

ఇదివరకు తనకు పరిచితము కాని దృశ్యములకు ఆకర్షితుడై విశిష్టమైన అనుభూతి విలోలుడై. శాంతస్థితి చలించి "విపరీతబుద్ధి"యైనాడు. తానుపమించి చెప్పబోవు ఉపమానమునకు తానే పాత్రుడైనాడు. సత్త్వగుణమునుండి రజోగుణమున కుపక్రమించుటలో ఔన్నత్యమునకు భంగపాటు కలిగి ఋష్యశృంగుడు అరిషడ్వర్గక్రమమున మొదటిదైన కోరికకు ఆకర్షణచేత లోనైనాడు. కనుకనే అమ్ముని పుత్రునందు నా హృదయము తద్దయు తగిలినదని బలీయమైన శక్తికి లోనైన నూతనపరివర్తనను తెలియజేసెను.

ఈవిధముగా మూలము ననుసరించియే యున్న యుపమాలంకారమందలి స్వల్పమైన మార్పు వ్యాఖ్యాసదృశమై సన్నివేశమును చిత్రించుచు, ఋష్యశృంగుని పాత్ర స్వరూపమును ఆవిష్కరించుచు నన్నయ ఉపజ్ఞచేత ప్రసన్నత్వమును పొంది ప్రకాశించినది.

# ఉపసంహారము

"వాల్మీకిం నన్నార్యం త్యక్త్వా కవిరస్తి వా జగత్యన్యః
శశిమౌళిపింఛమౌళీ త్యక్త్వా దేవోఽస్తి కో వాన్యః"[1]

వాల్మీకిని నన్నార్యుని వదలి జగత్తులో వేరు కవి కలడా? శశిమౌళిని పింఛమౌళిని వదలి మరొక దేవుడు కలడా? అని దీని భావము. ఇది సామాన్యదృష్టికి కొంత విపరీతముగానే కన్పించును. కాని ప్రస్తుతః విశేషసందర్భమునందు కొంత యాథార్థ్యము లేకపోలేదు. అపూర్వము ఆశ్చర్యకరమునై మనల నెక్కువగా ఆకర్షించి ప్రీతిపాత్రమైనదానిని గురించి ఇట్లు పలుకుట లోకస్వభావము. ఇంతవరకు యథార్థమే. ఇంతకు తెలుగు కావ్యప్రపంచమునందు నన్నయ మొట్టమొదట స్మరింపదగినవాడు. సంస్కృతమునందు వాల్మీకివలె తెలుగునందు "పద్యవిద్య"కు ఆద్యుడు. కావ్యసంప్రదాయమున ఒజ్జబంతి. వేదసంస్కృతికి నిలయమూర్తి.

నన్నయ భారతావతారికలో ఈ క్రింది పద్యమునందు ఆతని అంతస్తత్త్వము ప్రస్ఫుటముగా చిత్రితమైనది. ఈ మూలభూతమైన అంశము ఈతని తాత్త్విక, కళా దృక్పథములను భావింపజేయునది.

సీ. తన కులబ్రాహ్మణు ననురక్తు నవిరళజపహోమ తత్పరు విపులశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాదినానాపురాణ విజ్ఞాననిరతుఁ
బాత్రు నాపస్తంబసూత్రు ముద్గలగోత్రజాతు సద్వినుతావదాతచరితు
లోకజ్ఞు నుభయభాషాకావ్యరచనాభిశోభితు సత్ప్రతిభాభియోగ్యు

ఆ. నిత్యసత్యవచను మత్యమరాధిపా, చార్యు సుజను నన్నపార్యుఁ జూచి
పరమధర్మవిదుఁడు వరచళుక్యాన్వయా, భరణు డిట్టులనియెఁ గరుణతోడ.[2]

---

1. నన్నయగారి "ప్రసన్నకథాకలితార్థయుక్తి" - పుట - 3 - విశ్వనాథ
2. ఆదిపర్వము - 1 - 9

ఇతడు వైదికనిష్ఠాగరిష్ఠుడు, కావ్యరచనా కుశలుడు. ఇంకను సత్యవచస్కుడు. మొదటిది కావ్యతత్త్వమునకు సంబంధించిన అంశముపై ఊహను ప్రసరింపజేయునది. రెండవది కావ్యకళపై దృష్టిని బరపునది. మూడవది వైయక్తిక గుణసంపదను చిత్రించునది. "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రమని, అధ్యాత్మవిదులు వేదాంతమని" మొదలుగా భారత మెన్నివిధములుగా భావించుటకు వీలుకలదో అన్ని విధములును సమగ్రముగా ప్రపంచితమైనది. ఈ పద్యమునకు దీటుగా నన్నయ వ్యక్తిత్వమునకు సర్వ విశేషములతో సమగ్రత చేకూర్చునది, "తన కులబ్రాహ్మణు"డను పద్యము. నన్నయ వేదనిష్ఠమైన ఆత్మ కనుగుణముగా వైదిక, పౌరాణిక, ధార్మిక లక్షణములను (ఉపమాలంకార శోభితముగా) తీర్చిన విధము ఇందుపరిశీలించదగిన అంశము. ఒక్క మాటలో చెప్పినచో ఇతనిలో ఆర్షభావన సామాన్యమైన మాటలలో గాక అలంకార సుందరముగా ఆవిష్కృతమైనది.[1]

ఈ విశిష్టలక్షణమునకు కారణము నన్నయ్య వ్యక్తిత్వమే. అతడు అవిరళ జపహోమతత్పరుడు సంహితాభ్యాసుడు బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాననిరతుడు, సత్ప్రతిభాభియోగ్యుడు, నిత్యసత్యవచనుడు, ఉభయభాషా కావ్యరచనాభశోభితుడు, విపులశబ్దశాసనుడు, మత్యమరాధిపాచార్యుడు; మున్నగు విశేషణములలోని లక్షణముల సమాహారభూతమైన రచనాస్వరూపము చదువునపుడు మన అనుభవమునకు వచ్చును. ఈ పద్యము ప్రథమపురుషలో నున్నది. ఇది-పైకి-నన్నయ వినయ సంపన్నతను, ఉదాత్తవైఖరిని వ్యక్తీకరించుచున్నను- 'లోనారసి' చూచినచో ఆత్మప్రత్యయమును అవగతము చేయుచున్నది. ఈ విశేషణములలో ఒక్కొక్కదానిని గురించి విస్తరించుట ప్రస్తుతము ధ్యేయము కాకపోయినను, ఒకటిరెండు అంశములు నన్నయ ఆర్షసమ్మతమైన దృష్టిని వివరించుటకు పరిశీలించవలసియున్నది.

ఒకటి "సత్ప్రతిభాభియోగ్య" అనునది. ఇతని ప్రతిభ సత్పదార్థముచే మిక్కిలి యోగ్యమైనది. సత్పదార్థమనగా చైతన్యస్వరూపము. అదియే పరబ్రహ్మము. వేదముల యందు, ఉపనిషత్తులయందు ప్రతిపాదితమైనది. వేదవిహితమైన "సత్తు"ను ప్రపంచించి, ధర్మాధర్మస్వరూపమును చెప్పుటకే మహాభారతము వ్యాసునిచేత తీర్చబడినది. ఈ పంచమవేదమును తెనిగించుటకు నన్నయ - వేదగత పరమార్థమును[2] తెలిసికొనుట

---

1. "నన్నయ్యగారిది పరమమైన యాలంకారిక రచన"- ప్రసన్న కథా కలితార్థయుక్తి - పుట 14 - విశ్వనాథ
2. "వేదోఽఖిల ధర్మమూలమ్"— మనుధర్మశాస్త్రము - 26
వేదము అఖిలధర్మములకు మూలము.

ఎంతయో అవసరము. అవిరళ జపహోమతత్పరత్వము; సంహితాభ్యాసలక్షణము, దీనికి యోగ్యముగా మనస్సును నియమించుటకు ప్రసరింపజేయుటకు సాధనాభూమికలు.

ఇక రెండవది "పాత్రు" అనునది. పైన పేర్కొన్న శబ్దమునకు సమీపము లోనిదే, అయినను రెండిటికి కొంచెము భేదము కలదు. 'యోగ్యత'యను అర్థశక్తి కూడ కలదు. ఇది శబ్దముల అన్వయముచేత సంగతమగు అర్థము. బ్రహ్మపదార్థము నాశ్రయించిన ప్రతిభచేత పరమార్థమును సంగతము చేసుకొను శక్తి యిచట కన్పించును. ఇక్కడ యోగ్యతాస్వరూప మిట్టిది. సంస్కృత భారతమునందలి పరమార్థము చెడకుండ తెలుగునందు నిర్వహించుటకు నిపుణమైన కర్మయోగ్య- శబ్దముచేత భావించ వచ్చును. ఇక 'పాత్రు' శబ్దమునకు తగినవాడు, పండితుడనియు అర్థము. దేనికి తగినవాడు? అను ప్రశ్న ఉదయించును. సంస్కృత మహాభారతమును తెలుగునందు నిర్వహించుటకని చెప్పకొనవలయును. వైదికనిష్ఠాగరిష్ఠతతోపాటు "సద్వినుతావదాత చరిత్రము", "నిత్యసత్యవచస్కృత" చేత సంపూర్ణమైన అధికారము సిద్ధించినది.

తెలుగునందు మహాభారత మవతరించుటకు పూర్వము బహుభాషలలో బహు విధములుగా ఇది వెలసినది. నన్నయకు పూర్వము కన్నడమందు - అర్జునుడు నాయకుడుగా విక్రమార్జున విజయమును జైనకవి పంపడు రచించెను. ఇందు అర్జునునకు- తన ప్రభువైన అరికేసరికి అభేదము కల్పించి వ్రాసెను. రన్న - సాహస భీమ విజయమును రచించెను. దేశభాషలలో బహువిధములుగా రూపొందిన భారతములను విని తెలుగునందు ఆర్షసంప్రదాయసహితముగా అందలి పరమార్థమునకు భంగము రాకుండ నన్నయ నిర్వహించెను. సర్వవిధముల (నిర్వహణకు) తగిన వాడన్న భావము "పాత్రు" శబ్దమునందు ప్రతీయమాన మగుచున్నది.

వేదపరమార్థము నన్నయ రచనలో కవిత్వరూపమున విలసితమగుటతో - ప్రసన్నకథా కలితార్థయుక్తి, అక్షరరమ్యత, నానారుచిరార్థసూక్తి సమన్వితముగా కవివృషభులకు మహాకావ్యమైనది ఈరచనలో కావ్యశోభాకరములైన అలంకారములలో; ఉపమాలంకారముల ప్రయోగము-ఉజ్జ్వలతారకలవలె; వైదిక, పౌరాణిక, ధార్మిక భావనలతో ఆర్షసంప్రదాయమును అవహింపజేసికొన్నది. భావుక మనోలోకమును వెలిగించినది. నన్నయ ఉపమాలంకారప్రయోగమునందీ ఆర్షముద్ర స్ఫుటముగా కన్పించును.

గరుడోపాఖ్యానమునందు వినతాకద్రువలు ఎదుటనున్న అశ్వరాజమును భావించిన తీరులో ఇది గమనింపవచ్చును. వారివారి మనోవైఖరి చిత్రించుటతోపాటు నన్నయ

లోకోత్తరమైన ప్రయోగము గావించెను. ఒకరికి చంద్రునందు నల్లవలె అశ్వరాజ వాల్యుపదేశము కన్పించినది. మరొకరికి మహాపురుషుని కీర్తివలె అదేవస్తువు కోలిల్లినది. ఈ సంభాషణలో కద్రువ వినత పాత్రల కుటిల, ఋజు మనస్తత్వము ఇదివరకు వివరించబడినది. ఇక్కడ పరిశీలించునది ధర్మోపేతమైన-ధార్మికోపేతమైన వినత మనస్తత్వము. అశ్వరాజము కేవలము తెల్లగా నున్నదనక మహాపురుషుని కీర్తితో ఉపమించుటలో నన్నయ వ్యక్తిత్వము కన్పించును. ధర్మబుద్ధి, ధర్మవర్తనము లేనిది మహాపురుషుడు కాడు. ధర్మమునకు మహాపురుషున కవినాభావసంబంధము కలదు. ఈయుపమ ధర్మప్రవణైకశీలమును వ్యంగ్యముగా భాసింపజేయుచు అతిలోకమైన గాంభీర్యమును సంతరించుకొన్నది.

తల్లికి నమస్కరించుటకు వచ్చిన గరుడుడు-హరికులిశక్షతి నెరుగని గురుతర పక్షములతోడి కులగిరివలె ఉన్నాడనుటలో పౌరాణికసన్నివేశము స్మృతికి వచ్చును. పూర్వము పర్వతములకు రెక్కలుండెడివి. అవి ఎగురుచు ఎప్పడైన ఎక్కడైనను వ్రాలుచుండెడివి. పర్యవసానముగా నష్టము సంభవించెడిది. ఇంద్రుడు వీని దుశ్చర్యను సహింపలేక వజ్రాయుధముతో వాని రెక్కలు నరికెను. (ఒక్క మైనాకుడు మాత్రము తప్పించుకొని సముద్రములో దాగెను.) ఈ పౌరాణికమైన కథాంశమును ప్రకృత కథకు అన్వయించి ఇచట ఉపమాలంకారము ప్రయుక్తమైనది. తల్లికి మ్రొక్క వచ్చిన గరుత్మంతుడు ఇంద్రుని వజ్రాయుధపు దెబ్బ ఎరుగని కులగిరివలె ఉన్నాడనుటలో గరుత్మంతుని అవక్రపరాక్రమస్వరూపము ప్రకటితమగుచున్నది. ఇది నన్నయ పౌరాణికభావనాస్వరూపమును ప్రకాశితము చేయుచున్నది.

నన్నయ వైదికత్వమును భాసింపచేయు మరొక ముఖ్యమైన ఉపమానము అగ్ని. అగ్నికి వేదములందు ప్రముఖమైన స్థానము కలదు. వేదములలో మొదటిది ఋగ్వేదము. ఇందలి మొదటి ఋక్కు అగ్నిదేవతాత్మకమైనది.

"అగ్ని మీళే పురోహితమ్
యజ్ఞస్య దేవమృత్విజమ్
హోతారం రత్నధాతమమ్"[1]

అని ఋగ్వేదమందలి అగ్నిసూక్తము ఆరంభమగును. అగ్ని చాల పవిత్రమైనది. దీనికి "అగ్నిర్వైశ్వానరో వహ్నిర్వీతిహోత్రో ధనంజయః"[2] మొదలుగా 34 పేర్లు

1. ఋగ్వేదము - అగ్నిసూక్తము 1 2 గురుబాల ప్రబోధిక - పుట 60

కలవు. ఒక్కొక్క పేరు ఒక్కొక్క లక్షణమును వ్యక్తీకరించునది. యజ్ఞమునకు ముఖ్యమైన సాధనము అగ్ని. అసలుకు దేవతలకును మానవులకును బంధువు. దేవతలు అగ్నిముఖముననే హవిస్సును స్వీకరింతురు. నన్నయ అలంకార ప్రయోగమునందీ అగ్ని ఎన్నో భావములకు నిలయమైనది. ఉదాహరణకు-క్రోధము, పరాక్రమము, బ్రాహ్మణతేజము మొదలుగా అగ్నితో పోలికలు బహుధా కన్పించును.

అమృతార్థియై వెడలు గరుత్మంతుడు నిషాదగణమును భక్షించునపుడు కంఠములో అడ్డుపడి బ్రాహ్మణు డొకడు "నిప్పును బోలె" దహింపసాగెను. ఇక్కడ నిత్యాగ్ని హోత్రుడైన బ్రాహ్మణుడు తేజమునం దగ్నిదృశుడుగా చిత్రితుడైనాడు. కనుకనే వినత గరుత్మంతునితో ఆహారము సేవించుసమయమున బ్రాహ్మణుని పరిహరింపవలసి నదిగా పలికినది అగ్నివలె దహించు లక్షణము బ్రాహ్మణుని గుర్తించుటకు సహాయ పడినది. గరుత్మంతుడు మహానుభావుడు కావున వెంటనే జరిగినది తెలిసికొనగలిగెను.

శకుంతల దుష్యంతునితో కుమారుని గుర్తింపజేయుటకై గార్హపత్యమను అనలము ఆహవనీయముగా వెలుగునట్లు జనకుడు పుత్రుడై వెలుగునని చెప్పినది. శకుంతల కణ్వాశ్రమమున పెరిగినది. చిన్నతనమునుండి ఆమెకు పరిచితమైన వాతావరణము అగ్నులు, తపస్సులే. ఆమె నోట ఇట్టిమాట వెలువడుటలో పాత్రగతమైన ఔచిత్యము కలదు. దీనితోపాటు నన్నయ ఆమె భాషను పరమపవిత్రముగా తీర్చుట కుద్దేశించినట్లు కన్పించును.

అగ్నులు మూడు. 1. గార్హపత్యము 2. ఆహవనీయము 3. దక్షిణాగ్ని.

1. గార్హపత్యమనగా గృహస్థధర్మమునకు సంబంధించినది. గృహపతితో ఎడ బాయక యుండునది. ఇది త్రేతాగ్నులలో మొదటిది.

2. ఆహవనీయమనగా యజ్ఞమున హోమము చేయుటకు యోగ్యమైనస్థితిని పొందినది. ఇది త్రేతాగ్నులలో రెండవది.

3 దక్షిణాగ్ని అధ్వర్యువు అన్నము వండెడి యజ్ఞమునకు సంబంధించినది. ఇది దక్షిణదిక్కున స్థాపితమైయుండును ఇది త్రేతాగ్నులలో మూడవది.

ఇక్కడ గార్హపత్యముతో పోలికచేత గృహస్థధర్మము ప్రబోధితమగుచున్నది. ఆహవనీయముతో పోలికచేత హోమయోగ్యమైన స్థితినిబట్టి పుత్రభావ మెంతటి పుణ్య ప్రదమైనదో సంభావితమగుచున్నది. ఈ యుపమానము పితాపుత్రుల పవిత్రసంబంధ

మును స్థాపించునది. వైదిక కర్మకాండకు సంబంధించినది. నన్నయ అవిరళ జప హోమతత్పరత్వమును సర్వాత్మనా విలీనపరచుకొనినది.

ద్రుపదుని సభలో బ్రాహ్మణప్రవరుల మధ్య పాండవులు భస్మము మధ్య అగ్ని కణములవలె నున్నారని వ్రాసెను. బ్రాహ్మణుడగ్నియే. కాని తత్కాలమందు సత్త్వ గుణముచేత భస్మసదృశులుగా వర్ణింపబడిరి. భావికథాసూచకముగా పరాక్రమ శీలము చేత పాండవులు అనలసదృశులుగా వర్ణితులైరి. పాండవుల శౌర్యప్రసక్తి తరువాత వచ్చును. కాబట్టి వారిపై కవిదృష్టి ప్రసరించినది. వారిని వేరుగా స్పష్టముగా ఎత్తి చూపుటలో ఈ కవి అలంకారప్రయోజనమును సాధించినాడు. ఇక్కడ శత్రువులను దహింపజేయు గుణమువరకు పరిమితమై అనలకణములు, పాండవుల శౌర్య ప్రకట నాత్మకములై వారి విశిష్టవ్యక్తిత్వమును ప్రకాశింపజేసినవి.

అగ్ని తరువాత సూర్యుని ప్రసక్తి మనకు బహుధా కన్పించుచున్నది. దుష్యంతుని సభలో శకుంతల "బాలార్క తేజుడగు నీ బాలుడు నీ కొడుకు" అని తెలియ జెప్పినది. దుష్యంతుడు గుర్తించనివానివలె ప్రవర్తించినాడు. పుత్రుని బాలార్కుని తేజముతో ఉపమించి చెప్పుటలో నొక విశేషము కలదు. బాలుని రూప మాకర్షణీయమైనది. ఎట్టివారికిని అతనిగురించి ఆలోచింపజేయునది. ఇక్కడ దుష్యంతుని దృష్టి పుత్రునిపై మరలింపజేసి గతమును భావింపజేయుటకు సమర్థవంత మైనదిగా కన్పించును. ఇంతకన్నను ప్రస్తుతాంశమునకు కావలసిన విశేషము కలదు. సూర్యుడు కర్మసాక్షి. తాను చేసిన ప్రతిజ్ఞ ఇరువురికి తప్ప ఎవరికి తెలియదని అసత్యము పలుకు దుష్యంతునకు ఇరువురిపైన సర్వము చూచు జగచ్చక్షువు కర్మసాక్షి కలడనిన అర్థాంతరము పుత్రరూపములో బాలార్క-శబ్దము చేత భావింపజేయుచున్నది. పుత్రుని కాదనువా డెవడు? అధర్మమునకు అసత్యమునకు ఒడిగట్టినవాడు తప్ప? అందుకనియే కర్మసాక్షియైన సూర్యునితో ఉపమించుట జరిగినది. చివరకు ధర్మా ధర్మములపై సత్యాసత్యములపై మనస్సు కేంద్రీకృత మగుచున్నది. నన్నయ ధార్మికప్రవృత్తిని సూచించుచు ఎట్టి పరిస్థితులలోను సత్యము ధర్మము[1] మరుగున బడనీయక "అర్క" కాంతితో వెలిగింప జేయునదిగా నున్నది. ఇందు కవితాశిల్పము తాత్త్వికదృక్పథము రెండును సంయోజితములైనవి. తత్త్వప్రకాశమునకు ధార్మిక ప్రవృత్తికి అలంకారమెట్లు ఉపయుక్తమైనది తెలియుటకిది చక్కని ఉదాహరణము.

---

1. సత్యం వద; ధర్మం చర - తైత్తిరీయోపనిషత్తు - I - XI (I)

సూర్యసహస్రోపమతేజుడుగా తీవ్రపావకసముడుగా జననవేళ భృగుపుత్రుడైన చ్యవనుడు వర్ణితుడైనాడు. భృగువు తాను స్నానము చేసివచ్చువరకు ఎదుట నిలిచి యున్న నిజపత్ని "బాలార్క" బోలిన పుత్రుని ఎత్తుకొని యున్నది. ఒకే కథకు చెందిన భిన్నపరిస్థితులలో ఒకే ఉపమేయము వర్ణనీయాంశమున సముచితముగా అలంకృతమైనది. ఒకచోట రాక్షసనాశనమునకు హేతువైనది. మరియొకచోట తండ్రికి నయనోత్సవకరముగా నైనది. ఒకటి లయరూపము. రెండవది సృష్టిరూపము. రెండు క్రమముగా రాక్షస నాశనరూపములో శిశూదయరూపములో పరస్పరవ్యతిరేకములుగా తీర్చబడినవి.

ఇంకను కర్ణుడు "బాలార్క ప్రతిముడు"గా వర్ణింపబడినాడు. అదే కర్ణుని విషయమున జన్మరహస్యమును సూచించునట్లు సూర్యుడు ఉపమానమైనాడు.

అగ్నికి సూర్యునకు వైదికవాఙ్మయమందు తాత్త్వికముగా గొప్ప స్థానము కలదు. వేదవిహితమైన మార్గము ననుసరించి నన్నయ భారతమునందు వ్యాసహృదయావిష్కార సందర్భములందీ దృక్పథము మరింత ప్రకాశించినది. కథాప్రసన్నతకును తోడ్పడినది.

"అగ్నే నయ సుపథా రాయే అస్మాన్
విశ్వాని దేవ! వయునాని విద్వాన్
యుయోధ్యస్మజ్జుహోరాణమేనో
భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ !"[1]

మా సర్వకర్మలు తెలిసిన ఓ దేవా! అగ్నీ! మమ్ములను సన్మార్గమున తీసికొని పొమ్ము. మా కుటిలమైన పాపములను హరింపుము. పలుమారులు నమోవచనములతో నిన్ను పూజింతుము.

ఇక్కడ సాధారణమైన నేత్రగోచరమైన రూపముకన్న సర్వకర్మవేదిగా, సన్మార్గదర్శకుడుగా పాపహంతగా అగ్ని దివ్యరూపము భావితమైనది

"హిరణ్మయేన పాత్రేణ సత్యస్యా పిహితం ముఖమ్
తత్త్వం పూషన్నపావృణు సత్యధర్మాయ దృష్టయే"[2]

1. ఈశావాస్యోపనిషత్తు - 15
2. ఈశావాస్యోపనిషత్తు - 17

సత్యముయొక్క ముఖము హిరణ్మయపాత్రిచేత కప్పబడియున్నది. అందుకని ఓ సూర్యదేవా! సత్యధర్మముల నెరిగిన మేము చూచుటకొరకు (ద్వారము) తొలగింపుము. ఇక్కడ సత్యము పరబ్రహ్మము. హిరణ్మయపాత్రి ఇంద్రియముల నాకర్షించు మోహ పాదకమైన రూపము. దీనికావల నున్నది సత్యము. అది సత్యధర్మమూర్తులకే కన్పించును.

"యత్తే రూపం కల్యాణతమం తత్తే పశ్యామి
యోఽసావసౌ పురుష సోఽహమస్మి"[1]

కల్యాణతమమైన నీ రూపము నేను చూచెదను. అందులో నున్న (మంగళ)పురుషుడును, నేను ఒకటే.

ఇందులో పైన వివరించిన భావములు ఈ విధమైన వైదికతత్త్వ ప్రకాశమాన రూపములే.

మహాభారతము సంఘటనలు, పాత్రలు, ఆలోచన, ప్రవర్తనము సత్తు, అసత్తు జ్ఞానము, అజ్ఞానము ధర్మము, అధర్మము; సత్యము, అసత్యము. సృష్టి, నాశనము, సుఖము దుఃఖము, మొదలుగా ద్వంద్వముల పరివర్తన దశలతో-వీని నతిక్రమించిన బ్రహ్మతత్త్వ యోజనతో నిర్మితమైనది. చివరకు శిష్టరక్షణము దుష్టశిక్షణము మొదలుగా సత్యధర్మజ్ఞానాదుల స్థాపనము పరమార్థముగా గలది. ఈ దృష్టితో నన్నయ భారతము చూడవలసి యున్నది. నన్నయ తాత్త్విక ధార్మిక దృష్టి పారమ్యమునకు భీముని బంధనము మరియొక ఉదాహరణముగా గ్రహింపవచ్చును.

దుర్యోధనునిచే కట్టబడిన బంధములు భీముని పరాక్రమాతిశయముచేత ఛిన్నమైనవి. అంతట నీటిలో నుండి బంధవిముక్తుడై పైకెగసినాడు. అపుడు నన్నయ కర్మ బంధనములు గ్రక్కున బాయగనే పుణ్యగతికి నెగయు పురుషునివలె భీముడు నీటి నుండి పైకెగసినట్లు వర్ణించినాడు. భీముని బంధనవిముక్తి తాత్త్వికదృష్టితో అలంకృతమైనది. జీవునకు కర్మబంధనములు విడినగాని ముక్తి కలుగదు. దానికి సాధన కావలయును. ఈ సాధన ఆతడాచరించిన అంగవిన్యాసము బంధవిముక్తియే కర్మ విమోచనము దీనివలన లభించునది పుణ్యగతియైన మోక్షము. ఈ యుపమయందు సామాన్యమైన మాటలలో వేదాంతార్థము కథాగతమైన సంఘటన నాశ్రయించి పాత్రాభిముఖముగా అలంకృతమైనది.

---

1 ఈశావాస్యోపనిషత్తు - 16

లోకమునందు వర్గచతుష్కము పాటించుచు జీవయాత్ర సాగించుట ధర్మశాస్త్ర సమ్మతమైనది. ధర్మార్థకామమోక్షములలో చివరిది మోక్షము. జీవుడు కోరదగినది. ధర్మార్థకామముల అనుభవము మోక్షముకొరకు తీర్చబడుటలో లౌకికమైన దృష్టియే మారిపోవుచున్నది భారతము నందు నాయకుడు ధర్మరాజు. అతనికి వర్గచతుష్టయము బోని యనుజవర్గము గలరు. ఇక్కడ నన్నయ ధర్మజుని పాత్రను ప్రత్యేకదృష్టితో తీర్చినాడు. "తమ్ములయట్టుల తనకు వశమ్మయి ధర్మువును, ధృతియు. సత్యము, కారుణ్యము నొప్పగ"[1] అనుటలో ధర్మజుడు వేద పతిపాదిత తత్త్వమున కాదర్శ మూర్తిగా కన్పించును. ఇందు ధర్మజుడు పురుషార్థ సాధకుడుగా కన్పించును. స్వర్గారోహణము వరకు మిగిలిన ఒకేఒకడు ధర్మజుడు. వర్గచతుష్టయమువంటివారు అనుజులు మధ్యేమార్గమున ఒక్కొక్కరు పోగా మిగిలినవాడు సారభూతమైన ఆదర్శ మూర్తి. మూలమును పరిశీలించినచో ఈ సందర్భమున "భ్రాతృభిస్సహితో రాజన్" అని మాత్రము కలదు. వర్గచతుష్టయంబునుం బోని యనుజులని ఉపమాలంకారము చేత నన్నయ కథాప్రయోజనమునకు, పాత్రచిత్రణమునకు వన్నెకూర్చినాడు.

ఏయది హృద్యము, అపూర్వము అఘనిబర్హణము ఏయది వినిన ఎఱుక సమగ్రముగా కలుగునో అద్దానికి నన్నయ వ్యాసహృదయమునకు వ్యాఖ్యానసుందరముగా తెలుగునందు నిర్మించెను. ఈనిర్మాణము కావ్యదృష్టితో ఆలంకారిక రచనాశోభిత మైనది. ఇందు ఉపమాలంకార మెట్లు తత్త్వప్రపంచనమునకు సాధనమై పరమార్థమును సాధించినది పరిశీలించుటయే ప్రస్తుతోద్దేశము.

ఆర్షమతియైన నన్నయలోని కవిరూపమును ప్రకాశింపజేయు అలంకారములలో నొకటి ఉపమాలంకారము. ఇందలి 'ఉపమాశైలూషి' నాట్య విన్యాసముతోపాటు అంతస్తత్వ పరిశీలనారూపమే ఈ సిద్ధాంతవ్యాస రచన.

---

1. ఆదిపర్వము - 8 ఆ - 48

# అనుబంధము

## ఉపయుక్త గ్రంథ సూచిక


| | | |
|---|---|---|
| 1. ఆంధ్రధ్వన్యాలోకము | వేదాల తిరువేంగళాచార్యులు | 1968 |
| 2. ఆంధ్రమహాభారతము (సంశోధితముద్రణము) | నన్నయ | |
| 3. ఆంధ్రమహాభారతోపన్యాసములు | ఆంధ్రసారస్వతపరిషత్తు | 1956 |
| 4. ఆంధ్రవిజ్ఞానసర్వస్వము (ద్వితీయసంపుటము) | సంపాదకులు : కె. వి. లక్ష్మణరావు | |
| 5. కావ్యాలంకార సంగ్రహము | వివరణకర్త : సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి | 1945 |
| 6. చంద్రాలోక సమున్మేషము | స్వాత్రిశ్రీ | 1978 |
| 7. నన్నయగారి ప్రసన్నకథా కలితార్థయుక్తి | విశ్వనాథసత్యనారాయణ | 1970 |
| 8. నన్నయభారతము | దివాకర్ల వెంకటావధాని | 1960 |
| 9. నాట్యశాస్త్రము | P. S. R. అప్పారావు | 1959 |
| 10. కావ్యాదర్శమ్ | దండి | 1958 |
| 11. కువలయానందమ్ | అప్పయ్యదీక్షితులు | |
| 12. గురుబాలప్రబోధిక | వావిళ్ళ ప్రచురణ | 1958 |
| 13. నాట్యశాస్త్రమ్ | భరతుడు | 1934 |
| 14. నాట్యశాస్త్రవ్యాఖ్యా | అభినవభారతి | |
| 15. భామహాలంకారమ్ | భామహుడు | |
| 16. మహాభారతమ్ | Edi. P. P. S. శాస్త్రి | 1981 |

17. An Introduction to Indian Poetics
V. Raghavan & Nagendra 1970
18. Art Experience M. Hiriyanna 1954
19. Ananda Vardhana's Dhvanyaloka
K. Krishnamurty 1974
20. History of Sanskrit Poetics P. V. Kane 1961
21. Some Problems of Sanskrit Poetics S. K. De 1959
22. Studies on Some Concepts of the Alamkara Sastra V. Raghavan 1973, 1977
23. Survey of Sanskrit Literature
C. Kunhan Raja 1962

# ఉపమాలంకారములు

(అకారాదిగా)

### అ, ఆ

## ఇ, ఈ

